# విద్యాధరి

(ప్రథమ భాగము)

శివసాహస్రి

విద్యాదేవ కులపతి

పి. వి. యల్. వి. ప్రసాదరావు

# శి వ సా హ స్రి

*కృతిప్రకృతి

*ఆవిష్కృతి

*అమరీత్రిశతి

*ఆంధ్రీసప్తశతి

ప్ర క ట న

వికారి  మహాశివరాత్రి

## కృతి ప్రకృతి

విద్యాదేవ కులేంద్రుని
విద్యాధరి-అమృత మధుర వీచీ విద్యుద్
విద్యా పీఠ ప్రకటిత
ఆద్య రసానంద తత్త్వ మథ్థుల కొసగున్

శివ సాహస్రిగ వెలసెను
భవముల చెండాడు ప్రథమ భాగము - దీనిన్
నవ నవతా నవ కవితా
ప్రవిమల రస రంగ సీమ ప్రజ కందింతున్

ఎన్ని యుగమ్ముల తలపో
ఇన్నాళ్ళకు వెలసె నవ్య కృతి - ఆకృతిగా
మన్నికైన మనీషులు
మన్నింతురుగాక తగిన మర్యాదలతో

కులపతి పలికిన పలుకులు
కుల శైలము లున్న దాక క్రొందళుకులతో
వెలయఁగలవు వెలుగులతో
నొలయఁగలవు విశ్వమెల్ల నుల్లాసముతో

ఒక్కొక్క పదము లోపల
ఒక్కొక్క విచిత్రమైన ఊహాస్ఫురించున్
ఒక్కొక్కప్పుడు నాకే
ఇక్కావ్య మదొక్క వింత సృష్టిగఁదోచున్

ఒక ఉన్నతి – ఒక ఉద్ధతి
ఒక దివ్యావేశ మొసగు ఉన్మాదము – సం
చకితాఖిల సమ్మోహనము
ఒక నాకున్నట్టి ఉజ్జ్వలోద్రేకమునఁ—

లౌకికమౌ ఉత్సాహము
లౌకిక కార్యముల చెంత రాణింపదొకో
నాకథ తలచిన కొలదిని
నాకన్నుల ముందు వింత నాట్యము సేయుఁ

కొన్ని కలలోన కన్నవి
కొన్ని కలలలోని కలలు కూర్చినవింకఁ
కొన్ని యిలలోన విన్నవి
అన్నియు నిలుపంగ నెంతొ నటు తరమైనఁ

**ఆవిష్కృతి**

భార్గవుడను పిలవతినని
భర్గుం డాజ్ఞ యిడె నాదు పద్యముల కవితా
స్వర్గంగ ఉదయ మయ్యెన్
దుర్గా కృప నెపుడు వెలుగు త్రోవలె లోచున్

ఒక దేశికోత్తముం డుపదేశ మొనరించె
మహనీయ తర సిద్ధ మంత్ర విద్య
ఒక పండితేంద్రుం డుత్సుకత మీర నొసంగె
సాహిత్య సౌహిత్య శాసనంబు
ఒక కవి గ్రామణి ప్రకటితంబుగ నిచ్చె
రమణీయ కావ్య నిర్మాణ శక్తి
ఒక మల్ల శేఖరుం డకలంకముగ నిచ్చె
నుద్ధతంబైన బాహూగ్ర విద్య

ఎందరో కూడి విద్యల నెన్నొ నేర్పి
నన్నొకని నింత వాని నొనర్చి నారు
ఆమహా పండితుల్ గురుల్ ప్రేమ మయులు
సలిపెదను వారికెన్ నమస్కార శతము

ఆశు ధారా కవితావేశ కల్పన
మ్మది మంచి నీళ్ళ ప్రాయమ్ము మాకు
అవధాన సంవిధా సాధాన సాధంబు
వెన్నతోఁ బెట్టిన విద్య మాకు
సాహిత్య సౌధాగ్ర శాస్త్ర ప్రపంచంబు
డంబైన కంఠ పాఠంబు మాకు
నవనీత నవనీత కవితా విలాసంబు
భావ దేవీ ప్రభావంబు మాకు

మధుర మందార మాకంద మధు మరంద
లలిత లాలిత్య లావణ్య లాలనంబు
రాజ వీధీ సుధీ విహారంబు మాకు
విబుధ వరులార! విజ్ఞాన వినుతులార!
సరస గుణులార! పండిత చంద్రులార!

ఆలింపరా? యేమి? అస్మత్కథావళుల్
పరికింపుఁడయ్య! విద్వాంసులార!
వీక్షింపరా యేమి? వివిధావధానముల్
వినుడయ్య! చెవులార! విబుధులార!
ఎఱుగరా యేమి! విస్ఫురిత మత్కావ్యముల్
సాగిరండయ్య! విజ్ఞానులార!
తలఁపరా యేమి? మంజులకళాకలనముల్
గ్రహియింపుఁడయ్య! వాఙ్మహితులార!

ఇవి మనోహర కావ్యమ్ము లివి మనోజ్ఞ
దర్శనమ్ములు భావ సంస్పర్శనములు
ఇంపు మీరంగ రసము గ్రహింపుఁడయ్య!
ప్రేమ మీరంగ విని ఆదరింపుఁడయ్య!

సకల దిగ్దంతీంద్ర శ్రవణ సంచాలన
వ్యగ్ర ప్రతాప సంభావితములు
అఖిల లోకాకర్షణారంభ సంరంభ
వశ్య వాగ్వైభవ ప్రాభవములు
మణి మహౌషధ మంత్ర మథన మానస సుదృ
ఙ్మండ లోచ్ఛలిత దిఙ్మండలములు
భుజగ భూషణ మహోభ్రూమధ్య రేఖికా
భుగ్నాగ్ని నిర్భగ్న భూధరములు

ప్రళయ ఝంఝా మరుద్వేగ పటల సంభ్ర
మాభ్ర శుభ్రాభ్ర విభ్రమీ విభ్రమములు
మాకవిత్వమ్ము లెపుడు మీ మానసముల
సంచరించుత సత్కవి చంద్రులార !

మహనీయతర సిద్ధ మంత్ర శాస్త్ర రహస్య
కలితోపదేశముల్ కాంచినాము
అంకించి నాటకాలంకార శాస్త్రముల్
చేరి అధ్యయనంబు చేసినాము
శబ్ద శాస్త్ర సమగ్ర సౌధాగ్ర శిఖరమ్ము
లాధికారిక యుక్తి నరసినాము
బహుముఖీన మఖీన పథ కావ్యమర్మముల్
నియత నిష్ఠాగతిన్ నేర్చినాము

ఆంధ్ర గీర్వాణ భాషా మహార్ణవంబు
తిరిగి శోధించి సుధలు సాధించినాము
మమ్మెరిగి మామకీన భావమ్మెఱింగి
సహృదయతఁ జూపుఁడయ్య రసజ్ఞులార !

వచియింతునా యేమి? పాణింధమారీణ
పారీణ భావ సంభావనములు
రచియింతునా యేమి? లలిత లాలిత కళా
లావణ్య లాస్యైక లాలనములు
కల్పింతునా యేమి? గాఢ గూఢ నిరూఢ
కల్యాణ కారుణ్య కౌతుకములు
నిర్మింతునా యేమి? నిర్నిబంధ నిబంధ
నియమోహ నియతోక్తి నిర్ణయముః

పండితులు మీరు రమ్య భావనులుమీరు
సహృదయులు మీరు సద్విమర్శకులు మీరు
మామకీన కవిత్వ సంభావనంబు
మీరు పరికింపుఁడో ప్రజా మిత్రులార !

మహిత మర్మ మహోఽగ్ర మంత్ర శాస్త్రరహస్య
నిధులు కొందరిచే గణించినాడ
ఆంధ్ర గీర్వాణ విద్యాంభోధిరత్నముల్
తిరిగి కొందరి చెంతఁదెచ్చినాడ
ప్రాజ్ఞ ప్రసంగ చర్చా వేల వివిధ శా
స్త్రములు కొందరి యొద్ద చదివినాఁడ
వివిధ వాద రహస్య విజ్ఞాన విషయ సం
హితలు కొందరిచే గ్రహించినాడ

కలుష విద్వత్కవీశ్వరుల్ కలరు మహిత
మంత్ర శాస్త్ర ప్రవీణులు మాకు గురులు
వారి వారికి మన్మన స్స్పందనములు
వందనమ్ములు-శాబ్దిక స్యందనములు*

* ప్రథమ పద్యమునకును దీనికిని విప్రతిపత్తిలేదు. అది ఏకదేశముగా ప్రధానతను సూచించుటకును ఇది సర్వాంగీణతను భావించుటకును పలుకఁబడినవి.

అఖిల విద్వద్వరేణ్యు లవధాని శేఖరుం
డనుచెల్ల అభిమాన ఘనత నేమొ
మంత్ర శాస్త్రజ్ఞులు మహనీయ తిర సిద్ధ
మాంత్రికుం డనుట ప్రేమమున నేమొ!
ఇంద్రజాల మహేంద్రు లైంద్ర జాలికుఁడంచు
వచియించు టాదర ప్రకృతినేమొ
మల్ల విద్యలు మహా మల్ల నాయకుఁడంచు
పలుకుట హృదయ వత్సలత నేమొ

ఏదయిన నేమి! యీఆంధ్ర హృదయములకు
ఇంత ఆనంద మిచ్చిన నంతె చాలు
ఈప్రసాద గాయోదిత సుప్రసాద
వాక్కులివి నిల్చు దిక్కులు వరలు దాక

నాక ధునీ తరంగ సరస ప్రతిభాశు కవిత్వ విస్ఫురత్
ప్రాకట పాండితీ పథ విధానము లష్ట శతావధానముల్
జోకగఁ జేసినాఁడ నొక షోడశ వర్షము లేని లేని నా
డే కవి చక్రవర్తులు బుధేశ్వరు లద్భుత మంది మెచ్చఁగన్.

లలిత కళా విలాస సమలంకృత కావ్య కథా ప్రసన్నతన్
పలికెద నేను వందలకు వందలు శైవ జటా నటద్ధునీ
కలిత మహోగ్ర వేగ రస గాఢ పథంబులు పద్యజాలముల్
సలుపగ నేర్తు నుజ్జ్వల ధనాఢ్య విచిత్ర విధా వధానముల్.

గంటకు నూరు పద్యము లఖండిత వీర మహాశు ధారతో
గొంటుదనమ్ము లేక రసికుల్ తలఁబూపఁగ పల్కఁబంగటిం
గంటలు కట్టి మెచ్చిరి ప్రకాండులు పండితు లాంధ్రభూమి నే
గుంటురి వాఁడ సత్కవులకున్ గడు నచ్చిన వాఁడ నెప్పుడున్.

కాంక్షింతురా? మీరు—కమనీయ కల్పనా
కల్ప శిల్పానల్ప కల్పనములు
వాంఛింతురా? మీరు—ప్రజ్ఞా పరీణతి
ప్రత్యగ్ర వైభవ ప్రాభవములు
ఊహింతురా? మీరు—మోహా నోహాంతర
వ్యాహార నిర్ఝరా ప్లావనములు
పాటింతురా? మీరు—పద పదా భ్యుదిత సం
ధ్యా కాల నట రాజ నర్తనములు

ఈ విశిష్టాంధ్ర సీమలో ఇప్పుడున్న
భావుకుల లోన పండిత ప్రభుల లోన
కవి వరుల లోన రసిక శేఖరుల లోన
ఎవరు హృదయాల నేమి ఊహింపఁగలరో!

ఎవరు భావమ్ము లందేమి యెంచఁగలరో!
ఎవ్వ రే రీతి రచనల నెంత ఆద
రింతురో గాని వీరైన యంత వరకు
చెప్పఁ బూనెద సుకవితా సిద్ధి వెలయ.

ఇట్లు పలుకుచు నెగ్గుచు నెట్టి యెడల
తెలుగునను సంస్కృతంబున తిరుగుచుంటి
ఇది అహంకార మని కొంద రెదఁదలంతు
రైన హృదయంబు నెరిగిన నట్టు లనరు.

నేను చేసిన అష్టావధాన మొకటి
రేడియోలోన విని హితశ్రేణి తోడ
సరస మూర్తి శ్రీకల్లూరి చంద్రమౌళి
మక్కువన్ దాను చేయించె నొక్కసారి.

పేరు గల వాడు-కలవాడు పెద్దవాడు
ఆతఁ డిల్లిల్లు తిరిగి స్వయముగ పిలువ
సలిపె నూర్ల నూత్న వస్త్రము లొసంగి
ఉజ్జ్వలంబగు నావధా నోత్సవమ్ము.

దాని కాహూతులైన సజ్జనుల యందు
ధన్యు డొక్కండు సోమసుందర బుధుండు
దైవభక్తుఁ డుదారుఁడు ధర్మపరుఁడు
స్నిగ్ధ హృదయుండు శ్రీ పోలిసెట్టి కులుఁడు.

ఈవధానాళి రీతియు నిట్టి శక్తి
ప్రతిభయును పాండితియు సపూర్వంబటంచు
తాను నేదైన నొక్క రూపాన నింత
సత్కృతిని జేయవలె నంచు వాలఁదలచి.

నిజ హితుండైన ఏకాంజనేయుతోడ
సరసు డాతను వెంటనే సంప్రతించి
వారి ముఖమున నాకొక వార్తనంపె
దాని ఫలితమె మరల వధాన మొకటి.*

---

*అష్టావధానము

గుంటూరు శ్రీ రామ నామ క్షేత్రములో శ్రీ పోలిసెట్టి సోమ సుందరంగారు "విద్యాదేవకులపతి" శ్రీ పి. వి. యల్. వి. ప్రసాద రావుగారిచే 10–10–'59 సాయంకాలం దేవీ నవరాత్రులలో మహా ర్నవమినాడు చేయించిన అవధానములోని విషయములు.

అధ్యక్షులు:- అవధాని శిరోమణి, మహోపాధ్యాయ, మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు.

సభానిర్వాహకులు.- శ్రీ ఏకా ఆంజనేయులుగారు.

సభా ప్రారంభమున అవధానిగారు చెప్పిన పద్యములలో కొన్ని.....

చేసెనొ లేదొ యీతఁడు విశిష్ట వధానము లంచు కొందర
భ్యాస వశమ్మునన్ పలుక వచ్చును వారల మాటకేమి-నా
కోసము వచ్చి యున్న బుధ కోటి యెఱుంగును నన్ను కొంత-చం
డీ! సరి లేని ప్రజ్ఞ కరుణింపవె! నిన్ను సమాశ్రయించితిన్.

భాసిత పద్మ సద్మ రుచి బంధుర తావక పాద చింతనా
త్యాసవ పాన మత్త మధురాదర చిత్త వరప్రసాద వి
న్యాస మహాశు ధారకు జనావళి బొమ్మల వోలె నిల్చి వి
ద్యాసము డీతఁడంచు పలుకాడరె తల్లి! సభాంగణమ్ములన్

ఈసభలోని పండిత మహేంద్రులు నాఅవధాన వేళ ఓ
హోహో! సరిలేని వాడె యితఁడూహల కందని భవ్య పాండితీ
భాసిత మూర్తియంచు తమ భావము లందు తలంచు నట్లు నీ
హాస విలాస రేఖ - అమరాధిపశక్తి! ననున్ వరించుతన్-

ఎంతటి వారు వీరు సుకవీంద్రులు-సాంద్ర వచో విలాస వి
భ్రాంత నరేంద్రు లీవిబుధ వాక్పతి చంద్రులు వీరి ముందు స
త్స్వాంతర సత్కవిత్వ సముదాత్త సముల్లసనంబుఁజూపఁగా
నెంతటి ధైర్యమిచ్చెదవె? యింతటి ప్రేమ మెయిన్ దయామయీ!

కల్లూరి చంద్రమౌళి గుణ గణ్యుఁడు తద్గృహ మందు భావ సం
ఫుల్ల యశః ప్రసారముగ మొన్న నిటీవల ఒక్క నాడు శో
భిల్లిన మద్వధాన గుణ విశ్రుతిఁ జూచిన పోలిసెట్టి వం
శోల్లసితుం డొనర్చిన మహోహాహకు రూపము వచ్చె నిట్టులన్

వశుఁడయి మద్వధాన విభవ ప్రతిభాగతికిన్ సముల్లస
ద్యశుఁడగు సోమసుందర సమాఖ్యుఁడు తాను కవీంద్ర గౌరవ
ప్రశయ గుణాఢ్యుఁడై వెలయు వాఁడగుటన్ దలపోసె దీనినిన్
కుశల మనస్కులై విబుధ కుంజరు లుందురు గాక ఇచ్చటన్

ప్రాకట్యంబుగ కష్ట మెంచను తెలంగాణ లోక ధన్యాత్మ ప్రజా
పేకా వంశ పయోధి శీత కిరణుండై హాంజనేయాహ్వయుం
డీకార్యంబును నిర్వహించె సకలం విద్యాప్రమోదంబుతో
ఆకవ్యంతర మూర్తి కాంచుత సుదీర్ఘాయుశ్శుభారోగ్యముల్

ఆశాంత కీర్తి విభవ మ
హాశయునకు నేటి సత్సభాధ్యక్షునకున్
కాశీ కృష్ణ బుధేంద్రున
కాశీర్వాదంబొసంగ నంజలిసేతున్.

దత్తపది.- శ్రీమిన్నికంటి గురునాథ శర్మ గారు.- పోలి-సెట్టి-సోమ-సుందరం, అనుపదములను నాల్గు పాదములలో భగవంతుడు రక్షించుగాక అను భావము వచ్చునట్లు ఆపదముల కాయర్థము రాకుండ వర్ణించునది.

తే. గీ॥ ఒగిని రాముండు కాచు పెంపోలి వెలయ
శ్రితుని నెరసెట్టి దైన యోజింప కుండ
గ్రాస వాసోమహత్వంబు కలుగఁజేసి
ఆత్మదాసుందరంగితా పొంగకరుణ.

నిషిద్ధాక్షరి.- శ్రీచతుర్వేదుల అమరయ్య శాస్త్రిగారు.-శ్రీరామ వర్ణన కంద పద్యములో చెప్పునది-ప్రత్యక్షర నిషేధము.

కం॥ శ్రీన్యాస ప్రత్యక్షా!
విన్యక్ష విభావ రూఢ! ప్రేమానూహ్యా!
మాన్యాన్త స్సంపూజ్యా!
మున్యగ్రసరాంతరంగ మోహిత! రామా!

సమస్య:- శ్రీఉప్పుటూరి పున్నారావుగారు.

"తెనిలోపల జగములెల్ల తూగుచు నుండెన్"

'భగవంతుని' అని వేసికొన వచ్చునని ఒకరనగా అది గాక ఎన్ని విధములనైన పూరింపవచ్చునని పల్కుచు చేసిన పూర్తి—

కం॥ మనసేమో ఉప్పొంగెను
తనువది తానొందె నేదొ తత్తరపాటున్
కన బుసుర్రాజైన వసం
తుని లోపల జగములెల్ల తూగుచునుండెన్.

వ్యస్తాక్షరి - శ్రీ ఓపుగంటి వేంకట కృష్ణయ్యగారు. (కృష్ణభిక్షు)
"ఈవధానమెల్ల ఏకాంజనేయుచే
అందఁజేసె సోమసుందరుండు."

గణితము - శ్రీ కర్పూరపు రామకృష్ణమూర్తిగారు, తదితరులు (ఒక తేదీయిచ్చి అది ఏవారమో చెప్పుమనుట) అడిగినవారి కెల్ల సక్రమముగ చెప్పిరి.

## వర్ణనలు

(1) శ్రీ కల్లూరి చంద్ర మౌళి గారు-కవి, ఉన్మత్తుడు, వేదాంతి, బాలుడు—ఈనలుగురు ఒక స్త్రీని చూచినపుడు వారి భావము లెట్లుండును ?

మ॥ నవలా రత్నముఁ జూడ సత్కవి రసానందంబునన్ పొంగు; దు ర్భవు డున్మత్తుడు చెప్పగాదగని భావ స్ఫూర్తి నూగాడు; నై భవ సౌఖ్యంబును దుఃఖమింతయు తలంపంబోడు వేదాంతి; బా ల విశేషంబది పల్కనేల? అది అల్పంబంచు నేవీడెదన్—

(2) శ్రీఅమరేంద్ర (శ్రీచతుర్వేదుల నరసింహ శాస్త్రిగారు)– ప్రాచీన కాలమున శోకము శ్లోకమై వెలసిన సన్నివేశము; ఈనాఁడు నవ కవులపై సమాజముపై దాని ప్రభావము.

ఉ॥ శోకము శ్లోకమై పలుకు సుందరమై అలరారె మున్ను వా
ల్మీకికి –నేడు సత్కవులు లేరొ సమాజము తీరదేమొ గా
నీ కనుపింపఁబోదొక వినిర్మల సత్కవితా విలాసమో
హో! కవి లోక మెల్ల నవయోధులఁగాం మను గాక ఇంతటన్.

(3) శ్రీమండలపర్తి ఉపేంద్రశర్మగారు– సంస్కృత ప్రాధాన్యము, దానిపై ప్రభుత్వము, పరిషత్తుల దృక్పథము వివరింపవలసినది.

శా॥ ఋక్సామంబు లథర్వణంబును యజుర్వేదంబు షట్శాస్త్రముల్
దృక్సౌజన్యము సంస్కృతాన నలరారెన్–దాని వాంఛింతురా
ప్రాక్సత్పద్ధతి పండితావళి–ప్రభుత్వంబేమి కావించునో
వాక్సీమంతిని! నీదె భార మనుచున్ ధ్యానింతు నే నిచ్చటన్.

(4) శ్రీఎక్కిరాల కృష్ణమాచార్యులుగారు–ఎక్కువ కట్నము వస్తుందనే ఆశతో పెండ్లి పీటలమీద కూర్చున్న వరునికి పరీక్షలో తప్పినట్లు తెలుస్తుంది. అప్పు డతని భావ మెట్లుండును?

వసంత తిలక:- దుఃఖ ప్రభుగ్నముగ తోచును విశ్వమెల్లన్
గీఃఖర్వమయ్యె విజిగీష పరీక్ష తప్పన్
స్వాఃఖేలన ప్రణయ సాహసిక ప్రభావో
చ్చైఃఖేద మాతనికి సాగె వివాహ వేళన్.

న్యస్తాక్షరి:- శ్రీధనకుధరం వేంకటాచార్యులుగారు.
శివ ధనుర్భంగము అనుష్టుప్ శ్లోకములో చెప్పవలెను.

"సదాశివ ధనుర్భంగ కళ్యాణ మయ మహాసనం
వందేఽహం రాఘవం రామం సీతా భావ మనోహరం"

పురాణము - శ్రీమానూరి వేంకట రమణయ్యగారు–భాగవతము లోని కొన్ని ఘట్టములు పఠింపగా వ్యాఖ్యానము చేయఁబడినవి.

అప్రస్తుత ప్రశంస - శ్రీ సీతా ఆంజనేయులు పంతులు గారు–అత్యంత సమర్థతతో సభను నిర్వహించుచు మధ్య మధ్య చమత్కారవంత మైన ప్రశ్నలనేక మడుగగా సమాధానముగా చెప్పిన పద్యములలో కొన్ని.

1. అవధానము జరుగు చున్న శ్రీరామ నామ క్షేత్రము–

శా॥ అక్షయ్య ప్రతిభా విహారులు, సముద్యచ్చిత్ర విద్యావళీ
దీక్షా కంకణ ధారు లుజ్జ్వల సుధా ధిక్కారి వాచస్పతుల్
ప్రేక్షత్పండితు లిందరున్ ముదమునన్ పెంపొంద శ్రీరామ నా
మ క్షేత్రం బిది మద్వధాన కవితా మర్యాద పాటించుతన్.

2. అక్కడి గోడలపై చిత్రింపఁ బడిన రామాయణ ఘట్టములలో వాలి సుగ్రీవ యుద్ధము–

గీ॥ అతివ కొరకు రాజ్యము కొర కన్న చేత
చావు దెబ్బలు దిన్న సుగ్రీవుడు తుద
జయము గాంచెను శ్రీరామ చంద్రు కరుణ
వాలి మరణించె నారామ బాణ కలన.

3. ఆంజనేయుడు సముద్రమును లంఘించు దృశ్యము–

శా॥ సీతా మాతకు అంగుళీయక యుత శ్రీరామ సందేశమున్
చేతః ప్రీతిగ భక్తి భావ విభవ శ్రీతోడ నందింప–ని
ర్భీతిన్ వాయు సుతుండు దిక్తతులు కంపింపన్ సముద్దీపితా
లాతంబో యన రేగి ఘోర జలధిన్ లంఘించె నత్యుద్ధతిన్–

4. మగ దయ్యము, ఒక స్త్రీ—వారి దాంపత్య మొక వేళ ఉన్నచో ఎట్లుండును?

కం॥ మగ దయ్యము మనుజాంగన
అగునని వర్ణింప వశమె ఆదాంపత్యం
బగణితముగ నలరారును
జగమందు ననన్య పూర్వ సంసారంబై.

5. అవధానమును గూర్చి-

కం॥ నవ్యా వధాన కవితా
భవ్య విధాన మిది భావ పరిణత జీవత్
కావ్య కళా పరీవాహ
స్త్రవ్య విలాసముల తోడ సాగును గాతన్.

కం॥ నవ్యావధాన కవితా
భవ్య విధాన మిది అష్ట భావన భర మం
తవ్య మహాధిక గుణ సం
భావ్య విభావములతోడ వరలును గాతన్.

కం॥ నవ్యావధాన కవితా
భవ్య విధాన మిది నిత్య పరిమళిత రసా
ధివ్యసన రమ్య రసనా
భివ్యాసంగమ్ముతోడ వెలయును గాతన్.

కం॥ నవ్యావధాన కవితా
భవ్య విధాన మిది విబుధ వందిత మేధా
సవ్యాపసవ్య విహరణ
దివ్యావేశమ్ము తోడ తిరుగును గాతన్.

కం॥ నవ్యావధాన కవితా
భవ్య విధానమిది ప్రకట పద్య ప్రజ్ఞా
కు వ్యవసాయ విదారణ
సు వ్యాహారమ్ము తోడ శోధిత మగుతన్.

కం॥ నవ్యావధాన కవితా
భవ్య విధాన మిది కావ్య పథ సంచార
క్రవ్యాద ప్రచ్ఛేదక
కవ్యాశు పదాసి గతుల కదలును గాతన్.

అవధానము చివర పోలిసెట్టి సోమ సుందరం గారిని గూర్చి చెప్పినవి:—

కం॥ కొందర కొక మార్గంబున
కొందర కింకొక విధానఁ గూర్తువు తృప్తిన్
అందరు నిను ఘనుఁ డందురు
సుందర సత్కీర్తి! సోమసుందర మూర్తీ!

కం॥ త్రిభువనములు కీర్తించెడి
ప్రభుతన్ వెలసెదరు సుకవి వరులా వాణీ
విభులు నిను మెచ్చు కొనగా
శుభములు కనవయ్య! సోమసుందర! యెపుడున్.

కం॥ శ్రీ పోలిసెట్టి కుల మది
యీ పట్టణ మందు కీర్తి నెసగుట సత్య
మ్మా పేరు నిలిపినావని
చూపించెద నిన్ను సోమసుందర! యెపుడున్.

సభాంత మందు పృచ్ఛకులు అవధానమును ప్రశంసించుచు ప్రసంగించిరి. అధ్యక్షులు శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు అవధానమును

ఆవధానంబు సత్కార మైన గాని
అంతతో తృప్తి కలుగదా అనఘ మతికి
మరల ఏకాంజనేయుతో మంతనమున
కృతియొకటి వారి యది ప్రచురింత మనిరె.

ఇచ్ఛ గలుగువాడు -ఇప్పింప గలవాడు
సరస మూర్తి కడు రసజ్ఞు డతడు
నాకవిత్వమునకు నచ్చిన వాడైన
మహితు డాంజనేయ మధ్యవర్తి.

అవల వృత్తాంత మెల్ల ప్రేమార్ద్రు డతడు
ధార్మికుడు చెప్పె మత్కవితా ప్రియుండు
సిరి వలచి వచ్చె తానయి చెంతఁజేర
వద్దనెడు నంత శక్తి నాయొద్ద లేదు.

కాల మొక్క రీతి కలసి వచ్చిన వేళ
తన ప్రయోజకత్వ మనును నరుడు
ఈకవిత్వ మెంత? ఈమహత్వ మ్మెంత?
శివుని యాజ్ఞ లేక చెల్ల గలదె?

---

మెచ్చుకొనుచు తమ అనుభవములో నిటీవలి యేబది యేండ్లలో ఇంత సమర్థతతో నైపుణ్యముతో అవధానము చేసిన వారు లేరని, శ్రీకల్లూరి చంద్రమౌళి గృహములో తాము అధ్యక్షులుగా పృచ్ఛకులుగా నుండి 'సరస్వతీ కంఠాభరణ' అని యిచ్చిన బిరుదము సర్వజనాంగీకార పాత్రమైనదని, సార్థకమైనదని, అత్యుత్సాహముతో పలికిరి. శ్రీపోలిశెట్టి సోమసుందరంగారు స్రక్చందన తాంబూలాదులతో నూటపదారు రూప్యములును, నూత్నవస్త్రములును ఇచ్చి అవధాని గారిని సత్కరించిరి. అధ్యక్షులకును పృచ్ఛకులందరకును శాల్వ లొసగిరి.

**(సాధన మాసపత్రిక నుండి)**

ఆమహాత్మ్మ కరుణ అంతరంగము నందు
స్వానుభవము నాకు సతము కాన
హారున కంకితముగ నాతనినే గూర్చి
కల్పనమ్ముఁ జేతు కావ్య మొకటి.

ఒక్క దివ్యమైన ఉద్రేక ముప్పొంగి
తీవ్ర మైన కావ్య దీక్ష తోడ
చేయువాడ నేను శివ సహస్రమ్మును
కలిగినట్టి కవిత కలఘు ఫలము.

నేను వేయి కూడ జాను తెనుంగులో
పాడునట్టి తలపు తోడ నుంటి
వింత మైన రీతి విధి విధానమ్ముగా
జరుగు దాక నొక్క సంఘటనము.

పరమ మిత్రు డొకడు ప్రాణ సమానుండు
కొంత వరకు కవిత గూర్చువాడు
లలితమైన గుండె కలహితుం డాతండు
పలికె ప్రణయ వినయ భాషణముల.

నేను మొదలు గాగ నీకడ నుపదేశ
మొందినట్టి జనము లున్న వారు
మహిత మార్గ మలర మా మంత్ర జపముల
కెసగ వలయు నీదు కృప యొకింత.

నీవు వ్రాయఁ బూను నీ మహాకావ్యమ్ము
ప్రధమ పాఠకునిగ వలతునేను
కాని నాకు కలదు కాంక్ష యొక్కటి నీవె
తీర్ప వలయు ముదము గూర్ప వలయు.

తెనుగు తేనె కంటె తీయనైన పటంబు
పూజసేతు హృదయ పూర్వకముగ
కాని సంస్కృతమున గల శక్తి నీవమె
స్పృహను నందు నత్యపూర్వ మనుచు.

సాధకులము మేము సాధనా మార్గాన
చేతనైన భక్తి చింత గలదు
శబ్ద శక్తి నీకు చాల గల్గును గాన
వ్రాయ రాదె-అమర భాష కొంత.

రెండుభాష లందు ఉండిన దధికార
మధిక తపము చేత నలరు వాక్కు
కలదు మంత్ర విభూతి కావలసిన దేమి?
మాదు కోర్కె తీర్ప రాదె? నీవు.

ప్రొద్దు పొడుచు వేళ ప్రొద్దు గ్రుంకెడు వేళ
నిశల లోన నింపు నిద్ర వేళ
తలచు కొనగ నాకు తలపు శంకరు మీద
కొన్ని శ్లోకములను గూర్ప మీవు.

గురుడవైన సుకవి కుల మహేశుడవైన
చిన్న నాటి నుండి స్నేహితుడవు
పలుక నిట్లు నాకు స్వాతంత్ర్య మున్నది
నీవె చూడ వలయు నింపు కెడద.

నీవు దేశికుడవు నీశ్లోకములనె నే
చదువనెంతు ధ్యాన సమయములను
ఇదియు నాకు వాంఛ యెప్పటినుండియో
ఇపుడు వచ్చె సమయ మిది వచింప.

అనినహితుని మాట అల ఉపశ్రుతివోలె
నాటుకొనియె నామనస్సునందు
సలుపవల్లె నాకు సంకల్పము జనించె
శివుని లీల లెంత చిత్రమౌర!

తనకు సమసులన్న తగని ప్రేమయటంచు
కవిని మరతు ననియొ గరళ గళుఁడు
తనకు అమర భాష యనిన నిష్టమటంచు
పలికె మిశ్ర రూప భాషణముల.

అతనికి ప్రియ మైన ఆకార్యమును నేను
నవ్వుకైన కాదనంగ నేల?
అఖిల విభునితోడ ఆటలాడుట యెందు
కల్లై చేసెదను శివాజ్ఞ యనుచు.

అమర భాషలోన సజరామరమ్ముగా
త్రిశతి వ్రాతు విశ్వ దేశికునకు
ఆంధ్ర భాషలోన సఘుగుల కందింతు
ప్రాప్త మతిని-నూత్న సప్తశతిని.

భక్త కోటి కెల్ల పారాయణ గ్రంథ
మాంధ్ర భూమి నేటి కవతరించె
అనిన హితుని మాట అభిమాన పూర్వకం
బనుచు కావ్యముంతు జనుల ముందు.

ఈకృతిని మంచి చెడులతో ఇంచుకంత
నాకు పనిలేదు కలుగ దేనాటికైన
వ్రాయువేళల ఈశివ గ్రంథ మందు
నేను కర్తృత్వ ముంచుకోఁ బోనుగాన.

భద్ర మగును గాక! మున్ముందు గూర్చి
ఏమి పలుకుటకును నేనెఱుంగ?
అతని పుణ్య ఫలమొ ఆతనికిం గూర్చు
సకలమైన శాంతి సౌఖ్యములను

కొంత మంది యిహముఁ గూర్తురు దేవతల్
కొంత మంది పరముఁగూర్పఁ గలరు
ఇహము పరముఁ గూర్చు ఈశ్వరుండే వేళ
సోమ సుందరునకు శుభము లొసఁగు.

కవివరేణ్యుచేత శివకావ్య మొక్కటి
జగతి కందఁజేసె సజ్జనుండు
పోలిసెట్టి వంశమున మాన్యుఁడీతండు
విపులసుకృత మనుభవింపఁగలఁడు.

ఒక శివాలయమ్ము నుర్వి కట్టించిన
ఫలము నట్టి పుణ్యఫలము కంటె
సుకవివరుఁడు శివుని స్తుతియించు సత్కృతి
ప్రచురణమ్మె—అధికఫలద మండ్రు

వేయి గొంతు లెత్తి వినిపింతు కావ్యమ్ము
వేయి పద్యములను వేడ్క గనుము
పోలిసెట్టికులవిభూ! నాదు కృతి తోడ
వేల యేండ్లు నీవు వెలయఁ గలవు.

ఇంద్రరూపాయ రుద్రాయ సర్వ శక్తి ప్రదాయినే
నమశ్శివాయ శాంతాయ విస్ఫురద్వజ్రధారిణే*

కులేశ్వరస్య హృదయే రసానంద ప్రవర్షిణే
సుప్త కుండలినీ శక్తి ప్రచోదన విధాయినే

మూలాధార సహస్రార మధ్యమాగ్ని ప్రబోధినే
నమశ్చాక్రికశాక్తేయ జ్యోతిర్లింగ స్వరూపిణే

జ్ఞానశక్తిః క్రియాశక్తి రిచ్ఛాశక్తి మహోదయః
యస్య సంకల్ప సంభూతా స్తస్మై శ్రీశంభవేనమః

---

* ఇంద్రరూపునిగా రుద్రుని భావించుటలో ఒక ప్రత్యేకత కలదు. 'యోవాజినం గర్భమపాం పురాణం, వైశ్వానరం వాహనమభ్యుపైతి' అని భావింపఁబడినశక్రుకు, వేదములలో సర్వశక్తిసంపన్నుఁడుగా పలుకఁబడినవాడు రుద్రుని మరొక రూపమని తపస్వుల తలపు. దానికి ప్రమాణముగా శ్రీకావ్యకంఠ వాసిష్ఠ గణపతి మునుల రచన ఉదాహరింపఁబడుచున్నది.

## ఇంద్రేశ్వరాభేద సూత్రములు

1) ఇంద్రశ్చ శివశ్చ నద్వా
2) ఇంద్రాణీ రుద్రాణీచ నద్వా భవతః
3) ఇంద్రేశ్వరయో రేకార్థత్వాదింద్రేశ్వరాభేదః
4) పురాం భిందురింద్రః, పురభిదీశ్వరోఽపి
5) దేవరాజ ఇంద్రో, మహాదేవ ఈశ్వరోఽపి

6) మహేంద్ర మహేశ్వర శబ్దావపి తుల్యార్థౌ
7) రుద్ర సంక్రందన శబ్దౌచ
8) ఉగ్ర శబ్దోహ్యుభయత్ర ప్రయుజ్యతే
9) ఈశాన శబ్దశ్చ
10) భీమ శబ్దశ్చ
11) ఉభయోరప్యధిభూతం వైద్యుత తేజో రూపత్వాత్
12) మరుదీశ ఏకో భూతేశోఽపరో హి
13) భూతాశ్చ రుద్రాః
14) రుద్రాశ్చ మరుద్భ్యో నాతిరిచ్యన్తే
15) ఉభావపి దుష్టసంహారాయ ప్రేర్యేతే
16) ఉభయోరప్యపారః పరాక్రమో వర్ణ్యతేహి
17) మృత్యుంజయత్వంచ
18) శివ వాహన భూతో వృషో వర్షకత్వాద్వ్యుత్పద్యతే ఇంద్రవాహన భూతాన్మేఘాన్నాతిరిచ్యతే
19) సవృష్ట్యా సర్వానందకరత్వాన్నందీ
20) సేచకత్వాదుక్షా
21) జలాత్మకత్వాద్గౌ
22) అతఏవబహిర్నీలఇవ దృశ్యమానోఽపి శ్వేతో వర్ణ్యతే
23) ఆపోహి శ్వేతాః
24) ఏవంచేత్ ఇంద్రేశ్వరయోర్ద్వైధావ్యవహారః కుత ఇతి చేత్
25) రుద్రో మహాన్ ప్రాణః
26) సోఽధిదైవతమింద్రః
27) మధ్యమన్యాధ్యాత్మికం నామ రుద్రఇతి

నౌమి శంకరం భక్తకింకరం
క్షిప్రసత్తిపో హృద్యశంకరం

దగ్ధమన్మథం స్నిగ్ధమానసం
సిద్ధసంస్తుతం శుద్ధవైభవం

ఫాలలోచనం కాంతిసేచనం
క్రాంతికల్పితం శాంతిసమ్మితం

నౌమినిశ్చలం నిత్యనిర్మలం
విశ్వనాయకం శాశ్వతోదయం

శూలపాణినం విష్ణువల్లభం
నీలలోహితం కాలకంధరం

వేదవిశ్రుతం శాస్త్రవిస్తృతం
నౌమిసిద్ధిదం నౌమిశీలదం

మంత్రవల్లభం మంత్రివల్లభం
మానవల్లభం మానివల్లభం

---

28) ఆధిదైవికం నామ ఈశ్వర ఇతి
29) తతో రుద్రాణీ ప్రాణశక్తి రింద్రాణీ దేవతా స్త్రీరూపాచేత్యుక్తం భవతి
30) రుద్ర ఇంద్రస్య తత్వం
31) ఇంద్రో రుద్రస్యాభిమానీ
32) రుద్రాణీంద్రాణ్యాస్తత్వం
33) ఇంద్రాణీ రుద్రాణ్యా అభిమానినీ
34) రుద్రాణీ రుద్రశ్చ యోగిభిరుపాస్యేతే
35) ఇంద్రాణీంద్రశ్చ వైదికైః స్వాధ్యాయేనసంస్తూయేతే· తేహ్యాధిదైవత పరాస్తేహ్యాధి దైవతపరాః

భూతినాయకం భూతిభావితం
భూతిదాయకం భూతిధారిణం

నౌమిపార్వతీ భావనాధిపం
నౌమిశర్వరీ నాథశేఖరం

దేవ! దేహిమే శక్తివైభవం
బ్రూహిమేపథం శత్రుమర్దనే

కామవాసనా క్రామితస్థితౌ
పాహినాథ! మే భావసంజరం

సుప్తకుండలి న్యగ్రజాగృతి
ప్రాప్తదీక్షితాం దేహిసంస్కృతిం

దేహవిస్మృతిం దివ్యసంస్మృతిం
దేహిమేశివ! ప్రోజ్జ్వలాకృతిం

సంస్మరామితం సర్వసమ్మితం
శక్తిసంయుతం శర్వమద్భుతం

ఫాలచత్వర స్ఫూర్జితజ్వాల
ధాగధగ్యదృ గ్దగ్ధమన్మథం
బాలచంద్రమ శ్శేఖరంహరం
నౌమి మల్లికా పుష్పపూజితం

అంబరస్థలే భానుమండలే
మధ్యసంస్థితం మధ్యమస్థితం
మౌఖరీలస ద్వైఖరీరవ
స్నేహమోహనం నందివాహనం

స్త్రీయజూటికా రాగరేఖికా
కుంకుమద్రవా లిప్తదిఙ్ముఖా

మత్తసింధుర స్ఫారచర్మభృ
ద్దేహ మోహితా జాండకర్పరం

దుష్టశిక్షకం శిష్టరక్షకం
కిష్ట తారణం నష్టవారణం

చండవహ్నివ ద్దృష్టి కారణం
చిత్రభావన త్సృష్టిమారణం

భవ్యచాక్రిక ప్రభ్రమావనీ
మండలాంతరే మండలాంతరం

తాంత్రికావళీ శక్తిచాలన
ప్రోక్తివల్లరీ బద్ధసాత్వికం

యావనోదయే భావనోదయే
జీవనోదయే జీవదాయకం

ప్రాణదాయకం ప్రాణనాయకం
నౌమిసర్వదా నాదనామకం

సర్వతఃపతిం సర్వదాగతిం
సర్వభక్షకా ఖర్వలోచనం

సర్వమంగళా భావసాగరే
శర్వరీవిభుం సర్వతోముఖం

భక్తిభావనో ద్రిక్తభావనా
భావనాగతం భావయామితం

సత్కవీశ్వర ప్రీతిదాయకం
చండచండికా మానసాయకం

సౌమినిజం సౌమిఘనం కాలహరం కాంతికరం
జనవిభుం దేవవిభుం భావవిభుం విశ్వవిభుం
సౌమిసదా నాదమతిం మానుకమ త్స్వాగమతిం
అధిబలా వ్యాధిబలా దేవ! మహా ప్రాణబలా

సిద్ధికరం బుద్ధికరం సిద్ధికరం సౌమిహరం
కాళిగళం కార్యబలం బాహుభుజం సౌమినిజం
రక్తజటా యుక్తశిరం సుందరతా మందిరరం
కాంతియుతం క్రాంతియుతం శాంతియుతం భ్రాంతియుతం

శౌర్యయుతం ధైర్యయుతం సౌమిమహా వీర్యయుతం
ధర్మమతిం కర్మగతిం సౌమిపతిం శర్మరతిం
వజ్రవతీ వల్లభతా విస్ఫురిత ప్రస్ఫురణం
ప్రేమబలో ద్దామబలం శ్రీమహితం భూమహితం

తన్మవలయ శ్రీనిలయం సౌమిరమా నాదలయం
సౌమిరస శ్రీవిలస స్వన్యకథా కావ్యపథం
సౌమిసుధా నాధవిధా కాముకతా నామయుతం
చోదయ మే బుద్ధిబలం బోధయ మే బాహుబలం

శక్తిసుధా సాధకతా సత్యపథం దేహివిభో
కాంచనమా లావరణం కంచనలీ లాచరణం
చిత్రపదే చిత్రపదం స్తోత్రకృతౌ సూత్రగతం
క్రాంతికళా కాంతివహా హ్యూహమిహ స్నేహమిహం*

ఊర్జితకాం త్యుచ్ఛలనం స్ఫూర్జితశాంత్యుద్గమనం
నామసుధా ప్రేమకథా భూమిమజం సౌమినిజం

* మిహము = సేచనము

దేవ! భజే నిర్మలతా నిశ్చలతా నిత్యగతిం
త్వానుభవం దేవ! భవం శ్రీవిభవం నౌమిశివం
ఫాలతలే ఘోరతర ప్రజ్వలిత ప్రజ్వలనం
శైలనివా సోల్లసనం నవ్యవిలా సాభ్యసనం

దివ్యసుధా దృఙ్మసృణం భవ్యజటా భాఘుసృణం
పాలితలోకాధిపతిం లాలితభావానుమితిం
చండతరాఖండమతిం చారుతరోదారనుతిం
ధార్మికతా మార్మికతా మాదకతా మోదయుతం

మహేశ్వరం మహోదయం భజేసదా పరాత్పరం
జగత్పతిం జగద్గతిం జగన్నుతిం జగన్నతిం
కృపాకరం సువాంగురం భవంభజే సదాశివం
కళాలస ద్విలాసినం విలాసినం విభాసినం

విశిష్టతా వినూత్నతా విచిత్రితా విమోహకం
స్మరాంతకం పురాంతకం భజేసదా గజాంతకం
భుజంగరాట్ ఫణావళీ మణిప్రభా విభాసితం
స్ఫులింగక స్ఫురన్మహా ధనంజయ జ్వాలద్దృశం

సురావళీ కరావళీ కృతాంజలిం భజేహరం
జటాధరం జగత్ప్రభుం దిగంబరం వృషధ్వజం
సురాసుర స్తుతంశివం ధరాధర స్థితంభవం
పరంపరా కవిత్వదృక్ పవిత్రవాక్ పరీవృతం

వరాభయ ప్రసాదకం శివాసతీ ప్రమోదకం
ధగద్ధగ ద్ధగజ్వలన్మహాగ్నివ న్మహాత్వదం
సనాతనం జనావనం మనోహర స్ఫురజ్జయం
తపస్వినా మఖండిత ప్రచండతా ప్రదాయకం

అజేయతా సముల్లస ద్దురంతక ప్రభంజకం
శిరస్స్ఫురత్ సురాపగా సువీచికా సుగంధినం
పరాత్పరం పరంతపం పరశ్వధ ప్రభుంభజే
మహోత్కటం మహానటం మనస్వినాం మనోహరం

ప్రభాకర ప్రభాకరం శుభాకరం సుహృద్వరం
భజేసదా భయంకరం పురాతనం పురాంతకం
చిరంసుఖం భజామ్యహం స్థిరంశుభం స్మరామ్యహం
కళాసతీ హృదంతర ప్రియాకృతిం జయావృతిం

కపాలినం త్రిశూలినం త్రియంబకం త్రియామయం
నిరంతరం మదంతరే స్మరామితం వరామితం
అఖండిత ప్రసాదన ప్రసాధన ప్రబోధనం
దృగంచలా ద్దిగంచలే రుగంచితం భజేఽమితం

మహాకుహూ నిశీథినీ తమస్స్ఫుర త్సుకంధరం
జటాతటీ శశిప్రభా జనంగమ ప్రభావనం
ఇరమ్మదే విభాసితం పరంమదే పరీవృతం
శిరస్స్రవ న్మహామద ప్రవహ్లికా ప్రమోదకం

సరోజదృ క్పితామహ స్ఫురద్రణే మహోదయం
జనావళీ మనోగుహా తమస్వినీ తమశ్ఛిదం
తమద్భుతం తమున్నతం తటిత్ప్రభా తరంగితం
భజామితం పరంతపం పరాత్పరం మహేశ్వరం

విద్యుజ్జ్యోతిరనం తాకారావరణం
నౌమి ప్రేమమయం శ్రీమద్భక్తజయం

దుఃఖంనాశయితుం కార్యం సాధయితుం
ఈశ! స్థాపయమే జ్వాలాశక్తిబలం

కళ్యాణేనభవ త్కారుణ్యేనశివ !
ప్రేమార్ద్రైరమలై ర్దృగ్భిఃపాలయమాం

లావణ్యామృతవ ల్లాలిత్యాదరణాః
దాక్షిణ్యోదయది వ్యాక్షీణప్రణయాః
హాసాస్తేభగవన్! జ్యోత్స్నాకాంతినిభాః
భూయాసుర్లలిత శ్రీకామేహృదయే

జయతుమహేశః ప్రణవనివేశః
లలితవిలాస స్మితదరహాసః

అపగతధైర్యం శ్రితజనదుఃఖం
హర-హర! శంభో! త్రిపురవిదారే

సర్వంవినయుతం శర్వంసుమహాంతం
భావేషుచలంతం లోకేషునటంతం

కారుణ్యవిలాసం కళ్యాణనివాసం
బాలేందుకిరీటం లీలామృతకూటం

ఆకాశశరీరం మందారసుహారం
భక్తామరభూజం దేవంనటరాజం

నౌమిశ్రితపూజా సంతోషితభావం
చింతాగతకావ్య స్వాంతాంతరజీవం

గాయామిపరమం లోకస్యజనకం
ధ్యాయామిసతతం లోకేశవినుతం

అంభోజనయనం కైలాసశయనం
మాధుర్యలలితం మాధుర్యకలితం

ప్రజ్ఞానమహితం ప్రజ్ఞాపరిణతం
సౌందర్యఘటనం సంధ్యోగ్రనటనం

నౌమిప్రతిజన ప్రాణాధికరణం
కష్టోన్నతతమః పాథోధితరణం
సంపూరయతు మే సంపూర్ణకరుణాం
సర్వేశవిమల శ్రీహాసకిరణః
సంపాదయతు మే సమ్మోదవరణం
సంసారతరణం సర్వేశచరణం

కఠోరతరపాపం భయంకరవిరూపం
దహప్రకటతిత్వం మదీయమభవ! త్వం
దదాతుమమశక్తిం జగచ్చలనయుక్తిం
శివస్యదరహాస స్సితాంబుజవికాసః
కరోతుసుమహాగ్రం కృశానుసుమహోఽగ్రం
శివాహృదయనాథ శ్శివస్సదయబోధం

ప్రచండముఖపద్మం ప్రసన్నపదపద్మం
ప్రణౌమిజగదీశం ప్రభగ్నయమపాశం

జ్యోత్స్నా సుందరమూర్తిం జ్యోతిర్మంజులకీర్తిం
వందేభర్గమనంతం సౌందర్యాభిలసంతం

అక్షయ్యప్రతిభోక్తిం దీక్షాభాసురభక్తిం
వీక్షావిస్తృతశక్తిం దేహి! ప్రస్తుతముక్తిం
ధ్యేయంభక్తివిధేయం జ్ఞేయంసత్కవిగేయం
మాయానాంమహనీయం గాయామోగణనీయం

రాజానంసకలానాం యోగానామధినాథం
వందేదిగ్జయదీపం వందారుప్రియరూపం

సమ్యగ్విప్లవభావై స్సమ్యక్సంస్కృతభావైః
సమ్యగ్జీవనరాగ సమ్మోదంప్రదదాతు

విలసద్వ్రజతీక్ష్ణాం వికసత్తీవ్రనిష్ఠాం
వివధాతుప్రచండాం విపులాంశక్తిమీశః

చరణాంభోజముద్రా తరుణామోదభద్రం
కరుణాసక్తచిత్తః పరమేశస్తనోతు

లలితప్రేమదృష్టిః కలితానందవృష్టిః
పరమేశస్యసృష్టి ర్భవతుజ్ఞానగృష్టిః

రససుధాభరితో మధుమదాంతరితో
మధురరాగయుతో మమశివశ్శరణం

కులపతేఃకవితా కలితభావనయా
ప్రమదపూర్ణమతి ర్భవతువిశ్వపతిః

త్రిభువనేషునుతాం సుకవిగాఢ్రచితాం
నవనవత్కవితాం వరతుసత్కృపయా

సకలభావరతి స్సకలజీవగతిః
సకలయోగపతి ర్మమశివశ్శరణం

శక్తిమశేషాం సాధయితుం
బుద్ధిమపారాం ప్రేరయితుం
భావవిహారం దేవ! తవ
శ్రీకరమూర్తిం స్తౌమిసదా

ఘోరదరిద్ర త్వావ్యధితం
దుర్భరబాధా నిర్మథితం
పాతుమనన్యం భక్తిరతం
నౌమిమహేశం యోగినుతం

భావనదుఃఖ ధ్వాంతహారం
జీవనశక్తి క్రాంతికరం
పావనభక్తి ప్రీతిభరం
దేవ! నమామిత్వామజరం

త్రిభువనేశ్వరం త్రిణయనం శివం
దివిజవందితం పురహారం భజే

కరుణామారస స్ఫురణయాతవ
దివిజవల్లభో జయతిసర్వధా

శివశివప్రభో! పరమసుందర!
ప్రణవనాయక! ప్రణతదిగ్విభో!

త్రిజగతీపతే! భువనమోహనం
తవకృపాపదం నవసుధాస్పదం

లలితయాంభవత్కరుణయాసదా
అభవ! దేహిమే పరమమున్నతిం

నౌమిజగదీశం సర్వరిపునాశం
దివ్యదరహాసం దీప్తగుణభాసం

వ్యోమతలనాద ప్రేమపదమోదం
నిత్యశుభసీమా నిర్మలవిహారం

కర్మపథభావ్యం ధర్మపదభవ్యం
స్తవ్యగుణరమ్యం సేవ్యగణగమ్యం

ప్రాంజలిరనన్యః కుంజరహరాయ
మేహృదయనాథ శ్రీకరపదాయ

లౌకికవిలాసా లౌకికవికాసా
నవ్యరసభావా నంతచరితాయ

అణోరణీయాన్ మహతో మహీయాన్
మహేశ్వర శ్శూలధరః పినాకీ
జగత్ప్రభుశ్శంభు రజః పురారి
స్త్రిరూపనేత్ర స్సశివశ్శరణ్యః

అష్టాపదాకృష్ట దిగీశకోటి
కిరీటరత్నావృత పాదపద్మః
పరాత్పరః పంకజనేత్ర వంద్యః
శ్రీణాముదారో ధరుణోరయీణాం

అష్టమూర్తి రహిర్బుధ్న్యో వ్యోమకేశః పురాతనః
గిరీశో గిరిశో దేవో వీరభద్రో గణేశ్వరః

అవ్యక్తో వ్యక్తరూపశ్చ భగవాన్ పరమేశ్వరః
దేవాసుర వినిర్మాతా దేవాసుర నమస్కృతః

సర్వదేవమయస్సాక్షా దీశ్వరః పరమప్రభుః
ప్రసన్నో వరద శ్శర్వః ప్రచండ పద తాండవః

నజానే సర్వభూతేషు సర్వకాలేషు సర్వతః
మహాదేవ సమం దేవం కరుణావరుణాలయం

శూలం వజ్రంచ ఖడ్గంచ పరశ్వధ మభీతిదం
దక్షభాగే వహంతం తం శాంతం శంకరమాశ్రయే

నాగం పాశంచ ఘంటాంచ ప్రళయానల మంకుశం
వామభాగే వహంతం తం నౌమి శ్రీపార్వతీశ్వరం

నానాలంకార సంయుక్తం స్ఫటికస్ఫూర్తిసంయుతం*
పద్మాసనసమాసీనం పంచవక్త్రంభజామ్యహం

---

* ఇచట పంచాక్షరీమంత్ర సంప్రదాయ ధ్యానమూర్తి-వర్ణితము.

మహేశ్వరంమహాత్మానం మహాదేవంమహానటం
ప్రణౌమి ప్రణవాకారం ప్రణతాశ్రితవత్సలం

జగద్గురుం మహాదేవం బ్రహ్మానంద విధాయకం
సంస్తౌమి హృదయామోదం నాదబ్రహ్మ స్వరూపిణం

క్రోధకాలే మహాఘోరం నీలకాంతిసముజ్జ్వలం♦
ప్రయోగాదికసంహార కారణంశత్రుమారణం

ప్రచండ ఫాలాంబక వహ్ని దిహ్నం
కరాళ కాళాకృతి భీతిలోకం
ఆరక్త ధూమాంబర ధూమకేతుం
క్రోధాగ్ని రుద్రం హృదయే స్మరామి

---

## ధ్యానమ్

శాంతం పద్మాసనస్థం శశిధరమకుటం పంచవక్త్రం త్రినేత్రం
శూలం వజ్రంచ ఖడ్గం పరశు మభయదం దక్షభాగే వహంతం
నాగం పాశంచ ఘంటాం ప్రళయ హుతివహం సాంకుశం వామభాగే
నానాలంకారయుక్తం స్ఫటికమణినిభం పార్వతీశం నమామి.

ఇచటభావింపబడిన రుద్రుని నీలవర్ణము ఒకవిచిత్ర మూర్తి విశేషము. దానినిపలుకు క్రోధాగ్ని దేవతా స్వరూప ధ్యానము—

"ధ్యేయో రుద్రో దశభుజో భై రవాభరణై ర్యుతః
పాశాంకుశౌ ఖడ్గఖేటౌ శంఖంచైవ శరాసనం
దధాన మసిఖట్వాంగౌ వరదంచాభయం క్రమాత్
నీల జీమూత సంకాశం పింగళోర్ధ్వ శిరోరుహం
వ్యాఘ్రచర్మాంబరం నానా నాగై రాభూషితం స్మరేత్"

జగత్త్రయ క్షోభకర క్రుధాగ్నిం
కల్పాంత వహ్న్యుగ్ర మహోర్ధ్వకేశం
త్రియంబకం భైరవ సాట్టహాసం
నుమోవయం క్రోధమయం మహేశం

భజేసర్వాక్షరాకారం సర్వబీజస్వరూపిణం
సర్వైశ్వర్యప్రదాతారం సర్వశక్తిసమన్వితం
అకారాకారమత్యద్భుతానన్యగుణవైభవం
అనంతమంతస్సంపూజ్య మంతర్వాణిప్రబోధకం

అనన్యమనిదంపూర్వ మనుకామీనమవ్యయం
అనపాయమనాత్మాన మనుక్రోశసమన్వితం

అతిశోభనవిస్తార మతిశాయితమద్భుతం
అహీశ్వరమహాభూష మత్యాదిత్యమధీశ్వరం

అతీక్ష్ణమతిసంకాశ మతిఘ్నీహృదయాధిపం
అనూచీనానుసంధాన మనూచానసమర్చితం

అకారశబ్దసంభావ్య మాధ్యమాబోధనోదయం
ఆనుషంగికసంధాన ప్రజ్ఞాపారమితాకృతిం

ఆయథాతథ్యసంకీర్ణ భావాగమ్యమహోదయం
ఆమ్నాయ స్తుతిసంపూర్ణ వార్యాహృదయనాయకం

ఆనాద్యస్థానమాస్వాద్య కవితామృతకల్పకం
ఆగాధనీయమాభీల ప్రళయప్రాభవాకృతిం

ఆప్యాయనసమాసశ్రీ తేజఃపుంజసమన్వితం
ఆబంధాబంధనాభాస మాదిమర్షినిషేవితం

ఇచ్ఛాశక్తిప్రదాతార మితస్తతఉదీరితం
ఇదానీంతనభావాగ్ర్య మిదంతావృత్తివిశ్రుతం

ఇకారాకారమిష్వాస కృతమేరుధరాధరం
ఇరమ్మదసుమధ్యస్థ మిందీవరసమేక్షణం
ఇదంతనధరాతత్త్వ వ్యతీతహృదయాంబుజం
ఇతరేతరసంయోగ జాయమానస్థితిస్థితిం

ఇంద్రమింద్రియ సంలోల మనోమానవనిష్కృతిం
ఇక్షుద్రాక్షాసుధాధారా మాధ్వీసుమధురాభిధం

ఈకారాకారమీశాన మీర్యాస్థితివరప్రదం
ఈక్షణాగ్నివినిర్దగ్ధ కామమీప్సాప్రదాయకం

ఈడాపాత్రసునిర్మాణ కాంతకారుణ్యైకకల్పకం
ఈదృక్తాతత్త్వసంశూన్య మీశిత్వప్రతిపాదకం
ఈషిరేక్షణమీహాగ్ర ధ్యానధారణనిర్మితం
ఈర్ష్యారహితభావాభి చలచ్చరణపంకజం

ఉకారాకారముక్షేంద్ర వాహముగ్రమురుక్రమం
ఉచ్చండచండికానాథ ముక్తవిశ్రుతవిశ్రుతిం
ఉచ్చ్వాససుయశఃపూజ్య ముచ్చిరఃకృతిపూజితం
ఉజ్జ్వలోజ్జ్వలశృంగార స్పందమానహృదంతరం

ఉడురాజశిరోభూషా భాసమానకపర్దకం
ఉత్తాలోత్తాలగంభీర ప్రత్యుద్గమగళధ్వనిం
ఉత్పత్తిశూన్యముత్పత్తి కారణోత్పత్తికారణం
ఉదన్వదంతరుద్భూత హాలాహలవిభక్షకం

ఊకారాకారమూర్జస్వి తోర్జితప్రకృతిప్రియం
ఊర్ణనాభిగజాహీంద్ర ముక్తిదానసువిశ్రుతం
ఊరీకృతకవీశాన మూహాంతర్గర్భితాకృతిం
ఊష్మగ్రీష్మోష్మపాక్షిస్థ లాతితీక్ష్ణసమీక్షణం

ఋకారాకారసంభావ్యం ఋషినాయకపూజితం
ఋజీషం*ఋషణేసూచ్యా మంగళాదికమారకం
ఋఙ్మంత్రదర్శనస్పందం ఋషభేశ్వరవాహనం
ఋతధర్మసమీక్ష్యశ్రీ చైత్తవృత్తినిరోధకం

ఏకారాకారమేకాంత మేకైకత్వప్రకాశితం
ఏకకుండలసన్మాత్ర మేకాదశతనూశ్రుతం

ఐకారాకారమైతిహ్యా భాసమానకథాపథం
ఐశ్వర్యజ్ఞానదాతార మైరావత్యుపలాలితం
ఐషికాముష్మికాధీశ మైకాగ్ర్యప్రసృతిస్థిరం
ఐకపద్యముల్లాస మైకాత్మ్యస్థితిదాయకం

ఓకారాకారమోంకార నాదబ్రహ్మనిరూపితం
ఓజఃప్రసన్నవదన మోషధీశ్వరశేఖరం

ఔకారాకారమౌదార్య స్వభావానుభవోదితం
ఔపదేశికసిద్ధాంత భావమాద్ధత్యజీవనం
ఔత్కంఠ్యోత్కృష్ట్యసంభావ మౌన్నత్యోజ్జ్వల్యసంభృతం
ఔచిత్యౌత్సుక్యసన్నాహ మౌపపత్తికచింతనం

కకారరూపంకళ్యాణ కారుణ్యమయమానసం
కరాళతాండవాకార భీతాజాండకరండకం

కలిదోషహరంకావ్య కన్యాహర్ష ప్రదాయకం
కందర్పకోటిసౌందర్యం కంధరాకారకంధరం
కపర్దినం కళానాథ కమనీయశిరోమణిం
కపాలినం కళామూర్తిం కరుణామయమానసం

కలుషారణ్యదావాగ్నిం కల్పాంతస్థిరకల్పనం
కల్లోలితారిషడ్వర్గం కష్టాష్టకనివారణం

---

* ఋజీషం=శత్రూణామపార్జకం

కాత్యాయనీహృదీశానం కాంక్షితార్థప్రదాయకం
కాంతిసంచితకాశాంతం కాద్రవేయవిభూషణం

కాలాంతకం కాలకంఠం కిన్నరేశ్వరసంస్తుతం
కీర్త్యాచ్ఛాదకవిస్ఫూర్తిం కిశోరశశిశేఖరం

కుతర్కచ్ఛేదకస్వాంతం కుక్షిస్థాజాండకర్పరం
కుంభీనసఫణికుంభా ప్రాలేయాకృతిసుందరం

కుంభిచర్మోత్తరీయంచ కుంభసంభవపూజితం
కురంగమధరం కృత్స్నచైత్యాత్స్నహాసముహాదయం

కృతఘ్నఘ్నం కృపాపూర్ణం కృశానుప్రతిలోచనం
కృష్ణద్వైపాయనప్రోక్త పురాణాదికభాషితం

కృశానురేతసం కృత్త శార్దూలం కృత్తివాససం
కృపాణధారిణం కౢప్తం కేవలం కేళిలోలుపం

కైలాసశైలసంవాసం కైశికీసముదంచితం
కైవల్యాదిప్రదాతారం కైటభీహృదయేశ్వరం
క్రీడామాత్రకృతాజాండ కందుకం క్రాంతిసంయుతం
క్షితిభృద్ధనురుల్లాసం క్షాంతిదం క్షిప్రవిస్తృతిం

క్షేత్రజ్ఞప్రస్ఫుటప్రజ్ఞా క్షేత్రజ్ఞాక్షేమసమ్మితం
క్షోదీయఃక్రూరసంఛేదకారిణం క్షోభహారిణం

ఖరం ఖండితదుర్మార్గం ఖడ్గఖట్వాంగధారిణం
ఖద్యోతకోటిసంకాశ మూర్తిం ఖండపరశ్వధం

గగనం గగనాకారం గణనాయకవందితం
గంగాధరం గణాధీశం గణేయం గతికారణం

గమనీయం గరిష్ఠంచ గరళప్రస్ఫురద్గళం
గరుడధ్వజసంపూజ్యం గర్వపర్వతవాసవం

గాయత్రీవిలసత్తత్వం గాథాగీతకథావిధం
గాంధర్వగానసమ్మోదం గాండీవిప్రీతిదాయకం
గీర్వాణవందితం గీతం గీర్మాధుర్య ప్రసాదకం
గుణాశూన్యం గుణాకీర్ణం గుణినం గుహ శేఖరం

గ్రంథచ్ఛిదంగ్రహాధీశం గ్రంథగ్రంథిత భావనం
గ్రీష్మభీష్మప్రభాయుక్తం గ్రాహతత్వసమంచితం

ఘనం ఘనాఘనోల్లాస కంఠస్వరవిభూషితం
ఘృణిపూర్ణం ఘృణాపూర్ణం ఘృత కేశప్రభాదృశం

చండంచచండికానాథం చతురం చంద్రశేఖరం
చరాచరజగన్నాథం చరితార్థత్వకారిణం

చారుచార్చిక్యశృంగారం చిత్తవిభ్రమహారిణం
చిత్రచిత్రసముల్లాసం చింతనాగ్రప్రఘర్షణం

చైతన్యచోదకంచేయం చేష్టాశూన్యం చిరంతనం
చైత్రమిత్రహరక్రోధం చర్మచక్షురగోచరం

ఛవిచ్ఛటాసమాకీర్ణం ఛందస్సుందరసన్నుతిం
ఛన్నతత్వసముల్లాసం ఛిన్నసంశయకారిణం

జగన్నాథం జగద్ధేయం జగత్ప్రాణనియామకం
జగచ్చక్షుస్సహస్రాభం జగత్ప్రాణసఖేక్షణం

జనకం జనయిత్రీంచ జయంతం జయవైభవం
జరాశూన్యం జనుశ్శూన్యం జపతృప్తహృదంతరం
జీమూతనీలకంఠంచ జంతూనాంజీవనౌషధిం
జీవితాధీశ్వరంజీవం జీవతత్వనిరూపణం
జ్ఞేయంజ్యోతిర్మయంజ్యేష్ఠం జ్యోత్స్నాసౌందర్యవైభవం
జ్వాలసజ్వాలికామాలా జ్వరదుఃఖనిబర్హణం

ఝకారశబ్దసంభావ్యం ఝషకేతుహరేక్షణం
ఝంకారిణీఝరీవీచీ లాస్యలాలితమస్తకం

డకారశబ్దసంపూజ్యం డమరూవ్యక్తకరాంబుజం
డిండీరధవళాంగంచ డింగరీకృతరక్కరం

తకారరూపంతత్త్వజ్ఞం తత్త్వనిర్వాణవైభవం
తత్త్వసంభావితంతత్త్వం తత్త్వతస్తథ్యభావనం

తపస్విజనసంపూజ్యం తపోపాయదాయకం
తరుణేందుధరంతాదృగ్గ్రహితంతామిస్రసంభిదం

తీర్థదేవాలయాధీశం తీక్ష్ణం తీవ్రం తిరోహితం
తువిబాధం*తురీయంచ తురంగీకృతతుండినం

త్రయీమయం త్రినేత్రంచ త్రిగుణాకృతిసంయుతం
త్రిలింగభాషాసౌందర్య భావితం త్రిజగత్ప్రభుం

దక్షిణావర్తశంఖధ్వన్యుపలాలితమానసం
దక్షిణామూర్తిరూపంచ దక్షాధ్వరవినాశకం

దాక్షాయణీమనోనాథం దాక్షిణ్యపరిభాసితం
దారుకావనసంచార స్వైరం దారిద్ర్యనాశకం

దూరీకృతదురన్యాయ దుర్వృత్తిదురుపాధికం
దుర్ధర్షప్రస్ఫురత్తేజో దుస్సహం దూరదర్శినం

ధకారరూపంధర్మిష్ఠం ధరణీధృద్ధనుర్ధరం
ధనంజయకృతస్తోత్రం ధనంజయవిలోచనం

నకారరూపం నగ్నంతు నటరాజం నమస్యితం
నాదబ్రహ్మస్వరూపంచ నాకేశం నాగభూషణం

నిరామయం నిరాకారం నిర్వికల్పం నిరంజనం
నిర్మలం నిశ్చలం నిత్యం నిత్యానందప్రబోధకం

* తువిబాధం=బహూనాంబాధకం

నిర్నిరోధంనిరాఘాటం నిరుపాధింనిరంకుశం
నియమంనియమాతీతం నిరవద్యంనియామకం

నిరాతంకంనిరాలంబం నిరాయాసంచనిర్గుణం
నిరూహంచనిరూఢంచ నిరూప్యంచనిరూపణం

నిర్దేశకంనిరుద్దేశం నిర్ధారితమనఃపథం
నిర్మాణకాయంనిర్లేపం నిర్వివాదంనిరంతరం

నిర్విఘ్నంనిరహంకారం నిర్వృత్తింనిరుపద్రవం
నిర్వ్యాంనిశ్రేయసానంద దాతారంసర్వకారాదృతిం

పకారరూపంపంచాస్యం పంచేషువహనేక్షణం
పంచభూతాధివాసంచ పంచభూతప్రసేవితం

పరశ్వధధరం పద్మ పత్రవైశాల్యలోచనం
పరాక్రమపరీణాహం పరమేశంపరాత్పరం

పాలకంచపవిత్రంచ పారమార్థికసమ్మదం
పీఠవిద్యాధినాథంచ పుణ్యశ్లోకంపురాతనం

ప్రణయోదయసమ్మోదం ప్రణవోదయసమ్మదం
ప్రాతర్వికసితాంభోజ మరందమధురాంతరం

ఫకారశబ్దసంభావ్యం ఫణినాయకభూషణం
ఫాలస్థలీనటద్వహ్నిం ఫుల్లమల్లీలసత్తనుం

బకారరూపం బంహీయోబహురూపవిభాసితం
బర్హిర్ముఖాదిసంపూజ్యం బంధురంబలవైభవం

భకారరూపంభయదం భరతోర్వీప్రజాపతిం
భర్గం భస్మాంగరాగంచ భవానీనాయకం భవం

భీమం భూతేశ్వరం భూభృత్పుత్రికాహృదయేశ్వరం
భూభృద్వరశయానంచ భూమప్రాభవభాసురం

మకారశబ్దసంభావ్యం మహనీయం మహోదయం
మంజులోజ్జ్వలమాధుర్యం మాంగల్యమహిమాన్వితం

మహాపరిణతాకారం మహాదేవం మహానటం
మస్తకాలంకృతామర్త్య తరంగిణ్యుపలాలనం

మార్తాండమండలస్థానే మధ్యస్థం మహితాత్మకం
మృత్యుంజయం మృషాహారం మృగలాంఛనశేఖరం

యకారశబ్దసంభావ్యం యక్షనాయకసేవితం
యజ్ఞాంగం యజ్ఞరూపం చ యజమానం యతీశ్వరం

యుయుత్సుజనసంభావ్యం యుగనాథం యుగాంతకం
యుక్తధర్మవిధాతారం యోగినాం యోగదాయకం

రక్తవర్ణజటాధారం రత్నసానుధనుర్ధరం
రజతాచలసంవాసం రజనీకరశేఖరం

రమణం రమణీయం చ రసజ్ఞం రసికప్రభుం
రంహస్తాండవసంఘాత భగ్నబ్రహ్మాండకర్పరం

లావణ్యలాలితాకారం లాలిత్యోల్లాసవైభవం
లక్ష్యలక్షణసన్నాహ విద్వజ్జనవిమోహితం

లింగజ్యోతిరుదీర్ణశ్రీ భానుకబ్రహ్మభావితం
లీలాచాలితభూగోళం లేఖాధీశ్వరవందితం

వకారశబ్దసంభావ్యం వత్సలం వజ్రధారిణం
వరివస్యావరీయశ్రీః వరదం వపురుజ్జ్వలం

వయోభిగణనాసాధ్యం వర్చస్సుందరవిగ్రహం
వల్లకీనాదనైపుణ్య కామిన్యంగుళివాదకం

వాగీశ్వరనమస్కార పురస్కారపరిష్క్రియం
వామదేవం వరప్రజ్ఞా మేధాసంపత్ప్రదాయకం

విద్వద్వరవినుత్యాంఘ్రిం వినీతిమతివర్తనం
విజ్ఞానినాయకంవిద్యా దాయకంవిధివందితం

విలయేవికటాకారం విరూపాక్షంవిలాసినం
విరించించవియద్గంగా నీచీరమ్యజటాభరం

విరోచనదృశం వీరం వీరశేఖరపూజితం
వీణారాధనసంతృప్తం వీర్యవంతం విలక్షణం

విశ్రుతంవిశ్వనాథంచ విశ్వతోముఖవైభవం
విశ్వంభరం విశిష్టంచ విషకంఠం వివేకినం

విస్ఫారంవిస్మయాకారం విహాయఃపథవర్తినం
విసృత్వరంవిచిత్రంచ విహాయుజ్మంత్రవిస్తృతం

శకారశబ్దసంభావ్యం శర్మదం శక్తిదాయకం
శబ్దబ్రహ్మసమారాధ్యం శివం శుభవిధాయకం

శంభుం శాంతతనుం శర్వం శవభస్మవిలేపనం
శాశ్వతం శాసితారంచ శితికంఠం శివంకరం

శ్రీకంఠం శ్రీపతిం శ్రీశం శ్రీమంతం శ్రీమహేశ్వరం
శ్రేయశ్శ్రుతిగతిం శ్రేష్ఠం శ్వేతపర్వతవాసినం

షకారశబ్దసంభావ్యం షడాననని షేవితం
షష్ఠీవిద్యామహాసిద్ధి శ్రీకరంషడ్రిపుచ్ఛిదం

సకారరూపం సంవర్త గర్వపర్వతఖండనం
సంసారబంధసంబంధ నివారణకరౌషధిం

సంకల్పమాత్రసంసృష్ట బ్రహ్మాండం సకలేశ్వరం
సత్యం సనాతనం సార్థం సర్వాంగీణం సదాగతిం

సద్యస్సంస్కృతిసమ్మోదం సంధ్యాసుందరతాండవం
సమీచీనం సదానందం సర్వదాసత్వసంయుతం

హాకారశబ్దసంభావ్యం హాలాహలలసద్గళం
హరంహరిత్పరివ్యాప్తం హవ్యవాహనలోచనం

హిరణ్యగర్భసంపూజ్యం హేలానర్తనవర్తనం
హిమశైలసుతానాథం హింసాధర్మమతప్రభుం

సర్వాక్షరమయం దేవం సర్వనాదసమన్వితం
సర్వశబ్దసముల్లాసం ప్రణౌమి పరమేశ్వరం

సదాశివాయ రుద్రాయ నమఃఖట్వాంగధారిణే
మహాదేవాయ భద్రాయ వజ్రశక్తిధరాయచ

నీలగ్రీవాయ ధూమ్రాయ పాశాంకుశధరాయచ
నమో నిత్యాయ సత్యాయ హిరణ్యవసురేతసే

సూర్యచంద్రాగ్నినేత్రాయ హరిబ్రహ్మార్చితాయచ
ప్రాలేయమల్లికాచాంద్రీ సుందరాంగాయశంభవే

వేదవేద్యాయ భీమాయ సర్వసంపత్ప్రదాయచ
కాలాంతకాయ కాలాయ పశూనాం పతయేనమః

భూతనాథాయ శర్వాయ విస్ఫురత్కృత్తివాససే
నాగరాజవిభూషాయ జగతాంపతయేనమః

వామదేవాయభక్తానాం నిత్యసంతోషకారిణే
సద్యోజాతాయదేవాయ సుకపోలాయ సుభ్రువే

సుకరాయసుఫాలాయ సురాణాంపతయేనమః
నమోభర్గాయ భద్రాయ సదసద్గతయేనమః

అపారఘోరసంసార సముద్రేమగ్నమానవాన్
సముద్ధర్తుంసమర్థాయ పశూనాంపతయేనమః

దుఃఖాంబురాశినిర్మగ్నాన్ మృత్యోఃకరతలేస్థితాన్
క్రూరాన్ పాపాత్మకాన్ పాతుం నమస్సంపూర్ణశక్తయే

రుండమాలాసముల్లాస కాంతిప్రోద్భాసితోరసే
పిశాచభూతభేతాళ వేష్టితాయనమోనమః

శ్మశానవాసినే ఘంటా పాశవజ్రాసిధారిణే
మహారిష్టవినాశాయ మహేశాయనమోనమః

లలితమన ఉపాస్యోల్లాస లాలిత్యలాస్యో
జ్జ్వలిత గిరికుమారీ మంజులానందకారి
ప్రకటిత సుమహోద్యత్తాండవామోద సద్యః
ఫలితవరకరాయ ప్రాంజలిశ్శంకరాయ

శ్రీమత్కుల్లేశ్వర హృదంతరనిత్యపూజా
ప్రేమప్రధాన వివశీకృతమానసాయ
విద్యాధరీ విమల పాదమణిప్రకాండ
ప్రోద్యద్ఘణంఘణ రవాయ నమశ్శివాయ

ప్రాలేయ శైల ఘనసార పటీర చాంద్రీ
కర్పూర కాంతి కలిత ద్యుతి పుంజ దేహ
ప్రోద్భాసితాయ భసితాంగవిలేపనాయ
విశ్వాధినాథవినుతాయ నమో హరాయ

వైయాఘ్రచర్మవసనాయ వరాభయ శ్రీ
దానప్రధాననిపుణాయ నిరామయాయ
దారిద్ర్య ఘోరవన దాహక పావకాయ
పంచాననాయ పరమాయ నమోభవాయ

ఫాలేక్షణాయ ఫణిరాజ విభూషణాయ
ప్రత్యగ్రభీకర మహాద్భుత తాండవాయ
శోభానుభావ శుభలక్షణ లక్షితాయ
కారుణ్యకల్పిత విధాయ నమో హరాయ

భావాతిరేక భవ తారణ కారణాయ
నేత్రత్రయ ప్రకటితోర్ధ్వ వినిసృతాయ
మందారదామ మణికుండల మండితాయ
ప్రాణాధికార హరణాయ నమో హరాయ

ఆనందసుందర పదాంబుజ హోజ్జ్వలాయ
మందాకినీమకుట శోభిత మస్తకాయ
గౌరీప్రియాయ గరిగర్తమహావిషాయ
సంసారదుఃఖహరణాయ నమశ్శివాయ

శైవాధిపాయ వృషభేశ్వర వాహనాయ
కావ్యప్రియాయ కవిశేఖరకల్పకాయ
కళ్యాణ కారుణిక కాంతి కళా విశేష
ప్రాసంగిక ప్రముదితాయ నమో భవాయ

దుర్వార దుష్ట దురితార్ణవ తారణాయ
నామప్రియాయ రజనీశకలాధరాయ
జ్యోతిర్మయాయ కుసుమావృతపూజితాయ
ప్రజ్ఞాన దాన విభవాయ నమో భవాయ

నామప్రియాయ నవనాగరక ప్రపంచ
ప్రస్థానభాష్యజయ డిండిమ చండనాద
ప్రస్ఫూర్జధుత్యా పరితః పరిణీతవాద
శ్రీమత్కులేంద్ర వినుతాయ నమశ్శివాయ

సిద్ధాంతవాద పరిశోభిత భేదశాఖా
వేదాంత నిర్ణయ విశిష్టపథప్రమాణా
ప్రజ్ఞా విశేషకులనాయక తాత్వికాంతి
స్సంపూజ్యపాదజలజాయ నమశ్శివాయ

దేవాసురాధీశనమస్కృతాయ
దేవాదిదేవాయ మహేశ్వరాయ
విచిత్రరూపాయ మనోజవాయ
నమశ్శివాయాద్భుతవైభవాయ

కైలాసవాసాయ జగన్నుతాయ
భస్మాంగరాగాయ కృపాకరాయ
మనోజ్ఞ సౌందర్య మహోన్నతాయ
కళ్యాణరూపాయ నమశ్శివాయ

శివాయ రుద్రాయ మహానటాయ
విశ్వాధినాథాయ గురూత్తమాయ
శైలాధిరాజేంద్ర సుతాహృదబ్జ
సూర్యాయ దేవాయ నమోహరాయ

ఆకాశకేశాయ జటాధరాయ
దక్షాధ్వర ధ్వంసనకారకాయ
శ్రీవీరభద్రాయ వృషధ్వజాయ
నమస్సురేశాయ సనాతనాయ

అగస్త్య మిత్రావరుణాత్మజాత
మృకండుపుత్రాది మునీంద్రనాథ
స్తుతాంఘ్రియుగ్మాయ దిగంబరాయ
శూలాభిషంగాయ నమోభవాయ

నమఃకులాధీశ్వర తీవ్రబాధా
బాష్పాభిషేకాంఘ్రి సరోరుహాయ
భావప్రియాన్వేషణ మగ్నభావ
ప్రసాదదీపాంకుర భాసురాయ

శచీ శివా నాము సరోజనేత్రా
హ్రాసంతరానందసనాగరేఖా
మయూఖాలాన్యాయ నమోహరాయ
మహేంద్రపూజాయ మహేశ్వరాయ

ఇదం విద్యాశేఖరాణాం నవ్యకావ్యం నవోదయం
విద్యాదేవమహేంద్రస్య ప్రదదాతి శివప్రియం

శాంకరశ్యామదాసేనో భార్గవేణ ప్రణోదితః
గ్రంథోఽయం భక్తసంఘాయ భవతాద్భవతారకః

---

ఆంధ్రీసప్తశతి

ఓ! శ్రీ పర్వత మల్లికార్జున శివా! యోగీంద్ర చింతామణీ!
నీ శ్రుత్యగ్ర నటత్పదాబ్జములు ధ్యానింతున్ మహాదేవ! ఈ
నా శ్రుత్యగ్రము లందు నవ్య కవితా నాదంబులన్ దగ్ధ కం
తు శ్రీలన్ వినిపింపు నీకు నొనరింతున్ లేఖకోద్యోగమున్

కడు వేగంబున ముందువెన్కలు సమీక్షం జేయకే నాకల
మ్మడియాసన్ పరువెత్తుచున్నయది దేవా! త్రోవనేనూనో నే
నడుగంబోవను గాని ప్రాఙ్మథనమధ్యభ్రాంతమై యున్న పా
ల్కడలిం బోలిన నా మనస్సు కొక ఆలంబమ్ము కల్పింపవే!

యోగివరేణ్యుడై అలరునో అలరారడో గాని కీర్తికిన్
కాగల తెన్గుసీమ నడిగడ్డ పయిన్ గళమెత్తి యీతఁడ
భ్యాగత సాహితీ హృదయ పంకజముల్ వికసింప పాడునో
భోగివిభూషణా! కదలిపోవవె లోకములెల్ల నీదయన్

తెనుగు దనమ్ము మెత్తనిది — తెన్గు జనమ్ముల గుండె చాల మె
త్తనిది — తెనుంగు పల్కులు సుతారపు వెన్నెల వెల్గు వెల్లికల్
తెనుగె విచిత్రమైన ఒక తీయని స్వాప్నిక దివ్య సీమ ఆ
తెనుగున నీ ప్రభావము నుతించెద దేవ! అనుగ్రహింపవే!

విచ్చిన కన్నె తామరల వెల్లువలై ప్రవహించు పచ్చి గో
ర్వెచ్చని తీయతేనియల వెల్లుల అచ్చపు టందచందముల్
ముచ్చటగొల్పగా భువనముల్ పులకించెడి తేటతెన్గులో
ఇచ్చట స్వాగతమ్ము వచియింతు శివా! భవదీయ మూర్తికిన్—

కాసిన చుక్కల మల్లియల దోసిలితో మినువాక కన్నెకై
చేసిన దండలిన్ వలపు సేసల తారల వాలు జూపు మేల్
పూసల పల్లకీ పయిన నామెడ వెన్నెలరేని దాల్పు నీ
మోసల లోన మోహములు మోసులు వేసెను దేవ! చూచితే!

సాగిన తీయ పూమిసల సుంజు పసమ్ముగ గ్రోలి మత్తుచే
తూగిన కమ్మతావి పసదోచెడి కైతల నీలి నింగిలో
దాగుకొమ్మూతలాగు పసితుంగ్రిని ఆగముసేయకుండ ఆ
గాగు మటంచు జూటమునం గట్టిన నిన్ను నుతించెదన్ శివా!

తియ్యని పాట — తేనియల తేట — సరాల సరాల ఆట మేల్
నెయ్యపు బాట — నిర్మలత నిండిన పండిన పంట వెన్నెలై
వెయ్యి వెలుంగు వెల్లికలు వెల్లువలై వెలయించు వేళ నే
నియ్యగఁ జూచినాడ నివియే కనుమయ్య! కళాప్రసూనముల్ —

పూవుల ప్రోవులై విరగఁబూచిన కల్వాల విందు చందనై
తావుల తావులై కవిసుధాకర కావ్య కళా విలాసనై
క్రోవుల క్రేవలై వలపు కూర్పుల నేర్పుల కోవలోనివై
శ్రీ విలసిల్లు వెన్నెలల రీతిని నీవెలుగొంచెదన్ – శివా!

ప్రాణములుగ్గబట్టుకొని ప్రప్రథమంబుగ విశ్వ పూజ్య సి*
ధ్యానతిభక్తలోకు కరుణావరుణాలయు పాడినాడ – నీ
మానస మహస్సులో వెలుగు మాత్రము చూడగ లేక యుంటి – నా
గానతపస్సులో విరహ గాథలు దేవ! వినంగ రావొకో?

* ఈ కావ్య రచనకు ప్రాణము శైవ భావన గేయరూపముగా హృదయమునకు తోచినది. అది మహేశుని కూర్చిన తొలివలపు. ఆ తలపు ఇట సూచితము. ఆ గేయములు ఈక్రింద ఉదాహృతములు.

౧

జయ ఫాల నయన! శ్రిత లోల నయన! సిత శైల శయన! శర్వా!
జయ కాల కాల! జయ మృత్యు మృత్యు! జయ దేవ దేవ! శంభో!
జయ చంద్రవకా?! నమదింద్రవకా?మణిసాంద్రమౌళిచరణా!
జయ యోగ మార్గ జిత రాగ దుర్గ ముని యోగ భాగ! భర్గా!
జయ స్వర్గ వాసి మహి వర్గ భాసి ప్రతి సర్గ సర్గ కల్పా!
జయ పర్వతేంద్ర తనయా కుచాగ్ర పరికల్పనీయ శిల్పా!
జయ బంధు జీవ సుమ బంధు జీవ సమ సాంధ్య రాగ జూటా!
జయ చండ చండ తర తాండవోగ్ర భర కంప మాన భువనా!
జయ హారహీర ఘనసార సారతర శారదాభ్ర రూపా!
జయ శృంగి శృంగి శ్రుతి భృంగి భృంగి భృతి నంది నంది వినుతీ!
జయ కాల కంఠ కలకంఠ కంఠ సుర సుందరీ స్తుత శ్రీ!
జయ భావ జాత సమ! భావజాత సుకళాజిత ప్రియాంఘ్రీ!
జయ దగ్ధ భావ భవ! స్నిగ్ధ భావ! భవ! ముగ్ధ భావ భవనా!
జయ రుండ మాలి! జయ రూక్ష వీక్ష! రుచి రుంద్ర రూప! రుద్రా!
జయ నాసికాగ్ర నయనోగ్ర దృష్టి జనితాగ్ని భుగ్న విభవా!
జయ ఘోర ఘోరతర తాప జాప తప ఉగ్ర రూప విజితా!
జయ కాంతి మాలి! జయ క్రాంతి కేలి జయ శాంతి శాలి! శూలీ!
జయ సూర్య చంద్ర శిఖి సూచనాగ్ర నయలోచనాగ్ర! ఉగ్రా!
జయ బ్రహ్మ విష్ణు పురుహూత ముఖ్య సుర సన్నుతాంఘ్రి యుగ్మా!
జయ ఫాలనేత్రా! జయచంద్రశీర్ష! జయ నాగభూష! శూలీ!
జయ కాల కాల! జయ మృత్యు మృత్యు! జయ దేవదేవ! శంభో!

౨

జయ నాగేంద్ర విభూషణ! శంకర
జయ హాలాహల నీల గళా!
జయ గంగా ధర ! శశాంక శేఖర !
జయ గౌరీ ప్రియ! దేవ! శివా!

కింపుర్వాణులు గీర్వాణులు నీ
అడుగు గోయి కడ అభవ శివా!
సకల భూతములు చరా చరంబులు
నిగమాగమములు నీవె శివా!

ఓంకారమ్ములు హ్రీంకారమ్ములు
నిఖిల శబ్దములు నీవె శివా !
పరమాత్మామ్నాయము పంచాక్షరిలో
నివాస మున్నది నీవె శివా !

మానస జిహ్వలు మరచునో యేమో
మానక నిలుపుము మదిని శివా!
నమశ్శివాయోమ్ నమశ్శివా యని
నతి యొనరించెద సతము శివా!

ఏమి చేసితినో యిచ్ఛా దుష్టం
బీ మనుష్యజని యేల శివా!
నీ పదాబ్జముల నిశ్చల సుమమై
నిలచిన మేలని తలతు శివా!

అభిచారంబులు వ్యభిచారంబులు
అగ్ర వ్యగ్రము లాయె శివా!
మనస్సు కలుషము మహస్సు మధు విష
మహస్సు నికషం బాయె శివా!

మంత్ర తంత్రములు మణులౌషధములు
మమతకు మూల మ్మాయె శివా!
నైశ్చల్యము గల నవ్య విరాగా
నందము నీయవె నాకు శివా!

నిన్నే తలచెద నిన్నే కొలిచెద
నిన్నే అభిమానింతు శివా!
నీవే గానము నీవే జ్ఞానము
నీవే ధ్యానము నిజము శివా!

నిన్నెంచుటకై నిను కాంచుటకై
నిను సేవింపగ నిలుతు శివా!
నిర్మల నిశ్చల నిభృత మూర్తివై
నిండు టెడదలో నిలువు శివా!

దహరగగనమున విహరణఁ జేసెడి
జ్యోతిర్మూర్తివి సుమ్ము శివా!
రహస్తపస్సులు రజస్తమస్సులు
నిత్య సత్వముల నింపు శివా!

శివుడే దైవము శివుడే భావము
జీవికి జీవము శివుడె శివా!
శివాఖ్యతత్వము శివాఖ్యమంత్రము
శివత్వ మందుటె చివర శివా!

ఎన్నాళ్ళీ గతి ఎన్నేండ్లీ గతి
ఎన్నడు చేరుఁగా నిన్ను శివా!
భరింపలేనిక తరింపలేనిక
వరించితిని నీపదము శివా!

ఎక్కఁడ నుందువో? ఎప్పుడు కందువో?
ఏమని యందువో? ఎట్టులో? శివా!
ఏది మార్గమో? ఎచటకు చేరుటో
ఎరిగింపఁగదే యీశ! శివా!

గమ్య స్థానము కలదొక చోటని
కలలు గాంచుటే కలిగె శివా!
భ్రమించినాఁడను శ్రమించినాఁడను
గమించుటికి నీ కరుణ శివా!

అర్థ భాగమున అంబ వెలుంగఁగ
అంకపీఠిపై ఆత్మజు లలరఁగ
అనుగు దోయిపై పడిన జడాత్ముని
ఆదరింపఁ గదె! అభవ! శివా!

జయ తుషార గిరి కన్యకా కుచ
ద్వయ విహార కర తామరసా!
భుజంగ భూషణా! భ్రుకుటీ సంహృత
పునర్జన్మ భయ సంతమసా!

శంభో శంకర! భక్త వశంకర!
భవనాశంకర! భర్గశివా!
ఖండేందుధరా! ఖట్వాంగధరా!
సారంగ ధరా! సాంబశివా!

త్రిశూల ధారీ! కపాల మాలీ!
త్రియంబకా! హర! నమశ్శివా!
జయ మదనాంతక! జయ మృత్యుంజయ!
శంభో! శంకర! సాంబశివా!

ఎన్నియుగాల నుండి తపియించుచు నున్నవో స్వామి! ఈ జనుః
క్లిన్నవిషాదజీవి లవలేశము నీకరుణావిలాసమున్
కన్నది గాదు లోకముల కావలి కావలి వాడ వైన నీ
కన్నుల వెల్గు కన్నులకు కట్టిన జల్ కన నెంచు నెప్పుడున్.

కాగ మొయిళ్ళ చీకటులు క్రమ్మిన వేళల అర్ధరాత్రులం
దావిని మింటలన్ కవిత లల్లిన గుండెలలోని జ్యోతి రా
కారము లెన్నొ భాస్వర వికారములై చరియించు చోట్ల ఏ
కాకిగ మర్త్య! యిల్లు తిరుగంగ శ్మశానధరాతలంబునన్.

చితులు సుగాఢులున్ శిథిల చిత్రములైన విచిత్ర సీమలో
కుతుకముతోడ వాడెదవు గొంతుక యెత్తి మహా భయంకరా
కృతులు కృతుల్ జగన్మరణగీతిక లద్భుతమృత్యుదేవతా
యతనము లోని పిల్పులు శివా! యిది యెక్కడి నీకు నైజమో!

కన్నని కాటు వేయ గల కాలభుజంగమభూషణావళుల్
బుస్సలు కొట్టగా నయనముల్ ముకుళించి యుగాంత కల్పనా
నిస్సరణంబుగా నడచు నీదు పదద్వయి క్రింది మృత్తికన్
ఉస్సురు మందు నున్నయవి ఉగ్రుడ! కోట్ల కొలంది జీవముల్.

ముక్కుకు సూటిగా పయనమున్ బచరింతువు త్రోవలోని యొ
క్కొక్క సమాధిలో నొదిగి యుండిన వేనకు వేలు భావనా
దృక్కులు నిన్నె చూచును వరింపవుగా ఒక దాని నేని నీ
చిక్కని వెల్గు నేటికిని చిక్కని వెల్గుగనే వెలింగెడున్.

---

జయ నాగేంద్ర విభూషణా! శంకర!
జయ హాలాహల నీలగళా!
జయ గంగాధర! శశాంక శేఖర!
జయ గౌరీప్రియ! దేవ! శివా!

పాపాంతకము—జనుర్భిన్న

ఉత్తమ సీదు రూప మని ఉంచిన త్వద్గత భక్తి భావనో
న్మత్త మనస్కముల్ త్రిభువన ప్రభు! రుద్ర గణమ్ము లుగ్రముల్
క్రొత్త యముండొ ప్రాత యముడో యిటు రమ్మని పల్కు వేళలన్
తిత్తిరి పక్షు లంతటి యదృష్టము పట్టదు నాకొకప్పుడున్.

రక్కసి మూకలన్ గలసి రాజ్యముఁ జేసెద విందు నందునన్
ముక్కున త్రాడు వేసి నిను ముందుకు లాగుదు రుగ్రతన్ తలల్
గ్రక్కున కోసి యిత్తురు కరాళ తపస్సులు వీర శైవ లీ
దిక్కున లేరు లెమ్మనియొ దేవ! నటించెద విష్టమైనటుల్

వాసము నల్లకాడనుచు పల్కెద రో తలపంగ లేము నీ
వేసము ఎవ్వరే గతిని పిల్చిన అట్టులనే క్షణమ్ములో
మోసపు రంగు వేసి కొని ముందర నిల్చెద వెవ్వరెంతగా
రోసము గొన్న నీ అసలు రూపు నెఱుంగగ నీవుగా ప్రభూ!

అప్రియ మంచు పల్కగ భయంపడ నేల నిజమ్ము నీవిలన్
విప్ర వినోది వోలె నొక వేసుక కన్నుల గప్పు చుందువే
ఏ ప్రళయమ్ము నేని గ్రహియించి తరించిన మౌనికోటి రు
ద్ర ప్రళయ మ్మెఱుంగదు సదాశివ! నీ మహనీయ మాయచే

వ్యాసులు బుద్ధులున్ జినులు వందలు వేలు గతించి నారు కా
లాసన వాన బిందు కళికా కృతులై—ఒక రోజు గూడ నీ
మోసలలోన నిష్టటికి పూర్ణము గాదు మహా శ్మశాన సం
వాసి! ఒకండునున్ తిరిగి వచ్చిన పాపము తోడఁ బోవడున్

మనసు గ్రహింప లేని ఒక మాయ గ్రసించిన కోట కోట్ల యో
జనముల పైన ఆ రవి నిశాకర తారక మండలమ్ములన్
కనుగొనలేని చీకటులు గప్పిన సీమను నించు కావలన్
వెనగానియుందువంట ఒక ప్రేయసి తోడ నిజమ్మొకో? ప్రభూ!

నగ్న శరీర మూర్తి వయి నాట్యముఁ జేసెడి వేళ ఓ మహో
ద్విగ్న మనస్కా! నీ ప్రళయ భీకర తాండవ కేళికా గతిన్
భగ్నము లయ్యె నీ భువనముల్ వికట భ్రుకుటీ ప్రచార! క్రో
ధాగ్నిమయోగ్ర! రుద్ర! భవదాకృతి దుర్భర మయ్యె! భూమికిన్-

ఐంద్రము నీదు మాయ జగదద్భుతమైనది విశ్వభావనా
సాంద్ర ఖరాంశు మండల వశంవద దృగ్రుచియా అలౌకికా
తీంద్రియ శక్తి గల్గదు గదే నిను కన్గొన దిగ్దిగంతముల్
మంద్రము నీ ప్రభావమున రుద్రుడ! వెల్గుపసంహరింపవే!

ప్రకటన కాని వెల్గిది శివా!- ఒక దీనుని గుండెలోని గొం
తుక యిది పల్కు చున్నది కనుంగొనవే! దురదృష్ట దుఃఖ గీ
తిక ఒక తీవ్ర వేదన జితించిన చోటిది యిందు శాంతి దీ
పిక వెలిగింపవే! ప్రణవ వీథులలో విహరింపనీయవే!

ఎద యిది మండుచున్నది మహేశ్వర! ఊరక చూచి చూడన
ట్లిదివర కెన్నడేనికన నే కననట్టులు క్రొత్త దారి త్రొ
క్కెద వరుణాంబకద్యుతుల కేవల కేవలతా ప్రదీప్తికిన్
కుదురగు మూర్తిలోని వెలుగుల్ పరికింపవె బాధ నార్పవే!

తుకతుక లాడి యీ ప్రణయ దుగ్ధపు టేరులు పొంగిపోయె ఊ
ర్మిక లవి మార్మికధ్వనులు రేపుచు నున్నవి రాతిగుండెలన్
సుకరము గాని దుఃస్తర జనుర్జలరాసుల మధ్య నున్న యీ
వికృతకఠోరకంఠరవ వేదననీచెవి సోకదా ప్రభూ!

కల్పములున్ యుగాంతములు కాలములందవధుల్ గమించి యీ
కాల్పనిక ప్రపంచములు కట్టడి సేయుచు నుండు నీదు సం
కల్పము నందు మార్పొకటి కల్గదు గా శివ! నీదు భావనా
శిల్పము ముందు అల్పులు ఋషిత్వము గన్న కవీంద్రులే ప్రభూ!

నిగ్గు వడెన్ మహాకవుల సృష్టియు ఘోర యుగాంత వేళలన్
భగ్గున మండు నీ భువన భాండములన్ రస రంగ వల్లికల్
మ్రుగ్గులు దీర్చి ఒక్క క్షణముక్ సృజియించితి విగ్గు చెప్పకో
నగ్గ విచిత్ర మయ్యది సదాశివ! అర్థము గాదు నేటికిన్

అంతము లేని దొక్కడ ప్రయాణము? ఎంతటి దూర మేగి వి
శ్రాంతి వహించు నీ పద పరాగము? గాంగ ధునీ తరంగముల్
భ్రాంతి జగమ్ము లోన రస రాజ్యములన్ నడిపించు వేళ ని
శ్చింతిగ మోము ద్రిప్పి శశిశేఖర! నాగెద వేల వింతగన్

ఆగని నా మనస్సు వలె ఆగని నీదు మహా ప్రవాహ మే
యోగ సుధా విలాసముల నూహ యొనర్చునొ పల్క లేము బా
గోగు లెరుంగ లేము భువనోదయ! నీ దయ లేని నో మహా
భోగివి యోగివిన్ భుజగ భూషణ! త్వద్గతి సృష్టిలోననే

చెర విడి నల్గు పర్వులిడు శీఘ్ర కవిత్వ యశమ్ము నీకె నా
పసువు సమస్త మమ్ము కొని పాడు బందిని త్రోసి పుచ్చి నా
పరువము వీడి వెంట బడి వచ్చెద అడ్డము లేని దాక ద
గ్గరకును దీయవే! పరమ కారుణికత్వ మొకింత జూపవే!

క్లాంత శరీర మానసిక గాఢ సుషుప్తి సమాప్త చైత్రసం
క్రాంతికి ముందు వచ్చిన ఒకానొక స్వాప్నిక సీమ లోని అ
భ్యంతర బాహ్య చేతన పదార్థము నీవని ఊహలో ఉషః
కాంతికి దోచె ఆ కలలు కన్నది మేమొ? మరింక నీవునో?

గుండెలు చీల్చి భావములు కుప్పలు పోసిన చిత్ర సీమలో
నుండి ప్రయాణ మైన ఒక నూతన సృష్టి జగజ్జనార్భటీ
డిండిమ తీవ్ర నాద నిబిడీకృత భూవలయమ్ము నయ్యెనో
చండ దృగగ్ర! ఈ రస విచారము లెంతటి దాక పోవునో

తలచిన తీరులే మరల తాను దలంచును నన్ తలంచుచో
పలికిన పల్కులే మరల పల్కును ఈ పునరుక్తి దోషముల్
తెలిసెను నేను నా కృతిని నీపకే మూలము నీవు సృష్టిలో
నిలిపిన దానినే మరల నిల్పుట బొమ్మల వోలె నంచునో

కన దగినట్టి దాని కల గంటి నటంచును తృప్తి గన్నచో
మనుజులు నవ్వుకొందు రని మాత్రము నా కల మానుకొందునా
తనుకనుం జూపెం గోని ఒక తెల్గుప్పు నీ వని తెంట నంటుచో
కనిన కలల్ సుసత్యములం గావగ నీ కృప గల్గినన్ శివా!

వదలను నీ పయిన్ తలపు వ్యగ్ర మనస్కుడ నయ్యు వెంబడిన్
పద పద వచ్చెదన్ ప్రతిమ ఒట్టి ప్రపంచపు టంచు దాక నీ
పద పద మందునన్ వెలుగు బాటలు కన్పడు చుండు నట్లు నా
పద పద మందునన్ వలపు పాటలు విన్పడ గా తలంపవే!

కవి యను కొన్న నా మెద ఒకానొక వేళ రసప్రపంచపున్
గనములు త్రొక్క లేక తన గర్వము సర్వము త్రోసి పుచ్చి ఓ
శివ! భర మెల్ల నీ మహిత శీర్షము నందో పదంబులందునో
వివృత మనః కవాటమయి పెట్టెను నాడయినన్ గ్రహింపవే!

వలపిడు పవిత్రమ్మునకు వాడు పిశాచము వోలె వచ్చి నా
బలము సమస్తముం దినగ ఫాలము నందున వహ్ని నేత్రముం
గలిగియు దేవ! ఏల చలనమ్ము వహింపవు భక్తులన్నచో
అలుసుగ జూతు వేమి? అభవా! ఇక నీ వనువాడ వెందుకో!

అసుగిడ బోవ ముందుకు శివా! నిటలాంబక భీకరాగ్నికిన్
జడిసియె తప్పు కొందురని నాగగబోకుము నీదు భక్తులే
మొడ ఎవరడ్డమైన చలియించెద రే ఇక నీకు మాకు ఈ
మొడము భరింప లేము జగదీశ! ఒకింత అనుగ్రహింపవే!

కలలు సమస్తమున్ నిజము గా నగు దాక మహోగ్ర మామక
జ్వలిత తపస్సుతో భువన భాండము లగ్నులతో రగిల్చెదన్
విలయము వచ్చి మీఁద బడు వేళల నైనను నిన్ దలంచుచున్
నిలచెద నిశ్చలంబయిన నిష్ఠ వహించి దయన్ ధరింపవే!

ఒక కవినైన నో మనసు లూగిసలాడు మహాకవిత్వ సం
చకితముఁ జేసి ఎంతటి ప్రజా సముదాయము నైన నాడు కో
రిక కనురూపమైన ఒక రీతిని నిల్పెడి వాడ దుష్ట హృత్
క్రకచ నిరోధితుండనయి కానిక నీ దయ లేక ఏదియున్

శివుడ వటంచు నా మనసు చెప్పను నిన్ను మహాతపస్వులౌ
కవులు ఋషిత్వ మంది త్రిజగన్నుతులైన పురాణ కోవిదుల్
వివిధ విధంబులం దనుభవించి వచించిరి నీ స్వరూపమున్
ఎవర వటంచు నిన్ను నుతియించెద దేవ! అసిద్ధవాక్కులన్

వ్రాయదు నాదు లేఖిని తలంపదు నాహృదయమ్ము బుద్బుద
ప్రాయము జీవిత మ్మనుచు పాదము నాగదు ముందు కింతయున్
నా యనుమానమే నిజము నన్నొక చిత్ర విషాద కావ్యమున్
చేయునో దేవ! నీ యెడమ నేత్రముతో ఒక సారి చూడవే!

వెలుగుల లోని వెల్లువయి వెల్గెడి నీ వెలుగుం దలంచుచున్
వెలుగును నేడు నా బ్రతుకు వెల్లువలై విలసిల్లు భావముల్
కలవర పాటు చెందిన ఒకానొక సుస్థిర వృత్తి నుండుచో
కలచును నన్ను నో గరళకంఠుడ! ఏ విషదిగ్ధకంఠమో!

రుద్రుడ వైన నీయెడద రూక్ష మటంచును నే నెరింగియున్
ముద్రిత శక్తి సాధన సమున్నతి మూర్తుల చెంత భక్తి ని
ర్నిద్రుల చెంత నీ పదము నిల్పెడు నప్పుడు నేను పల్కెదన్
భద్రము స్వామి! ఈ శివ తపస్వులు చిత్రవిచిత్రసాత్వికుల్

చైత్రము దాటి వచ్చినది చైత్రము చైత్త్ర పథంబులం దహో
రాత్రము లెన్ని యో తిరుగ వ్రాసిరి నీ రథనేమిరావముల్
శ్రోత్రము లంబడెన్ వెదుకఁ జొచ్చిన వారెటు బోయి నారొ నీ
యాత్రయెటో యెఱుంగను శివా! ఇక నేనె స్వయమ్ము వచ్చెదన్

ఎక్కడి యీ అగాధముల ఎన్ని యుగమ్ములు దిక్కు లేక నే
నొక్కడనై తపించెద మహోదయ! నీ దయ యున్న గాలమున్
కొక్కెము గట్టి గుండెలకు గ్రుచ్చియు నేనియు తోడుకొమ్ము నీ
దిక్కుకు లోక మింత గణుతింపని ఒక్క అభాగ్యజీవునిన్

లేదని లేనిదెల్ల పెకలించి యొసంగు మటంచు కోర ని
చ్ఛా దరహాస సుందర విషాద విచిత్ర మహా స్వరూప! యీ
నాదు తపఃప్రగాఢనయనంబుల ముందర నీవునిల్చిన
న్నాదర బుద్ధిఁ జూచిన శివా! అది చాలు నటంచు పల్కెదన్

ప్రాయము లోనె మామకతపమ్మిది సిద్ధిని పొందునేని నే
నే యొక మంత్రదర్శనుడనేని కవీంద్రుడనేని జీవితా
ధ్యాయము లందు నే నొక మహత్తర తత్త్వము దేవ! ఎవ్వరున్
వ్రాయగ లేని అద్భుతశివత్వము భావన నిల్పఁ బూనెదన్

ఇది యొక వ్యంగ్యకావ్య మని యేను తలంచితి గాని పాఠకుల్
మొదలిది కావ్యమే యనుచు ముట్టరు దీనిని నాదు జీవిత
మ్మది గతిలేని వ్యర్థ కవితాకృతి దాల్చెను వ్యగ్రభావనా
స్పదమయి నిండు యౌవనము జారిన వేశ్య విలాసమై శివా!

భవ మిది చిత్ర మో శివ! అపారరసాకర మయ్యునున్ మహా
కవి కృత పూర్ణ కావ్య మది కాదు గదా ఒక నాటి కేనియున్
వివిధకవీంద్ర సంకలన విస్తృతమై బహుధా విభక్తమై
అవిరత ఖండకావ్యమయి ఆకృతిదాల్చెను భావ తీవ్రతన్—

విశ్వముఖీ వదాబ్జములు పట్టికొనన్న భ్రమమ్ములో పె ఆ
వశ్యక మైన కార్యములు పట్టవు గాక – అమానుషమ్ముగా
దేశ్యకథా పరీక్షితులు దేవపథమ్ములు పట్టె ఇంతెకున్
కశ్యపు డేమి చేయు విధికల్పితమైన పరీక్షకున్ శివా!

నా యను వారు కల్గిరని నమ్మిటు కన్నను లోక మందు వే
రే యొక తప్పు లేదని గ్రహించితి చేటికి ధర్మమెల్ల ఛీ
ఛీ యనినన్ మలీమస మహీన మానస మానవాళికిన్
మాయదుగా శివా! కపట మార్గము కృత్రిమకాలవంచనన్ –

హారపు కొండలన్ నునుపు దోచెను దగ్గరకేగ నల్ల బం
గారము ముద్ద ముద్దలయి కన్పడె నో శివ! త్రవ్వి తెచ్చు కో
గోరిన నాడు కన్నుగవకున్ బహుదూరపు బాటసారులై
కాయ మొయిళ్ళ గుంపులవి కన్పడె దోపిడి దొంగలట్లులన్

కాలములోని లోతులను గాంచిన ఓ పరదేశి! నీ కహో!
బాలక కృత్యముల్ గద ప్రపంచము లోపలి నగ్న సత్యముల్
కాళ నిశీధముల్ యుగయుగమ్ములు గప్పిన నేను మృత్యు దే
వాలయ సీమ నుండెదవు ద్వారము చెంగట నిల్చి పిల్చుచున్ –

అరువది యేండ్లు దాటిన మహాకవి యైనను షష్టిపూర్తి సం
బరములలోన నుత్సవ సమాగత లోకమువంక చూపులన్
పరుగులువీయు గాని తనపై బడ నుండిన కాలదండమున్
గురుతుకు దెచ్చుకోc జెరుగ గోరడు దాని ప్రభావమున్ శివా!

నల్లని కోడెనాగువలె నాపయివచ్చిన మృత్యు దేవియున్
చల్లని బాహువల్లికలు సాచెను గాటపు కౌగిలింతకై
త్రుళ్ళి పడెన్ శివా! తనువు తోన మనస్సును నేండజేసి మే
నెల్ల త్రినేత్ర కీలల దహించి వహింతునా? శాశ్వతత్వమున్

ఘూయను గ్రుడ్లగూబలవి కోళ్ళవలెన్ గళమెత్తి కొక్కొరో
కో యని కూయజొచ్చె అదిగో ఇదిగో యని అర్ధరాత్రిలో
ప్రాయము జారిపోయినది వాంఛలు మాత్రము చావలేదు నా
రాయిత దుష్ప్రవృత్తులు పరంతపనై పడవెత్తునో శివా!

గ్రుడ్డి గులాబిముండ్లు మెయి గ్రుచ్చుకొనన్ శివమెత్తి నట్టులై
గడ్డి దినంగ బోవుపట కాపురుషుండు నిశీథసుందరుల్
దొడ్డ మనస్సులో సగము దోచిన పిమ్మట వెన్క దీసినన్
పడ్డ శ్రమమ్ము దెల్ల శివ! వ్యర్థముగాదె మనుష్య జీవికిన్

విడియము కాని కాలమున వేసికొనన్ శివ! గుండెలోపలన్
గుడిసెయు కుంపటుల్ స్మరణకున్ జనుదెంచును ఏవో ఎత్తుగా
గడబిడసేయు సృష్టిని ఒకానొక దానికి ఒక్కదానికిన్
ముడివడు బంధముండు ఒక మోహమగుచంతియు కాళ్ళ బేరమై

అట్టిటు జారిపోయి బ్రతుకంతయు చెడ్డది లోనిగుట్టికన్
రట్టయి పోయె వట్టి చదరంగపు ఎత్తులతోడ ఆటయున్
గట్టెను కాళ్ళువచ్చి కథ కంచికి పోయెను ఇంటిమార్గమున్
పట్టితి మీశ! కాని కనుపట్టదు వత్తియొకింత తిల్లికన్

ఈ (శ్రీ) పర్వము లుగ్రగర్వములు స్వామీ! భావనార్వమ్ము తే
నిశ్రేణీగత నీతిమర్మములొగానీ – అపగాం జాల వీ
అశ్రద్ధా భర దుర్విదగ్ధ హృదయంబందున్ సముద్రేక జం
తుశ్రేణుల్ నడిపించి కామ నిబిడాంధూబంధముల్ త్రెంపవే—

సుశ్రోణుల్ సురసుందరుల్ కలలయంచుల్ దాటిపోలేక అ
ప్రశ్రాంతిమ్మయి జీవితమ్మొక మహాప్రస్థానమైపోయె ఈ
అశ్రాంతాంతరమందు శాంతి ఎటులయ్యా! ఓ స్వయంభూ! శివా!
అశ్రువ్యగ్రము నా ముఖమ్మిదె త్వదీయాంఘ్రిద్వయిన్ నిల్పితిన్

అశ్రావ్యత్వమనవ్యతత్వము నకావ్యత్వమ్ము కల్పించు నీ
అశ్రద్ధామయజీవితమ్మున మహేశా! ఎన్నినాళ్ళీగతిన్
అశ్రోతృత్వమలోచనత్వమును నీ కర్పింపకేనుందు నీ
అశ్రీమత్త్వములోని ఒక్క వెలుగయ్యా! నాకు నందింపవే

ఏ శ్రీ దైవ తపఃప్రభావ కలనా హేతుప్రభూతమ్ములో
ఈ శ్రీమన్మథురానుభావములహో! ఈ అగ్రమందో ప్రభూ!
ఏ శ్రీకంధర మస్తకాగ్రరమణీయేందుప్రసన్నాంశువుల్
సుశ్రేయంబులు దీర్చునో శుభ సుధా స్రోతస్వినుల్ గూర్చునో

ఓ శ్రీ కంఠ! నినున్ భజించి సతమార్యుల్ మెచ్చు సేవారతిన్
శుశ్రూషామతినిల్చినా నయిన నెందున్ గానరావేమి? పో
నీ శ్రీకంఠుడనేనె యాదునను పూన్కిన్ పూనితిన్ గాని నా
కా శ్రీ కంఠముదాటి లోఁజనునా ఏమౌనోయటంచాగితిన్

ఈ శ్రద్ధాళువు గుండెలో నిముడదేదీ గాని – నా కావ్య క
న్యా శ్రీ నాథుడనైన తృప్తియగునయ్యా! నాకు ఆపైనికన్
నీ శ్రీ శూన్యతలోని ఆంతరదృగంతేవాసినై నిత్యమున్
విశ్రాంతిన్ గనుచుందు శాంతహృదయోద్వృత్తిన్ నిమిత్తాకృతిన్

ఆ శ్రీనాథుడు శారదావిభుడు నీ అంతేన్ సమీక్షింపలే
క శ్రేష్ఠత్వము గాంచినారట మహేశా! అల్పుడన్ నేను నీ
సు శ్రీమంజులమందహాససుషమాశోభాశశిక్రాంతమౌ
ళి శ్రీనాథపదోద్భవోర్మికల హేళిన్ నన్ ప్రసాదింపవే–

అశ్రోతవ్యము లన్యచింతన సమాయాస ప్రయాసమ్ములం
చశ్రాంతమ్మును నిన్నె నమ్మితి మహేశా! ఎన్ని జన్మమ్ము లి
ట్లశ్రేయస్కముగా భరించెద శివా! ఆనందసంధాయివై
సుశ్రాంతమ్ముగ నాజనుర్జలధులన్ శోషింపగాఁ జేయవే–

ఏ శ్రోతల్ వినలేని కర్కశగళంబె నాది యేరీతి గా
విశ్రౌతాధికు నిన్ను పాడెదను నిర్వేలంబుగా–ఇంతకున్
ఈ (శ్రీ) హీనుని పైన చూపు పడదేమీ! స్వామి! నీవెప్పుడున్
వాశ్రా* నందపక్షీన ధేనువవు కావా? దేవ! విశ్వేశ్వరా!

అశ్రంధీకృత మంతరంగ మది నీకై నిల్చి దీర్ఘీకృత
శ్మశ్రు వ్యాప్తము శ్వేతకేశమయి సంభాషించు ఆంధ్రామరీ
మిశ్ర గ్రాంధిక వేదిపై నవరసోన్మేషంబునన్ పాడుచో
ఈ (శ్రీ) రాగము నీ హృదంతరములో తృప్తిన్ సమీక్షించునో

అశ్రివ్యాగ్రము పాదపాదమిది వాగర్థమ్ముఁ గాహించుచో
విశ్రుత్యద్భుత కృత్యముల్ జరుగు భావిబ్రహ్మకల్పంబులో
విశ్రావమ్ములు నుండవచ్చు పదవీ విస్ఫోట వాదమ్ములో
విశ్రాంతిన్ గన నీదు నీకరుణయే వీక్షింప విశ్వప్రభూ!

ద్రాగుద్దీపిత ధీర శాంత హృదయాధార ప్రభావావళీ
వాగుద్రేక విశంకటోత్కట మహః పర్యుత్సుక ప్రాభవ
ప్రాగుల్లాస మహోజ్జ్వల శ్రుతి పథ ప్రత్యగ్ర పారంపరీ
రాగోత్సాహము తోడ నీ పదము లారాధింతు విశ్వేశ్వరా!

క్రూర క్రుద్ధ కుటుంబ కూట కుటిల క్రోడీకృతాంతర్మద
ద్వారుద్బంధనమత్త దైత్య హృదయ ద్రాగ్భేదన ప్రజ్వల
ద్దీ రుగ్ర ప్రమథేంద్ర మండల దృగగ్ని జ్వాలికా మాలికా
ప్రారంభంబుగ నీ పదాబ్జముల నారాధింతు విశ్వేశ్వరా!

స్రాగ్భావ ప్రసర న్మహోశుకవితాసార ప్రసార ప్రభా
దిగ్భుగ్న ప్రతిభా ప్రవాహలహరీ దేదీప్యమానచ్ఛటా
దృగ్భంగ భ్రమణ భ్రమాకుల హృదూరికార లోకావళీ
వాగ్భూపారవ మెప్పు నిత్యము నినున్ భావింతు విశ్వేశ్వరా!

---

* వాశ్ర=వత్సమునకై 'హంభా' రవోపేత (ధేనువు)

దర్పాఢ్యః కృత చండ పండిత మహాధారాళ ధారానవ
స్స్ఫూర్త్యాలోక మేఘగర్జన మిళితాసాహిత్య సాహిత్యప్లాత్
శ్రావ్యాపాంతర కాంతి సంచకిత కింపుర్వాణ గీర్వాణస్మృక్
కర్పూరమ్ములు నాకళాకలనకున్ గాంక్షింతు విశ్వేశ్వరా!

సంధ్యా సుందర తాండవోగ్ర నటరాజ వ్యగ్ర పాదాంబుజా
వంధ్య భ్రామణ భుగ్న విశ్వనిలయ వ్యాపార దుర్వార ఘో
రాంధ్య భ్రాంత దిగంతరాళి యుగపత్ ప్రధ్వస్త కల్పజ్వలత్
సంధ్యోల్లాసము నీవిలాస మనుచున్ ధ్యానింతు విశ్వేశ్వరా!

నిర్వాణాగ్ర మహాభినిష్క్రమణ దృజ్ఞీరేజ భావ స్ఫురత్
సర్వాంగీణ జగన్నియామక సమస్త దృశ్య వశ్యాంతరాం
తర్వాణి ప్రణిధాన మానసిక గీత క్రీత రూపత్రపా
గీర్వాణాశ్రితపాదయుగ్మని నినున్ గీర్తింతు విశ్వేశ్వరా!

నేదీయస్తర నిర్ఝరాంతర నిమన్మీలన్నినాడంబర
ప్రాదుర్భావ పరంపరా జనురజః ప్రారంభ సంరంభ శూ
న్యౌదాసీన్య నిహాన్య నిశ్చల నిదిధ్యాసస్ఫుటంబైన నీ
పాదాబ్జమ్ములు నా పదాబ్జములలో భావింతు విశ్వేశ్వరా!

దృశ్యాదృశ్య విచిత్రచిత్ర గగన హ్రీంకార మధ్య ప్రభా
వశ్యోచ్చారణ సిద్ధ మంత్ర జప సాఫల్యార్థ దేవావళీ
వేశ్యా సంగ భుజంగతా పరిణత ప్రేయః ప్రసన్నాస్యనిర్
పశ్యత్ఫాలుని నిన్ను నాయెడదలో భావింతు విశ్వేశ్వరా!

కులకుండ జ్వలితాగ్ని మండల నటత్కూర్చ ధ్వనిక్షిప్త కుం
డలినీఖేలన చాలనోన్నమదఖండ బ్రాహ్మ సంకల్ప సం
చలితాజాండ కరండ ఘట్టన మహాశ్చక్షుష్య విద్యుద్వపుః
పులకాంకూరము లుద్గమింపగ నినున్ బూజింతు విశ్వేశ్వరా!

ఉచ్చైయస్సుపదోచ్ఛ్రితాచ్ఛసుకవితోద్దామరోద్దీసతో
దృచ్ఛాచ్ఛన్య ప్రతిభాప్రభోజ్జ్వల మహాధారాళ ధారాధరీ
కృచ్ఛేతోమనోజ్ఞపద్య విలసచ్ఛీక్రమ నమ్రోత్కళా
భ్యుచ్ఛ్రాయంబగు ధర్మభావన నినుస్ బూజింతు విశ్వేశ్వరా!

స్పర్ధాయుద్ధవిచిత్రప్రపంచవిభవవ్రాతాన్యప్రభావ్యప్రభా
నర్ధ వ్యర్థమరర్ధ నిర్మధన విద్యాహృద్య గంభీర స
ర్వార్థ ప్రాపక శాంతిదీపక సమస్యాదృశ్యవశ్యంబుగా
వర్ధిల్లున్ శివ! నాకవిత్వమిది దీవ్యద్దివ్యకావ్యోర్ధతిన్

రాద్రాహుద్ధతి మత్కవిత్వవినుతిన్ గ్రైవేయ సన్మాలికా
మద్రుం జోష్ఠమయూఢనోఘవర మగ్రూఘారవారూషతా
షడ్రౌద్రోద్ధుణ సప్తసాగర మహాశ్చండప్రచండ ప్రకాం
డేద్రూక్షేక్షణ శిశుణకుణునిగా వీక్షింతు నిన్నో శివా!

దిగ్భ్రాంతిన్ సుకవీశ్వరుల్ బుధులు స్పందింపంగ వందింపగా
ప్రాగ్భ్రాజిష్ణు నిరాకరిష్ణు రుచిసంవర్ధిష్ణురోచిష్ణుతా
దృగ్భ్రంశ ప్రతిబద్ధవిద్ధ కుజనవ్రీడావినోదంబుగా
వాగ్భూఘ భుగ్న మహాగ్ని తేజమిది దివ్యంబౌత విశ్వేశ్వరా!

అంతర్వాణులు దేవ! మెచ్చుకొనగా నా నీ ప్రసంగాంతరా
శాంత క్లాంత హృదంతరాంతర నిశాంతాశాంత భావాంతిక
ప్రాంత క్రాంత నితాంతకాంత కవితా ప్రశ్రాంతి విద్యాంతిక
భ్రాంత స్వాంత నిరంతరాయ సుమనః ప్రాసంగికోదంతముల్

తిగ్మాంశూజ్జ్వల భానుభా వ్యతికరోద్రేకంబు రాజద్భుజా
యుగ్మప్రోజ్ఝిత వేగవేగ విశిఖోద్యోగ ప్రయోగంబు న
ర్వాగ్మేధా మదతోద్ధతోద్ధుర సమగ్రస్ఫూర్తిమస్మూర్తి మ
ద్వాగ్మిత్వంబు శివా! త్వదీయ హృదయ స్పందమ్ము గావింపదే!

దిఙ్నాగేంద్ర మదాంధ ఘీంకృతి సముద్వేగారవావిర్భవ
ద్రుఙ్నైమిత్తిక నైషికత్వ పదవీరూఢానతిప్రౌఢతా
దృఙ్నాయాయిక వాదవైభవ భవోద్రేకోదయోత్సేక స
ద్వాఙ్నైశిత్య విభావముల్ వెలయు నాభావమ్ములో శంకరా!

లీలాలాలిత లాస్యలాలస గుణాళీ గౌరవాళీ కళా
కేళీశ్యామల కోమలామల దృగంగీకార కాళీ కృపా
వేలాలంబిత బింబితోజ్జ్వల వచో వేళావిశేషమ్మశే
షాలంకారికమాత దేవ! అనవద్యాస్వాద్య విద్యాగతిన్

ఏవ్యాసంగము నేని మానుకొని స్వామీ! మీకునై విష్ణు జి
ష్ణు వ్యాపారము లాశ్రయించెద సదా శ్రోతవ్య మంతవ్య రం
తవ్యోదవ్యయ భవ్యభావ్య గుణసంస్తవ్యాతి సవ్యక్రియా
దీవ్య ద్దివ్య సుధాసిధాన నియమాధీనావధానంబునన్

వాంఛావిస్తృతితోడ నీకొరకు దేవా! యెంత భావించినన్
సంఛన్నమ్మగు నేమి? శక్తి-కవితా సంభార ధారామహః
పింఛాలంకృత వర్ణ విస్తృత మహావేశైక పద్యావళీ
రింఛోళుల్ ప్రసరింపఁజేసెద రసార్ద్రీభూతచేతస్కముల్

నేనై పల్కెద నిర్ణిరోధ కవితానిర్ణీత కర్ణాంతరా
ధాన ధ్యాన నిదాన దానగుణ సంధాన ప్రధాన ప్రదా
నానూనానతనిర్విరామవిషయవ్యాపార మేపార దే
వా! నీనామము మాధురీ మధు సుధాస్వాద ప్రసాదంబుగన్

పంపా తుంగ తరంగ భంగిమల నాశ్వాసించు జ్యోతిష్మతీ
శంపా మోద సుసత్య నృత్యగతులన్ శాసించు భాషా ఝరీ
ఝంపా వేగ వరప్రసాద కవితా సామ్రాజ్య రాజేశ్వరీ
సంపూర్ణాదరహాసపూరములు మత్సాహిత్య రీతుల్ శివా!

ఆనందచేతన పదార్థములోని వెల్గై
వ్యానప్రభావనిసవల్గువు నేను వెల్గుఁ
ఏనాటిదోయిది మహేశ్వర! భావదీప్తి
కానీనమై యుబుకఁకల్గెను చిత్రమూర్తిన్

ఆద్యాస్వరూపమునకై తపియించు గుండెన్
విద్యానివేదనలు వేదన లాచరింపన్
సద్యోవినిర్గమ విమశ్రయమైన భూమిన్
సద్యోగముల్ వెలయఁజాలవు దేవ! ఇంకన్

ఎన్నేండ్లనుండి నుతియించుచున్నగానీ
ఎన్నాళ్ళనుండి తపియించుచున్న.గానీ
కన్నీళ్ళు కాలువలుకట్టిన గాని నీవై
ఉన్నావు నేటికిని ఊహాల కందకుండెఁ

ఏదూరదూరగమనేంద్రియశక్తిలోనో
ప్రాదుర్భవంబయిన ప్రాకృత నాదమేదో
స్వాదూదయంబభవ! ప్రాథమికానుభూతిఁ
చోదించు సత్యశివసుందరచిత్రణంబుఁ

ఆచిత్రసీమలకునందని చైత్త్రవేలల్
సూచించునాపథము శూన్యత ఆవరించెఁ
ఓచంచలాస్ఫురిత! ఉన్మధితాంతరాళ
ప్రాచుర్యవిద్యుదనుభావము వచ్చుటెట్లో?

ధ్యానప్రకాశునకు తానొక పెద్దనీడౌ
ఈనాయికాహృదయమెంత పరాఙ్ముఖంబో
ఏనాటికీ వెలుగు ఈశ్వర! సుప్రదీప్తిఁ
ప్రాణప్రియాకృతిని వాసకసజ్జయానో

ఆనందమెల్లప్రభు ఆకృతిలేని నీకున్
ఆ నిన్ను నెంచెదము ఆత్మలలేని నిష్ఠన్
ఏనాటిబంధమిది ఏమనుదున్ తలంచన్
మానిప్రభూ! పలుకపాటలు రాపుమాకున్

భావింతుమెల్లప్రభు భావనలేనినిన్నున్
సేవింతుమెల్లప్రభు చేతనమూర్తివంచున్
నీవెవ్వరో తెలియనేరకయున్న మాకున్
ద్యావాపృథివ్యణువులన్నియు ముందునిల్చున్

ఉత్సాహమోహములహో! ననుముంచువేళన్
సత్సంగమన్న భ్రమచాలును చాలు దేవా!
హృత్సాధనాగత పరీక్షలలోన నేనై
చిత్సంపదున్ననిని చిక్కఁగఁబట్టలేనో

సత్వములేని ఒకస్వత్వము నిల్పుకంటెన్
స్వత్వములేని ఒకసత్వము మేలుదేవా!
తత్వమ్మునుంగని యథార్థప్రవృత్తిలోనన్
ధాత్వర్థముల్ పరమతత్పరతన్ గ్రసించున్

ఏనాటినుండి గ్రసియించుచునుండె నన్నున్
ఈనిత్యబాధను మహేశ! భరింపఁజాలన్
ప్రాణప్రయాణ సమయంబిది వచ్చినట్లై
జ్ఞానాగ్ని దగ్ధమగు కర్మకు కర్మబట్టెన్

నానాత్వజన్మ పరిణామ హృదంతరాళం
బీనాటికైన నొకహేతునిబద్ధ మార్గం
బూనంగజాలదు మహోదయ! ఎంతకాల
మీనిష్ఠురత్వము సహించుట పల్కలేవో?

ప్రజ్ఞాపరీక్షిత విధానసకౌతుకంబై
ప్రజ్ఞానమన్ననుడి బ్రహ్మపదార్థమం మన్
ప్రజ్ఞాప్రభావముల వాసవవంద్య! వచ్చెన్
ఆజ్ఞావిధానగతి అర్థముగానిరీతిన్.

నాగంగబోవునో వృషాకపి! ఈయపూర్ణ
ప్రాగల్భ్యమింతటి కరాళకరాలమధ్యన్
ఆగంగలేనిక మహానట! నీకునీవై
నాగుండెచీల్చుము మనస్సుకునచ్చకున్నన్.

అగ్రాహ్యపద్య కవితార్భటి దుర్భరంబై
ఈగ్రంథభాగము మహేశ! రుచింపదేమో
సుగ్రీవునాజ్ఞవలె సూక్తులనుగ్రహింపన్
జాగ్రత్సుషుప్తులకు స్వప్నములడ్డువచ్చున్

ఆ నీలనీల గగనాంతరమేఘమాలా
యానమ్ము కన్నులకు ఆమెతలాచరించెన్
కానీ మహేశ్వర! ఒకానొకవింతవాద
జ్ఞానమ్మదో ముతకసామెతవోలె దోచున్

నీ పాదపద్మములనీడ సురాళివోలెన్
కాపాడుమంచు పడిగాపులుకాయజాలన్
కోపజ్వలత్కుటిలకుంచితవిభ్రమభ్రూ
వ్యాపారమే శరణమయ్యెడుగాక నాకున్

ప్రాతఃపతంగపదపాళిపరీణతంబై
ధ్యాతాగ్నిచేతన శిరోఽగ్రము చేరువేళన్
చేతఃపతంగమిది సీమలుదాటి దేవా!
జ్ఞాతృత్వసంశయముచేత పరిభ్రమించున్

ఏ పాదముల్ జగదధీశ్వర! సర్వవేద
శ్రీపాదముల్ వెలువరించెడి వెల్గురేకల్
ప్రాపంచికప్రణయపారమితమ్ములౌ నీ
ఆపాదముల్ శరణమయ్యెడుగాక నాకున్

సౌజన్యభావసహజమ్మగు మార్గమందే
నాజన్మమెల్ల పరిణామమునందు నేమో
ఈజీవికున్నదొకటే ఒకకోర్కె స్వామీ!
ఈజంతుజాలమెటులెంచుట నిన్నటంచుఁ

మాహామయమ్మొ మరిమాయయొ లోకమెల్లఁ
నీయద్భుతాకృతిమనీషకు అందనిదే
ఆసాంతరంగికమహాపురుషప్రవృత్తిఁ
ధ్యేయమ్మదో యెఱుగనీయవె ఈశ! నాకున్

ఏనీవెలుంగు జగదీశ్వర! చిద్విభూతి
స్థానీయమైనదది స్థాణువుగాదొ దేవా!
కానిమ్ము వజ్రదృఢకాయము కల్పనంబై
కానంగవచ్చెదను ఖండితభక్తి నేనిఁ

వ్యాఘ్రమ్మువోలె పయివచ్చుచునుండె వ్రాయ
మ్మాఘ్రాతమైనదొక అల్పపదమ్మె దేవా!
శీఘ్రమ్ముగానె ననుస్వీకృతిఁజేయకున్నఁ
ఈఘ్రాణరంధ్రములనేలవు ప్రాణవీమల్

కళ్యాణభావపరికల్పితమామకేహా
పల్యంకికా గమనభారము దుర్భరంబై
శల్యావశిష్టమయి సాగుచునున్న దన్నన్
తల్యమ్ముగానిదది దోషమునీదె దేవా!

త్వద్భృత్యభృత్యుడను పాలనసేయుమంచున్
మద్భారమెవ్వరికి మన్నననప్పగింపన్
హృద్భంగభంగిమలహేతువులన్ గ్రహింపన్
సద్భక్తితో అభవ! సాగవనెట్టివేళన్

చిత్రమ్ము చిత్రమిది సృష్టివిచారవేళా
రాత్రిమ్ము చిట్టచివరంగలచిత్రమోహో
సూత్రీకృతమ్మది విశుద్ధపదార్థతత్వ
మ్మాత్రమ్ముతో గనిన అర్థముగాదుస్వామీ!

లోకేశుడెవ్వడని లోకన నాశ్రయింపన్
నాకేశుడొక్కడనునాదము వేదమయ్యెన్
నాకీశుడెవ్వడుకనంబడడట్టివేళన్
సాకల్యసౌరభము సంస్తుతి ఎట్లు దేవా!

కంఠానుషంగము నఖండితకావ్యకంఠో
త్కంఠాభిషంగ మొక కల్పితకావ్యమయ్యెన్
కంఠాగ్రనీలరుచి! ఖండశశాంకమౌళీ!
కంఠీభవచ్చపలకామము గెల్చుటెట్లో?

లుంఠానుభావరసలోచనలోలుపంబై
కుంఠీభవమ్ములగు కోరికలూరకున్నన్
డుంఠీభవ క్త్రిపిత! లోహితనేత్రనీవై
కంఠాగ్రకామములకర్తరవేయరాదో?

బాల్యమ్మునుండి ఒకభంగిని కోరు సన్నున్
తాల్యమ్ము నిత్యము కలంచుచునున్నదీశా!
హాల్యానుబంధమది హాసముతోడ పిల్వన్
నైల్యానుభావమని నమ్మితి మోసపోతిన్

వాగ్ఘ్రాదినీ పరిభవమ్మయినప్పుడైనన్
దృగ్ఘ్రీని చెందదుగదే హృదయమ్ము దేవా!
సఘ్ర స్వనా తలపులోపల వేపవాడి
ప్రాఘ్ఘ్రేష ఒక్కపుడిరమ్మన మాల్లతోచన్

సుప్రోత ఉజ్జ్వలిత శోభన పిచ్ఛలంబై
విస్రంసమా తనువు పోనికి పోవరాదే
ఓ స్రాక్రుక్షాభరసముజ్ఘితవైద్యుతాగ్నీ!
నేస్రగ్వి నయ్యెదను నీ లయమూర్తి చెంతన్

ఈ స్ఫోటవాదముల కేమి జగమ్ములోనన్
విస్ఫారమైన ఒక వెల్గువు నీవె నాకున్
ఈ స్ఫూర్జథుప్రగతి హృద్గతిచేయు నైన
ప్రస్ఫూర్తి చండిమ కపాలము కల్గుగాకన్

ఏ స్థానమం దిచటనే పరికించుచున్నన్
నా స్థూలబుద్ధికి కనంబడ దే వెలుంగున్
అస్థానమానస మహంకృతి నిత్యమాటన్
ప్రస్థానకాలమది వచ్చెనో యేమొ దేవా!

నా బ్రహ్మచర్యమది నైష్ఠికదృక్పథంబై
ఆబ్రహ్మసూజయము నందగ గోరు నీశా!
పై బ్రహ్మరంధ్రమది బ్రద్దలుగాక యున్నన్
ఈ బ్రాహ్మశక్తినొకయించుక నీయరాదే?

ఆ బ్రధ్నమండలమునందలి బ్రధ్నమూర్తిన్
అబ్రమ్ముతోడగను నంతరమెట్టివేళన్
అభ్రాళిమేఖలకు నందని బ్రహ్మలందున్
ఈ బ్రహ్మవాదికను లెంచును నిన్నె దేవా!

షిగ్ధత్వమొందుటకు సిమిటిలేనివృత్తిన్
గాద్గద్యమొందెదను కర్పురధార! ఈశా!
త్వద్గాఢకాయశికవత్సలభావమందణ్
మద్గానవైఖరులు విరాగ్యులైతె నగావే?

ఈక్లేశమేను భరియించుట యెంతకాల
మిక్లాంతిమేను భరియించుట యెన్నిరోజుల్
ఈక్లిష్టభావము సహించుచునుంటె నైత్రీ
వైక్లబ్యమై కరుణ పల్కవె నీకు దేవా!

వల్మీక వర్ధిత తపఃకృశదేహినైనన్
గుల్మస్వభూమపసుస్తము కాదె కోర్కెల్
మేల్మాట ఒకటి భ్రమింపగ జేయునేనీ
కల్మషహాదుమను కానొకొ విశ్వనాధా!

అభ్రాంతరాళ సముదంచిత కాంతిరేఖా
శుభ్రాంశుమండలము శోభలుగుల్కవచ్చున్
విభ్రాంతిభావపరివేల్లితమైన వేళన్
అభ్రేష మేదయిన ఆగిన నెట్లు దేవా!

ధిక్కారభావము మదిన్ గ్రసియించువేళన్
ప్రాక్కన్యదగ్రగతి పట్టదదేమొగానీ
బ్రాక్కంటకావృత పథప్రచలద్విధమ్ముల్
నొక్కించు నొక్క శుభసుందరమూర్తి నీశా!

కష్టమ్ము చెందుటకు కష్టము చెందనెందున్
నష్టమ్ము వచ్చినను నాకొక లెక్క లేదా
కృష్టప్రసన్నతరళీకృతకాంతిపుంజో
త్కృష్ట ప్రభావమది యీశ! రహించునేనిన్

నాకెప్పు డండవా మనస్విజనమ్ము మధ్యఁ
నాకస్ఫురన్మహితనందనమంగళశ్రీ
ప్రాకారయామావతివిలాస విధానమ్ముల్
లోకేశ! నాయెడద లోతులుచూడరావో

ఈ సృష్టియెల్ల వెలయించినరంగనృత్య
ప్రాసంగిక ప్రవిమల ప్రణామానుభావ
వ్యాసంగసుందర పదార్థ విభాగరాసి
క్యాసేదుషీ విభవమందునె నాకు దేవా!

శంపావికాసవికసన్మృదుహాస రేఖా
చాంపేయచంపకవిశంకటగంధమందుఁ
ముంపంగరాదుగద మూర్ఖమతిప్రపంచ
మ్మింపైనతొండచయు మీశ్వర! ధర్మమానో?

సంపద్వ్యామోహులకు సర్వ జనాధికార
మ్మొంపంగ రాదనుచునుంచిరి నీతి పూర్వుల్
కంపించు లోకములు గాఢమదమ్ము చేతఁ
పంపింపరాదొకో భవద్దృశియింత దేవా!

కాలుష్య సౌరభము కర్దమపూర్ణలోక
మ్మేలాసహింపవలె నిచ్ఛకుగిట్టకుండఁ
మేలింతకన్న శ్రుతిమించిన తావకీన
జ్వాలాకరాళ విలసన్నిటలాగ్ని దేవా!

మాద్యత్సహస్రఫణిమండల ఫూత్కృతిగ్రా
సోద్యద్భయాకృతికి ఊహాచలింప డెందున్
విద్యోతమానమతివిస్తృత పంచితాకా
రాద్యన్మగారవములందు కలంగునీశా!

నా గుండెలోపలి ఘనాఘన ఘోరగర్జా
ప్రాగుగ్ర నిగ్రహ పరంతప ఘోషచెంతన్
ఆగంగబోదు ప్రళయాధిప! తావకీన
(శ్రీ)గండ తాండవ మశేషమహోగ్రమైనన్

వేగాతి వేగమిది విశ్వ జిగీషతోడన్
సాగున్ ప్రయాణమిది స్థానమునీడి నేడో
ప్రాగుగ్రవహ్ని పరిభాషితదృగ్విచిత్రా!
నాగారవమ్మునకు నాథతఁజూపరావో?

శిష్యాళి కెవ్వరును చెప్పని గూఢవాక్కుల్
భాష్యమ్ములందు కనవచ్చెను నాకు దేవా!
శ్లిష్యాంగ రాగ పరిశిష్ట విశిష్టరేఖా
పోష్యత్వదంఘ్రియుగమున్ గనలేకపోతిన్

నాకెందుకయ్య! భవనాశన కారణాంతః
ప్రాకార ఖండన పరాక్రమ శూన్య దైన్య
వ్యాకారచింతన చిరాచరణాసమర్థ
స్వీకారపద్ధతివిశేషములెల్ల - దేవా!

ప్రచ్ఛేదనావసర పండితమాన్య మన్యు
స్వేచ్ఛావిహార మొక యింతి సహింపఁజాలన్
మ్లేచ్ఛ స్వభావన మలిమ్లుచ నిష్కుటాంత
స్స్వచ్ఛమ్ము లెన్ని యని త్రుంచెదనో మహేశా!

అల్పాల్పమైన హృదయమ్మిది యెట్టులైనన్
శిల్పమ్మొకందు పరిశీలన చేయుగానీ
నిల్పంగరాదె-ఒక నిష్ఠను విస్ఫురత్సం
కల్పప్రభావమతిగాఢపథమ్మునీశా!

కోశాధికారివలె గుత్తకుకొన్నయట్టుల్
దేశమ్మునెల్ల నొక తృప్తినిజూపవేశా!
నే శాంతికాముఁడనె అయికూడ నేఁడా
వేశమ్ము చెందెను విప్లవ దృష్టితోనే

ఈ కొల్లగొట్టినవి హేతువులేనికీర్తిఁ
లోకమ్ము నింపిన విలోచనలోలుపమ్ము
నాకాధిపప్రముఖనాయకనుత్యపాదా!
శ్రీకంఠ! యీకుటిలకేళుల నాపరాదో

ఈ చక్ర చంక్రమణ మెన్నియుగమ్ములిట్టుల్
నా చిత్తవృత్తులకు నంపక పుష్పదీయుఁ
ఈ చౌర్యభావన పరీక్షలలోన నన్ను
ద్వాచాగ్ర! దోపిడులు పట్టగనీయరాదో

రాపిళ్ళతో నలిగి రాజ్యములే నశించెఁ
కోపమ్ము లించుకయుగూడ శమింపబోవే!
ఓ పర్వతాగ్రశయనోజ్జ్వల దివ్యమూర్తీ!
తాపమ్ము నాపుకొను దార్ఢ్యము నీయరాదే!

వ్యగ్రాక్షులై వెలయువానికి గూడనెందున్
ప్రగ్రాహమూ వ్యధలుపట్టుట తప్పదేమి?
అగ్రాహ్య కంటక భయాకుల వేళనో కా
లగ్రీవ! నీతలపె రక్షయొనర్చు మాకుఁ

ఏయంధకార పటలీరిత ఘోరబాధా
ప్రాయః పటుత్వము కరాళ కరాల మధ్యన్
ధ్యేయస్థితిఁ విడిచి హీనత నొందఁబోనో
ఓ యంధకారి! భవదుగ్రతఁ జూపరాదే

విష్ణుత్వముల్ గెలిసి విశ్రుత రాసలీలా
కృష్ణప్రియానుభవకీర్తులు కోరు లోక
మ్మున్నిష్ఠమైన తపఉన్నతిముందు నిల్వఁగా
జిష్ణుప్రభుల్ చలిత శీర్షులదేమొ దేవా!

ఘోరాతిఘోర రసగాఢ భుజంగలోక
గ్రాహగ్రబంధన విధానము నెంచిచూడన్
కారానివాస పరికల్పిత భావబంధ
ప్రేరీతికన్న వయమే ననిపించు దేవా!

ఆనందవల్లి యయి నానతినీయఁగోటిన్
నానాయకత్వము జనమ్ములు మెచ్చుకున్నన్
ఆసీతనీతి చరణాగ్రములందు నున్నన్
మానంగఁబోవ దభిమానత్వము విశ్వనాథా!

ఊహావకాశముల కున్నతిగల్గు వోటన్
వ్యూహాధికారములు ముంగలమోసులెత్తున్
ఈ హంతలంపరకు నించుకయేని బుద్ధి
స్నేహమ్ము కల్గగా వశీకృతశక్తి! నాధా!

నాయంతవా డిల వినంబడడంచు నేమో
ఈ యింద్రజాలికున కెంతటిగర్వ మారా!
కాయమ్ములో వెలుగు గల్గిననేనున్నాయు
న్నాయుప్రసారముల శర్వ! నటింపఁబోనో

కార్పణ్య మెవ్వరికి కాదగదన్న నాకుఁ
మార్పించుకంతియును మాధవ! రాదదేమి!
తూర్పారబట్టితిని దోషగుణమ్ము లెల్లఁ
నేర్పించుకంతయును నిల్పదు విశ్వనాథా!

కర్పూరవాటికలు కావ్యములల్లి నీకై
అర్పించుకొంటిని శివా! భవదంఘ్రిపీఠిన్
దర్పజ్వలత్ పవనదార్ఢ్యము నిత్రుపాస
మ్మేర్పాటుచేయఁబడె నిప్పుడు విశ్వనాథా!

యాగమ్ములన్ సలుప యంత్రబలమ్ముతోడన్
ప్రాగన్ను పెట్ట నిక మంత్రపథమ్ములందున్
చేఁగల్లు నంతకును చేసిన దంతో యింతో
ఆగమ్మె – నీ క్షమకు అర్హత లేదో స్వామీ?

అక్షీణకారుణికహాస విలాసభాస
మ్మక్షయ్యమైన భవదద్భుతమూర్తి యంచున్
వీక్షించుదాకను పరీక్షను చేయుదాకన్
నక్షత్రదీప్త శశినాయక! నమ్మఁజాలన్

లక్షింపఁబోవనిక లక్షలు కోట్లు నాపై
శిక్షాస్మృతుల్ వెలయఁ జేయఁగవచ్చు నీవై
కక్షల్ లయించిన ఒకానొక కాంతికక్ష్యా
విక్షేపణమ్ము నొదవించెద దేవ! నేనై

రక్షించువాడవు పురాతనమూర్తివంచున్
నేక్షాంతిఁ జెందితిని నిక్కముపల్కు నీశా!
నీ క్షత్రధర్మమిటు నిష్ఠితమంచెరుంగన్
దీక్షావిధానములు దీర్తునె భోగిభూషా!

ఆశ్చర్యభావముల కంతరముంచవేనీ
దుశ్చర్యలన్ తొలఁగఁద్రోయక యుందువేనీ!
నిశ్చింత నిప్పటికి నిల్తువయేని స్వామీ!
పశ్చాత్పదమ్ములకు బాధ్యతనీదె యందున్

కుక్షింభరిత్వమునకుఁ నెలవైన పీఠా
నిక్షేపముల్ నిలుప నేరనుగాని నీకై
పక్షీంద్రవాహనుఁడు పట్టగలేని దీక్షా
రక్షః ప్రియత్వము పరాత్పర! నే గ్రహింతున్

నైశ్చల్య భావనము నాకది లేక కాదా?
స్వాశ్చాలనోదయ భవత్కృతి కోరుచుంటిన్
ఆశ్చర్య పాశ్చిమ మహత్త్వము కోసమా! ప్రా
యశ్చిత్త మియ్యది మహానట! తెల్పరాదో!

కశ్చిద్విధానుడవు కావొకో? అప్రధానా
హాశ్చాలనుండవయి ఆర్తినిదీర్చు ద్రాఘీ
యశ్చర్యణాకృతిని అందక నిల్చినన్ తే
జశ్చక్రవిభ్రమనిషణ్ణ! విషణ్ణదూరా!

అన్యోన్య మాశ్రయమునంది పదార్థశాస్త్రి
ధ్వాన్యమ్ముగాక మరి తప్పని భావరీతుల్
శూన్యమ్ము మేధ ఒక సూక్తియు లేనిచోటన్
కన్యాకుమారికొరకై పరువెత్తు దేవా!

అధ్వమ్ములోనగల ఆర్తుడెవండుగానీ
ప్రధ్వంస భావమును పట్టకపోడు నీకై
ఈధ్వాంత సంవృత నిరీక్షణ శత్రుమధ్య
మధ్వాన్నమైనటులనయ్యెగదో మహేశా!

ఈప్రాగభావమగు హేతువులేని కావ్య
మ్మే ప్రాణశక్తికి సహింపగ శక్యమౌనో
సుప్రాభవప్రథితశోభలమధ్య నేదో
అప్రాకృతమ్మయిన అందముతోచు దేవా!

చిత్రాతిశోభగల చాలన సూన్వరాగ
మ్మైత్రాయటంచును మహేశ్వర! నిన్ వలంచున్
గత్రాతి మాలికొంకై తపియింపనీవన్
ప్రేశేగదేమి? రస విస్మృతి విశ్వనాథా!

ఖండీభవ చ్చటుల కామసపాగ్ని కీలా
దండమ్ము దైహికము ధారణచేత నిల్చున్
నిండన్ మునింగిన మనీషికి శీతమంతై
ఉండంగబోవునొకొ? ఓర్మిని పల్కుమీశా!

చండేశునా! పదము నాగదిదేమి? నేను
ద్దండత్వదస్త్రపరితః పరిణాహతీవ్రా
ఖండ ప్రభావ సుముఖప్రథనప్రకుప్యత్
తుండీశ నిర్మలిన దోర్వృతి భక్తియున్నన్

నా నేత్రముల్ తెరచినన్ మరి మూసికొన్నన్
కానంబడున్ ప్రణయకల్పితరమ్యలీలా
ధ్యానప్రసన్న పరమాణు మహత్వహేలా
ప్రాణ ప్రయాణములు – పర్వత శృంగశైవా!

నాణేయ ఉల్లసనమైన మహత్వ నృత్య
న్మాణిక్య సంపదలుమాధవ! వద్దటన్నన్
గాణిక్య వైభవము కల్పనజేతువేలా?
చాణక్య తంత్రములు చర్విత చర్వణమ్ముల్

ఈ మోసమింక గ్రహియించితిమో మహేశా!
ఈ మాయయింక గ్రసియింపదుమమ్ము స్వామీ!
మీ మత్తుమాటలకు మేమిక లొంగబోమో
ప్రేమాంతరాళపదవీప్రభవిష్ణుతత్వా!

ఆస్యస్ఫురత్తప ఉదగ్ర నిరీక్షణాళీ
లాస్యాగ్ర శంభళీ! భళాభళి చాలునో హో!
హాస్యప్రసారములు వ్యంగ్యగవేషణమ్ముల్
వస్యంబుగా వెలుగుదారుల నాపకమ్మా!

ఆశైలరాజతనయాపరిగూహన (శ్రీ)
కేశాగ్రపీడన వికీర్ణవిభూషణాంతః
పాశాభిఘూర్ణన విధావనకామకేళీ
క్లేశమ్ము నే నెరుగలేనోకా! శూలధారీ!

హాసప్రసాదములనందని దక్షిణాస్య
వ్యాసంగరూక్షమహా ఆదరవృత్తిలోనన్
రాసిక్యమన్నది పరాజితమైనదింకన్
ఆసక్తిమాకునిటలాంబకమందె దేవా!

ఈశిత్వమిచ్చుటకు నిష్టములేనివేళన్
నీశాంతిపారములు నేను గ్రహించినాడన్
ద్యోశాంకరీగణము యోగినులేగుదేరన్
నీశక్తికర్షణమునిచ్చెనె నాకు స్వామీ!

కాబోలు నెవ్వడధికారము లేనిధర్మ
ప్రాబల్యపారములపై ఖరినొప్పువాడై
గాబోపువాడొకడు రాక్షసుడైన వేళన్
(శ్రీ) పైటలాగ నెదిరింపడొకండు దేవా!

తానై యెదిర్చినను తప్పదు లొంగకుండన్
జ్ఞానప్రధానమగు సాధన శూన్యమాటన్
గానింపుకై పనికిరాని ఫలమ్ముకోస
మ్మె నింపుప్రాణి బలియిచ్చును దేహమీశా!

మానావమానములు మానవుడైన వానిన్
ఏనాటికేని ఒకయించుక బాధలోనఁ
మ్రాన్పైన ఉంమననిమానసబోధపల్కుఁ
సూనాస్త్రపైఁ! అది నూతనమైననేనో?

భావమ్ములోన నలవాటగునేని దుఃఖ
మ్మెవంక జెప్పినను నెవ్వరు నవ్వరీశా!
దేవాధికారము నదృష్టమునందుఁ బల్కన్
నా వైపరీత్యగతి నాకునె నవ్వువచ్చున్

కార్యప్రచార మవకాశము గల్గియున్నన్
మర్యాదదీయు నసమర్థత నొక్కవేళన్
స్వార్యోగమా మహితశక్తి లభించునేనిఁ
శౌర్యత్కృతి స్థితికి సిద్ధుడ నేను దేవా!

ఏడ్వంగవచ్చు నెటులేనియు కావ్యమందుఁ
ఊడ్వంగవచ్చు భవముండిన దానితోడఁ
ఈడ్వంగవచ్చు బ్రతుకెట్టులనేనిగానీ
మాడ్వంగఁగూడ దభిమాన మొకింతస్వామీ!

ప్రత్యగ్ర పింగళ కపర్ద కలాపమందుఁ
నృత్యమ్ముసేయు నొకయించుక రాగరేఖల్
స్తుత్యప్రభావ పరిశోభిత గాంగవీచీ
ప్రత్యంత వైభవము పట్టదా నీకు స్వామీ!

గత్యంతరమ్మరయఁగా దగనట్టిరీతిన్
అత్యంతకష్టమగు ఆప్తుల క్లేశవృత్తిఁ
మత్యద్భుతంబభవ! మామకమార్గమందున్
నిత్యమ్ముగా నొకటినిల్చె దిదృక్ష-దేవా!

విశ్వాసముల్ విసిగి వేసరుదాక అశ్వ
ప్రశ్వాసముల్ పరుగుపందెము గెల్చుదాకన్
ఆశ్వాసమందు తుదియయ్యెడుదాక నీవో
విశ్వప్రభూ! హృదయవేగము నిల్పఁబోవో?

వేగాతివేగమున వీడిన బాణమట్టుల్
సాగుఁ మహోజ్జ్వల కళాధుని నామెడందన్
స్రాగుగ్రమై ప్రణయసాగరమందు నేనిన్
నా గుండె ఆగక మనంగలదో మహేశా!

ఏ వాక్కుచిత్రమగు నేర్పరివంచు లోక
మ్మావిష్కరించినది అద్భుతకావ్య మొక్కం
డో విశ్వనాథ! కవులుండిరి లక్ష కోటుల్
ఏవాడుఁ దెలియఁడించుక సత్యమైనఁ—

శ్రీఘంటికారవము చెప్పాలప్రమోతవోలెన్
వ్యాఘట్టితాంతర భవద్గమనమ్ముతోచున్
ఈ ఘోరమాతపము నెంచగవత్తువొక్కొ— ?
శ్లాఘావిదూర శశిలాంఛన చక్రవర్తీ!

అతిమనోహర భువనమోహనవిలాస
శాంతి కాంతి ప్రశాంత విశ్రాంతవిమల
రాగరంజనాభోగానురాగ భోగ
మైన నీ వెల్గు నీశ! నే నాశ్రయింతు—

ఎచట కనుపడవణుమాత్రమేని దేవ!
కంటక కరాళకర్కశక్రకచకోణ
బర్బరార్బుద కర్బురకర్బురమ్ము
లట్టి నీ నివాసమ్ము నే నాశ్రయింతు—

ఏ స్థలంబున వెలుగొందు స్వస్థచిత్త
కర్క కర్కట కర్కరా కర్కశత్వ
సంతత ప్రతిబింబితా సదృశదృశ్య
ముద్రలో దేవ! అట్టి నీ భూమినెంతు

ఏ విశాలాంగణంబున లేవు దేవ!
తుచ్ఛభయద రాగద్వేషతోదనాంక
కటకనటనస్ఫులింగకంకాళచయము
లట్టి నీ భావసౌందర్యమాశ్రయింతు

ఏ ప్రదేశంబు లో పుట్టు నీశ! స్వచ్ఛ
మహిత పీయూష మధుపానమత్త మత్త
కాశినీ జనాశ్లేష ధిక్కరణమాన
సప్రమథదీక్ష అట్టి నీశక్తి నెంతు

అమృతమయమైన ఏ భూమియందు దేవ!
వినబడుచునుండు వేదనిస్వననిఘోష
శాంతిసౌభాగ్యసౌందర్యశక్తిపూజ
అట్టి నీ నివాసపదమ్ము నాశ్రయింతు

ఏ మహాస్థలి కలరు సుధామయాత్మ!
శాంతికాముకుల్ భక్తులు సత్య నిత్య
పాలన వ్రతదీక్షానిబద్ధశుద్ధ
సిద్ధకంకణులట్టి నీ స్థితిఁదలంతు

ఏ గురు(శ్రీ)ప్రదేశంబు స్వాగతంబో
సంగును తుషారవీచికాసంగ కుసుమ
మాధవకుమార సుకుమార మహితగతుల
అట్టి నీ సీమవైభవం బభవ! తలతు——

నీవు వెలసిన సీమలో నిలువఁబోదె
కామధేనులచేత నిష్కామబుద్ధి
నీవు శివ! నిల్చు నేలలో నెగడఁబోదె
కల్పవృక్షాల చేతసంకల్పసిద్ధి

అచట నీనులవిందుగా నలరవాక్కొ
కంజపత్రి నేత్రానంద క్రమసక్రమ
కటకకంకణ కింకిణీ క్వాణనగాగ
తాళగతులీశ! ప్రేమనై తాళికములు

లుప్తకరుణాల కింద్రియములోల దుష్ట
జీవనులకు సునిర్మల భావనులకు
చేసుకొన సాధ్యమేగాని సీమ నీది
అభవ! ఒకభక్తియున్న మేముందుకొనమె?

ఆ సుహృత్కామ ప్రణయ రామాభిరామ
మంజులానందసీమ – సంపల్లలామ
ప్రణవరవ వైభవోదయారామ – మేము
చేరగా నీవె దేవ! ఆశీర్వదించి

కర్కశ క్రూర హింసాజగమ్మునందు
పాడుపెద్దమ్మ పెద్ద సైదోడుగాగ
కలిమహారాజు కాలికిగజ్జెగట్టె
నాథ! ఆపంగలేవె? యీ నర్తనములు

కంటక కరాళకాలమార్గమ్మునందు
పశువులనుదీయు నాకాలపురుషరథపు
గౌరవములక్రింద నరులు నెత్తురులుగ్రక్కి
నలుగుచున్నారు రక్షింపవలె మహేశ!

పాలితులవైపు చూడని పాలకులను
మేలుకొలుపంగజాలక మూలబడుచు
బూజుపట్టిన ధర్మపురోజు లీశ!
ప్రజలకన్నీరు తుడువగారాదె నీవు

లాలితమ్మైన లోకపాలనమునందు
అమృతములు చిందువందు కాలముగతించె
విశ్వమునుమ్రింగు. నధికారవేదనలకు
నెలవు నరుడయ్యె దేవ! యెట్టులు శుభమ్ము—

ఒక్క దుర్ముహూర్తమ్మునందుదయమైన
కడుపుకోతలు పెట్టెడు కఠినరవము
కాలవశమున కరుణాలవాలమగుచు
గుండెలన్ జీల్చుకొని వచ్చుచుండె నేడు

ప్రకృతి ఒక దుష్టభావనాపరివృతమ్ము
భావమొక దీనవేదనాపరిభవమ్ము
మానవుడు భావదారిద్ర్యమూనె నేడు
కలుగదే! ఒక్క నూత్నసంక్రాంతి దేవ!

చారచక్షువులైన రాజన్యవరులు
ధర్మభక్షకులైన గత్యంతరమ్ము
వెలయ గలదొక్కొ? ఒకభావవిప్లవమ్ము
వలయునని నాదుభావన పలుకు దేవ!

పలికి ఫలమేమి? తలచిన కలుగునేమి?
ఒక్క వెలుగందుకోలేని ఉద్యమములు
వేలు లక్షలు వచ్చుటయేల? స్వామి!
నీ కరుణ కల్గఁబోదొకో నీలకంఠ!

జీవితములెల్ల చీకటి చింతలందు
వంతపాటలు అతుకుల బొంతలయ్యె
కావలసినట్టి దేదియు కానుపడదు
సుప్తిలోనైన తృప్తినిజూడ మీశ!

పలుకునదొకండు పలికించువాడొకండు
పలుకుపలుకులలోని భావమ్మొకండు
భిన్నముగదోచు దేవ! కన్పింపఁబోదు
వీని కేకత్వమొకటి విన్పింపఁబోదు

ఎన్ని చదివితి నేర్చితి నెన్నివిద్య
లెందరు మహానుభావుల మందిరముల
చేరిశుశ్రూషఁజేసితి చివర దేవ!
ఉన్న దేమన్న సందేహమొకటి మిగిలె

చిత్రసౌదామినీ ప్రేమసీమలోలసి
ఈశ! విద్యాధరీ ప్రణయేక్షణములు
వరశివాలాస్య శివతాండవముల కాంతి
వలయముల క్రాంతి నింటింట వెలయుగాక

ఆనందసౌందర్యరేఖలహారహామున్ నాదు తనువు
మానసమును వీడఁబోవు మాధుర్యమాధుర్యకాంతి
ధ్యానవేళలయందు తోప నదియె నీవనుకొంచునుందు
ఆనతశృంగారసౌధ! ఆనందవల్లీ సనాధ!

ఒక చూపులో పద్మసమితి నుల్లాసపగచెడి కాంతి
ఒక చూపులో కైరవముల కుద్రేకమిచ్చెడు క్రాంతి
ఒక చూపులో నాకుమాత్ర ముత్సాహమిచ్చెడు స్ఫూర్తి
ప్రకటనిటాలనటత్ప్రభాభీకరాగ్నేయమూర్తి!

నేను వాంఛింపను నిత్యనిర్మలచంద్రచంద్రికలు
నేను కాంక్షింపను నిభృతసర్మాదిసకథానికలు
నేను కోరనదొక్కటే మనీషావిశేషవిభూతి
పైనున్న వెలుగు ప్రజ్ఞానపారమితప్రజ్ఞ! శర్వ!

నినుదలంచుచునున్న వేళ నీవుగాకుండ నేనొకటి
మనసునదోచిన దాని మాయించు సాధ్యతనీవి
పనివిన్న దీమాత్రమైన భారము నీవ్వానవేని
ఘనత యేమున్నది నీకు కళ్యాణదాయి! మహేశ!

సకల విశ్వమ్ములు సకల జంతువుల్ నశియించిపోవ
ఒక ప్రాణియును లేక భూమియును గగనమ్ము నొక్కటిగ
నికటమందెవ్వడున్ లేని నిశ్చలవేళలో నీవు
ప్రకటతాండవమును జేయుభంగి నెంచెద నటరాజ!

చీకటులకుమధ్య చిమచిటుకన్న విన్పించువేళ
ప్రాకటమైన ప్రశాంతి బ్రహ్మాండముల్ గ్రమ్ము వేళ
తోకచుక్కలువోని చూపుదొంతరల్ నవ్వుచునుండ
లోకేశ! దాని యర్థము నెఱుంగము జనులము మేము!

నలుగురిలోన నున్నపుడు నాకు క్రోధమ్మది కొంచు
విలసితవిజ్ఞానపథము వికృతనిశ్వాసముల్ విడుచు
కలకల నవ్వవలసిన కమ్మని తావులలోన
బలముగ్గబట్టుకొంబోవు పారమార్థికతత్త్వనాథ!

క్రోధముచే ఘోరతపముకూర్చగవచ్చునంచెరిగి
మాధవప్రియ! నీ అనంతమహిమాంబరము నెక్కగోరి
సాధము పేకముక్కలను చకచకకట్టుచునుంటి
నోధనంజయనేత్ర! శివ! మహోదయదర్శన ప్రకృతి!

ఒక్కటి ముందుకులాగు ఒక్కటి వెన్కకులాగు
చక్కని భావములాగు చప్పని భావములాగు
ఎక్కడికో ఎందులకునొ ఈ మహాప్రస్థానమనుచు
ప్రక్కవారడిగినగాని పలుకలేనొ దేవ! చనుచు

మురళీమనోహరమైన ముగ్ధవీక్షణములుజూచి
తరళీకృతమ్మయ్యె నాదుతనువు మానస మొక్కనీచి
వికళీకృతముగాదు బాధ వేగప్రయాణ నిరీక్ష
సరళీవిశూన్య! ఎప్పటికి చల్లారు? అగ్నిపరీక్ష

చిన్నతనముచేత వలపు చెడనేమొ అనుకొంటిగాని
చిన్న ఊహలలోన పరవశీకృతమైన దీప్రాణి
ఎన్నిరోజులు నెలలింక నేండ్లు దాటుచున్నగాని
మున్నలనాటిది మరవంబోలేను శివ! ఒకింతేని

మానవతయటంచు పెద్దమాటలు చెప్పెడివారె
దానవతవహించెదరు యథార్థము పరికించిచూడ
ఏనాడుధనమ్ముపై నింతయేనియు నాశలేకున్న
జ్ఞాని భూమండలమందు సహజముగానున్నె ఈశ!

తాముచేసెడి కార్యమొకటి తప్పుగానిది లేదటంచు
భ్రామికులైన పండితులు సంకటపడియేని చెప్ప
ప్రేమయుగాని గౌరవపరీణతపరిణతిగాని
ఏమాత్రమైనను చూపరిదియెక్కడిజగమ్ము స్వామి!

ప్రజ్ఞానమున్నిమిషితులు ప్రభావనకౌతుకమతులు
విజ్ఞానవిన్యాసవిభవ వేల్లితులుద్దండులైన
ప్రాజ్ఞులెందరో నీదు తత్వభవ మెరుంగగగోరికోరి
అజ్ఞానమందు మునిగిరి అంతులేరింతయు దేవ!

సున్నమ్ము రాసుకొన్నపడి చుక్కాని వెన్నెలలోన
తిన్నన్నమే అరుగదొకధృష్టునకు నికృష్టగతికి
ఉన్నదియెన్నాళ్ళో మరికఉండఁబోవునదెన్నివాళ్ళో
ఇన్నరుడెరుగక నావనెక్కిపోవు జలధి నీశ!

పొగబండిలోపలనుండ ప్రొద్దెటులోపోవవచ్చు
అగణితహాస్యప్రపంచ మందుబాటుగనుండవచ్చు
పగలేనివారలగుండెబరువు తూకము వేయవచ్చు
అగజాహృదయనిరంతరవిహార! ఆనందము లేదు

దిక్కుదివాణము లేని ధిక్కృతజీవుల దెచ్చి
ప్రక్కఁజేర్చుకొనిన లోకభంగియు లోభభంగియును
నెక్కొని మెచ్చగఁబోవు నిర్మాణకార్యక్రమముల
ఒక్కటుర్క ప్రథమమునందె యొప్పుకొనదుగదా! దేవ!

తలకాయలేమిచే చీమతలకాయయంత సుఖమ్ము
గలిగిన నయ్యదియే అఖండచిదానందమనుచు
పలికి ఒకరికొకరట్లు భావింపఁగాఁజేసికొనుచు
నిలుపుకొందురు గౌరవమ్ము నిత్యసమాధిప్రరూఢ!

వచ్చులాభము లేదు పోవుభాగమించుకయును లేదు
తెచ్చుకొన్న బెడద పలికితీరవలె ననుభవమున
గ్రుచ్చిగ్రుచ్చి అడిగినంత క్రొత్తదేమియుగానిరాదు
అచ్చముగా ధర్మమైన దాచరణకువలె నీశ!

చచ్చి యెక్కడనున్నవాడొ స్వర్గమ్ములోపలనొకడు
మెచ్చగాగలిగినవాడు మృదుతరభావనాప్రసృతి
కచ్చెబట్టి బ్రతికి బట్టకట్టిన కానుపులెల్ల
నచ్చబోవు సమస్తధర్మనాథ! ఆధిక్యమునీది

జీర్ణమయ్యెను నేను వికృతసిద్ధాంతములతోడ తనువు
కర్ణములకు ప్రక్కనిలిచె కంటికిగిట్టని చనువు
అర్ణోనిధికి అడ్డుకట్ట నావృత్తి చేయగానెంచి
శీర్ణముగాఁ జేసికొంటి చెలువమునంతయు నీశ!

ధర్మాధికారముతోడ తత్త్వాధికారము తోడ
కర్మాధికృతి సంక్రమింపఁగల్గునె యను సందియమ్ము
నర్మగర్భమ్ముగా నిన్నినాళ్ళను నాదాకరాక
మర్మముగానుండె నేను మంచు తెరవిడియె స్వామి!

జర్జరమైన సంధులివి చక్కగా అతుకుకోగలవా
మార్జాలనేత్రములట్లు మంచిపగటి వెల్గునవా
దుర్జయ దుర్వారధూర్తదుర్భర ప్రకృతులమధ్య
గర్జించుచుంటి లోకమ్ముకనుగొనునో లేదా దేవ!

ఒకభావమునకు నింకమరియొక్క విభావమ్మునకును
ఒకయింతసంబంధమున్న ఉక్తిని పునరుక్తియనుట
నికరముగా నిగ్గుదేల్చు నిష్ణాతులుండినగాని
సకలమునొప్పుకోరాదు చంద్రమశ్శేఖర! శూలి!

వికృతానువాదములైన వెన్నెన్నొ చెప్పలేనన్ని
ప్రకటిత భవదీయతత్త్వ పటుతర ఫక్కికివచ్చె
ఒకటియేనియును సంతృప్తినొసగజాలవు నూత్నభాష్య
చకితముగా లోకమెల్లసలుపవలె పినాకపాణి !

పురుషకారమునకు లోకమున ప్రధానతకొందరిచ్చి
అరయవచ్చు ననంతమామహాత్మ్యవైభవమును దీక్ష
కరము దాల్చునయేనియును చ కడునమ్మకమున పల్కెదరు
పరవాససంకల్పమొకటి భవ! మమ్ము భావించునందు

స్వాతంత్ర్యమొక్కింత మనుజజన్మకుగల్గఁగవచ్చు
ఏతద్విభాగమునందు నెన్నాళు నేర్పఁజూపెంగ
నీతమ్మపూర్వానుభవము నిక్కమ్ముగా నెంచనేనో
ఆతతభ్రుకుటీమహాగ్నిహోత్రభావభవ! మహాదేవ!

ఈయసంఖ్యాకజీవములనేది నాసత్యాకాంక్షవత
కై యున్నదో యెంచగల్గుచుశక్తి నిచ్చితివేని
ఆయభావ్యప్రభావమ్ము నరసికొని అనంతరమున
నీయదినీకెయిచ్చెదను నేనుంచుకోనులే దేవ!

అక్కరకున్ రాని చుట్టమందునోనిను జగద్బంధు
మ్రొక్కినవరమీనివేలుపువనుచు నిందించెదనొకో
ఒక్కడుగూడ నందుకొననూహింపగాలేనివాని
దిక్కులనిండినవాని దీనశరణ్యునిన్నీశ!

అన్నియు త్రొక్కివిడిచినయట్టిదాపులెగాని క్రొత్త
విన్నాణమూరీతి ఒకటివినిపింపదనుచును గాథ
నున్నాడనో లేక ఊహాయూహింపగాలేని నిన్న
తిన్నగాచూడవచ్చు గడిదేరినస్వప్నమో! స్వామి!

కాలిపోయెడి నొకప్రక్క కవివరేణ్యుని పూరిగుడిసె
తూలిపోయెడిమేనులోన తూగాడు నొక్కపై చిత్రి
ఏలా సుతీక్ష్ణ మీహేతువెరుగని కోపభారమ్ము
ఫాలికల్ జ్వాలికలయ్యె ఫాలాగ్రగతవహ్నినేత్ర!

సృష్టిసిద్ధాంతములందు చేతులుపెట్టినమాత్ర
నష్టమ్మవునది యెవరు! నరులె–అధర్మసంకరులె
దృష్టిముందరనిల్చు ప్రణయదీపిక నటులార్పివేసి
కష్టముజెందెదమనిన కాదనువాడెవఁ డీశ!

ఒకపదిరెండువర్షమ్ములో స్పృక్కోలేక మానవుఁడు
వికృతాకృతులుచెందు వింతవిశ్వము నవ్వుచునుండ
చరితచైతన్యధన్యప్రసన్నసన్నాహమ్ము చేసి
మకుటమ్ములేనిరాజులకు మత్తతనిత్తువా స్వామి!

మందుమ్రింగినవానివోలె మధురిమ సర్వమువీడి
పందపాలిక నేగుచుండె భారతయుద్ధము విడిచి
ఎందు తెచ్చిన విషమ్మెట్టులెక్కించిరోగాని జనులు
వందిమాగధులైన వారిపాపము! నమ్ముచానీశ!

ఉత్తపుణ్యాపకేవచ్చి ఒక్కఁడు సలహాలనిచ్చి
మెత్తగానూహింపఁజేయు మేదినియందు నహమ్ము
ఎత్తినదుర్మదస్థితిని ఎటుల పోగొట్టుట యనుచు
నెత్తినోరునుగొట్టుకొనిన నేమిఫలము తుద నీశ!

దుర్గాంతరాలా వారిప్రకృతితో యధులెల్ల నింకించి
సర్దుకొని యనుగఁజూచు శాక్తేయుడవో నీవు పాప
మర్దనంబొనరించు లోకమాన్యుడవని నమ్మికొలుతు
మర్దనగుణానాధికార! హర! విరూపాక్ష! లోకేశ!

కాలకాలుడవైన నిన్ను కత్తిబట్టి యెదుర్ప నెంచి
ఏలాయటంచును మరలనేగెద నిష్కారవాల
కేళీవిలాసవాగ్వినుతికేంద్రీకరించి ధైర్యమున
వ్యాళోగ్రఫూత్కృతిప్రకటితానన్యభూష! మహేశ!

నీ నిటలాక్షిమధ్యమున నిష్ఠితమౌ అగ్నిఁజూచి
ఆ నీతులైన శాత్రవులనందరు బెదరగవచ్చు
కానీ చలింపరుసుమ్ము గాఢభక్తిక్లిష్టమతులు
మానితమధ్యాహ్నభానుమండలమూర్తివిశేష!

ఘోరాతిఘోరమాతపము గూర్చిఁ చేగాని నీవు
వేరావు భక్తులను పదవిపరిపక్తులఁజేయ
వీరవ్రతము మెచ్చినట్లు విశ్వపాలనకరమైన
కారుణికత మెచ్చవేమి? కారుణికత్వవారిమ్య!

నావ్రాతయెట్లున్న నట్లె నాథ శివా! అగుగాక
ఈవ్రాత్యవాదాని నేను నేనియు నెఱవార్చమందు
సువ్రీహిభరిత కేదారశోభ నక్కలపాలుజేసి
తీవ్రత చెందిన నేమి తెలివియంచుసరె? విశ్వేశ!

ఎండకు వానకునోర్చి చండాగ్నిమధ్యమ్మునందు
నుండిన నుండఁగవచ్చు నుగ్రత్వమువహింపవచ్చు
పండువెన్నెలవోలె నెలది వన్నెలచిన్నెలనలరు
కొండంతదేవర నిన్నుకోరివర్జించుటెట్లు భవ!

నందీశుడాదిగా నిన్నసంత నైరంతర్యదీక్ష
కందించుకయు లేని భక్తికల్పకల్పాంతాలనుండి
స్పందించుచున్న భావముల నందించుచున్నవారలై
ఎందు లేని విచిత్రము ఫలమేమియుఁగోరరో? ఈశ!

చుక్కతెగిపడినయట్లు సుందరీహృదయకారిన్య
ధిక్కారములలోని పలుకు తేకున తెగువమీరినది
ఇక్కుటిలేక్షణాల ప్రణయేప్సిత శిక్షణాలనను
చిక్కలేదాయేమి? స్నిగ్ధశీధువచోలగ్నహృదయ!

సూచీవిభేద్యముగాని శుద్ధాంతతమములయందు
వాచంయములు పల్కిపల్కి వదలివేసిననిన్ను నేను
నాచరింపగనెంతు నొక్క అంజలిబద్ధసద్వినుతి
రోచిర్మయునిగా అనూహ్యరూక్షతేజస్కుగా నీశ!

కక్షనుకట్టగలేదు కడకునిన్ సాధింతునననెడి
అక్షయనాదీశుయేని అలరదింతకు నీవొసగిన
పక్షపాతాకరసృష్టిపాతవిశేషమట్టిదిగ
శిక్షించెనన్ను నాచూపుచెప్పదె అద్దాని నీశ!

తలపులోతలచినవాని తరలించెడి పలుకులోన
నిలుపుకొంటిని ఒకానొక వినిర్మలశైశిరజ్యోత్స్న
కలనై సదానినిమార్చగా నవసరమగుననుచు
తలపలేదీనాటివరకు దైవాధినా! అదివచ్చె

ఏకమ్ములోహితశుక్లకృష్ణమ్ముజాకరమనుచు
ఏకావ్యపారకుడెపుడో ఎందుకో ఒకసారియనగ
నాకొక్కడెరుపును తెలుపు నలుపు రంగులనొప్పు పొడల
మేకయయ్యెది యనెదేన! మేదిని చదువులట్లయ్యె

రకరకములు ప్రపంచపు తెరంగులు నాకంటిముందు
నకనకలాడు నాకడుపునకు నింతఆహారమట్లు
ప్రకటితమునయి అపారభావాంబరాకృష్టిగావించె
అకుటిలశృంగారబోధ! ఆనందవల్లీసనాథ!

అష్టకష్టములు పడిన అనంతరమైననుగాని
దృష్టిధర్మమ్ముపై పోవదేమి యీనరజాతికెపుడు
దిష్టమ్మనుచుచర్చలందు దేవుని వెదకునుగాని
సృష్టింపరావో తీవ్రమగు చింతనజ్వాలల నీశ!

బ్రహ్మాండమంతయుగూడ బద్ధలైనట్టులు దోచి
జిహ్మాధ్వములనైపు మనసుచిక్కనించుకమధ్యమధ్య
బ్రాహ్మీభవత్తనువులను వజ్రపాతోజ్జ్వలశక్తి
బ్రహ్మాదిపూజితపాదపంకజ! సంతరింపంగదె.

తారుణ్యసౌందర్యమధురతామధురతరయౌవనమ్ము
కారుణ్యకల్యాణ పరమగాఢనిగూఢజనము
ఆరణ్యసంస్కృతిపూతిపవిత్రతాపవిత్ర్యమునగు
తారాపతిస్ఫురదమలకాంతి! సత్యమునీవె చూడు

చాంచల్యమొక్కటి ఘనవిషాదయోగమాలికల
వంచింపబూనును హృదయవాటిక చాంచల్యమొకటి
కొంచెమాధారముఁజేసికొని అపారవ్యాప్తకాంతి
కాంచికారవణ శైలేంద్ర కన్యకాహృదయమున మాన!

ప్రాచ్యపండితమహాశయులు పాశ్చాత్యవిద్వాంసులును
సూచ్యమ్మనుచు దీనిగూర్చి శోధనలెన్నెన్నొ చేసి
వాచ్యమ్ముగానిదీ దివ్యభావప్రభావమ్మటంచు
నైచ్యశోచ్యాతిగతత్త్వనతిఁగనిరిదినీవె దేవ!

ఆప్యాయముగ చెవిలోందు అలదేశికుండేదిపలికె
గోప్యమ్ముగా నదిమెప్పుసఁ గూర్చుకోవలయునుగాదె
ప్రాప్యమ్మయిన ఆఅనన్యభాగ్యనీగౌరవమూర్తి
జాప్యమ్ముచేయక ప్రజసల్పుట మెచ్చవే ఈశ!

కట్టలపైన కట్టలుగ కట్టిన కావ్యమ్ములందు
నెట్టుకొనికొలుచు సుకవినిర్మాణ కర్మలయందు
ముట్టంగబోవె? ఒక్కటిని ముగ్ధభక్తిభ్రాంతిలేక
నట్టేటకల్పెదవె శివ! నావంటివారలబ్రతుకు

అట్టిముగ్ధభక్తియో నిర్వాదమలమా జ్ఞానమా లేదు
చిటపటచినుకులుపడిన చెమ్మయంచిలజేరి యవల
తటపటంగొట్టుకొని తనదైన జీవముకొరకెంతో
కటకటపడెను చేపవలె కాలకంఠా! ఉంటినేను

ప్రక్కలంజూడక వెక్కసపడకింపగాబోక తలపు
ముక్కుపుటాటిగా నాగి పోయెడి జపయించినయెమ్మ
దిక్కులన్నింటియందును ప్రతిధ్వనులజ సల్పువేళ్ళ
నెక్కొనసనీయ వేదేవ! నిర్వృతిప్రస్థానగగన!

కపటమహా గగనాగ్నికళను కన్నులుగట్టినయట్లు
విపులకృపీటయోనిత్వవిస్ఫూర్జితాకారు నిన్ను
జపియించి తపియించిఋషులసందిగ్ధవాక్యమ్ములందు
నిపుణతపలికన నిన్ను నేనుధ్యానించెద దేవ!

అపవర్గములు భేదించి అరిగెడి వీరవ్రతుండు
పరీక్ష్రతాఘుండపారమర్వారబలసముపేతు
దారంభమును నొనరించినట్టికార్యమ్ముత్యజింప
కరీకృతద్యుతి పోవునుద్ధతిం డున్నాడే – దేవ!

ఎక్కడనో యుండునట్టి శృంగాగ్రభాసమానుండు
ఒక్కనుమహానీయమూర్తి ఒక్కలోపములేనివాడు
చొక్క అట్టిమనుష్యునరయ జోహారొనర్పమే భక్తి
నిక్కపు హృదయమ్ముతోడ నీలలోహితకంఠనేత్రి!

నాజూకుగాగ ఆలోచనలు దొంతరలుగాగఁబేర్చి
బూజువట్టిన ప్రాతసూత్రముల ఫ్రార్వపక్షమ్ము నేర్చి
రాజుననుకొని ఊరూర రమణతో తిరిగెడినాడు
మోజుబారకపోయె భోగములమీద నోమహాదేవ!

అర్థముగానిదానికిని అంతరార్థము లోకవంద
దుర్థికుశలతతోదియుత్రోవకు భేదమున్నదని
స్వార్థరహితబుద్ధియున్న పలుకఁజాలముగాదె దాని
నిర్ధామధామముఁజేయు నిష్ఠనీవిపతె దేవ!

ఆకాశవీథిలో వెలుగు అందని జాబిల్లినైన
ప్రాకటముగా ఆశతోడ పట్టుకోబోదును నేను
నాకంటిముందర నిలిచినట్టేనిలిచి మాయమవగుదు
వో కాలకాలమహేశ! యోగినాయకపూజ్యచరణ!

అందనిమ్రానిపండుకయి అర్రులుచాచుచున్న
మందబుద్ధినటంచునాకు మహితాత్మ! మొన్నటివాక
అందబోదువికాసమవిరళాద్భుతలోకదృష్టి
నెందుకు కోరగాకపోతి నిందిరారమణపూజ్యాంఘ్రి!



చూచినాడను మహాభోగసుందరమైన భాగములు
దోచినాడను మనోహరమధురమధుపానుభవములు
నాచిన్నతనములోపలనె నక్షత్రసంఖ్యానుధావ
మేచినయదినన్ను విశ్వహేతుసంకల్పవికల్ప!

పడికట్టురాళ్ళతో బహుళవాక్యముల్ జల్లెడలల్లి
గుడినిమొత్తము క్రింగుకొక్క కూర్చుంటి చీకటికోన
ఎడదరాయిగజేసికొని మహీయసియైన శ్రద్ధతను
బెడదవచ్చిపడెను వైష్ణవీమాయరూపాన నీశ!

తట్టుకోలేకపోయితిని దర్పమింతగకల్గికూడ
నెట్టుకొని అరుగలేక నీకిది విన్నవించితిని
పుట్టిమునిగిపోయినట్లు పులిమీదిపుట్రగా మరల
అట్టె పైబడినది చిన్నదైన మరొక్కటి దేవ!

చిన్నదైననుగాని దానిచిత్రాహతి నెదుర్పలేక
విన్నబోయితిని భావమ్ము విస్తుపోయెను విభావమున
మిన్నులదిక్కుచూచి ఒకమేరకెట్లో నీళ్ళునమలి
కన్నార్పనివ్రతమ్ము మిసగకడకు దేవా! తప్పుకొంటి

చివికిచివికిమనస్సునకు చిన్నబోధయు నెక్కఁబోక
అవితథహృదయాగ్రశక్తి అంధకారాకులమయ్యె
అవకాశములు జారవిడిచి ఆపైననేమనుకొన్న
నవుఫలమేమి? యంచందరనిరి విశ్వాధీశ! ఈశ!

అనిరిగాకయెదియొలోకు లందుకువెరవగబోను
మనసునవచ్చినదెట్టిమార్గము నేకర్మఫలమొ
తనుదాన కాకుండఁబోవు తత్తత్సమయనిరోధమ్ము
జనితమైనట్టి అజ్ఞానజనురుదాహరణమో దేవ!

కొన్ని దేశముల దర్పమ్ముకూర్చును సద్గౌరవమ్ము
కొన్నిస్థానముల వినయముకూర్చును కీర్తివిస్ఫూర్తి
ఎన్నిచోట్లో అన్నిపథములేయున్న వేమో నటంచు
తిన్నగఁజూచినదోచు దృష్టినిర్దగ్ధకందర్ప!

తప్పులంచెరిగియు కొన్నితప్పదుచేయకయుండ
నిప్పటంచెరిగియె యొకడు నిక్కముగాకాలద్రొక్కు
నప్పరతత్త్వాభిమాన నయవిధాననిరాసనమ్ము
చెప్పకయేచేయవలయు సిద్ధచాంద్రీసుందరాంగ!

అనవసరముగాగనొకని యందనుమానముచెంది
ఘనతరాఘమ్ము వచ్చునటుగానవమానముచేయు
జనమునకంతకన్నను నిజమ్ముగ నరకముఁబంప
నెనయునె ఒకశిక్ష దుష్కరేంద్రియజయహృద్విహార!

ప్రణయముచే నొక్కనరుడు బాధనుబాధయటంచు
మనుజునితో చెప్పుకున్నమాత్రాన వ్యథ వ్యథగాదె
జనుడెగుర్తింపవలెను నిజప్రియమిత్రుని మనసు
తనకుతానై పల్కవలెనె? ధారణధ్యానాధిగమ్య!

తెలుపన్న తెలుపా? అదిఒక తెనుగుగాని అమరిగాని
పలుకగలేని తెలుపు-ప్రభావ విభావమ్ములను
నెలవైన మహానీయమతాలు నిర్మింపగాలేని వెలుగు
జలజాంబకా! నీలకంఠ! జానుగనాటి నీతెనుపు

విసవిస పసవిడివచ్చి విచ్చేసి ఆ నాగరాజు
కసిదీరగా కాటువేయుగాక నాకుటిలతపైన
దుసికిలపడెనేమి? యదియు దుర్వారమనుశక్తితనువు
పసకాగలేక నీవికనుభవ! సమీక్షింపగావలయు

విసువక రేలుఁబవళ్ళు విఘ్నేశజనక! నీ మనువు
నెనజపింతునా నిర్ణిరోధవిరహభ్రుకుటి ముడివేసి
కొస కొక్కపర్యాయమేనిగూడ దర్శనమిత్తువన్న
మసలకయుండు లేమన్న మంట యిదేల? విశ్వేశ!

అగ్నుల పోలిక దుర్మదాహంకృతిస్ఫారగతులు
నగ్ననాట్యము సేయుచుండె నాకంటిముందర నిలిచి
భగ్నముగాక నిల్పితిని భ్రూకుటి నింతకాలమ్ము
నగ్నతనూ! ఆపలేను నా గుండెలోని కన్నీరు

నెత్తమ్ములాడను కొంప నెత్తమ్ములందు నా తలపు
నెత్తిపై బడుచున్న దుష్టనిర్భరకష్టభారమ్ము
నొత్తిగిలంజేయఁజూడదొకసారియేనియుఁగాని
చైత్రవేలల నిట్టిసింధుచిక్కణంబున్నదే? స్వామి!

సోకినదొక పిల్లగాలి సోలినదొక గట్టిగుండె
తాకినదొక చిన్నతలపు దద్దరిల్లెను మిన్నవలపు
మోకాళ్ళలోతుబావులకు మోకులుగట్టి తోడుకొను
ఆకాంక్షయే మిగిలెను రసానందవేళగాకభవ!

ఓసుకావలసెను కంటిచూపింతయును చెడకుండ
మోహవారిధి నాదుబ్రతుకు ముద్రత్రాడు వేసిలాగుటకు
ఓపెద్దులను గట్టి పట్టి చోచో యటంచు తోలినను
కాడినిల్వాదు జంటవెలుగు కప్పడదొక్కింతస్వామి!

తోసునీడను గోరి జగతిదోచితి తోచిన చోట్ల
కూడగా లేకుంటి నొక్కకుటి లేక్షణము నేటివరకు
పాడిల్లుగా నున్న హృదయవాటిక చిగురింపఁజేయు
నీడగోరెద తపోలోకనిభృతోద్గమమ్మున నీశ!

కన్నుల నెన్నియో నేను కాంచితిని తనివిదీర
సన్నాహమొనరించితిని ప్రసాదముఁ జేయ కొన్నింటి
సన్నుతికెక్కిన వెల్గు జాడ కప్పింపక ఆగి
యున్నాడ నీనాటిదాక ఓ ప్రకాశానందరూప!

మస్తకమ్మదినాకు భిన్నమైననుగానిమ్ము గాని
వస్తుస్థితికి లోపదైన్యభారము రాదేని గొప్ప
ప్రస్తార జపవేగపరితర ప్రభాగతికినమైన
నిస్తులపద మంతికంటె నేనేమి కోరుదునీశ!

తెరచిన కనుమూయకుండ తెరవక మూసినకన్ను
పరమమహా నిష్ఠావిధాన భవ్యశాక్తేయమార్గమున
వరరౌద్రతత్వ నిర్మాణభక్తి దృఢస్థిరకలన
కెంపవదే నీయింటితలుపు దీధితివిస్ఫురదక్షి!

చక్షుస్సహస్రముల్ చూడ జాగ్రదుదగ్రవిస్ఫూర్తి
సిక్తప్తమైన ఆహూతులు నిష్కుటాంగారముల్ నిభృత
దక్షిణదాక్షిణ్యరూపతారతమ్య విభేదతనువు
లక్షణకరుణాంబురాశి! ఆదరించును నీదువెల్గు

చక్రాకృతులతోడ సతము చంక్రమణమ్ములు సేయు
వక్రకృతుల్ దేహాసిరల వల్గనములు చేయుచుండె
అక్రమకార్యములెల్ల అరికట్టవలసిన నీవు
విక్రమమును జూపకుండ వెనుదీయుచున్నావు దేవ!

నెమలికుంచెల రంగుగలుగు నీలిసిరాకలమైన
కమనీయకావ్యములల్లు కల్పన యెక్కడవచ్చు
సుమసుందరమృదుత్వపరమశోభావిశేషములున్న
అమృతహృదంతరరేఖలవియె వచ్చునె? విశ్వనాధ!

పరమసుందరమైన రాచబాటలు వీడి నరుండు
మురికికాల్వల త్రోవవైపు మొగ్గుట లోకపువింత
కొరుకంగరాని కొయ్యలుగ కొందరు వాదించువేళ
కరకుతనమ్మానకున్న కష్టముగాదొకొ దేవ!

కఠినుడనంచు లోకమ్ము కడగి పల్కనుగాక నన్ను
శఠుడనటంచు ఆరాధ్య సౌందర్యముల్ పల్కుగాక
హఠమించుకయుగూడ తగ్గ దత్యంతకర్కశభావ
పఠనపారనవేళలందు బాలేందుమకుట! మహేశ!

నిటలవహ్నిజ్వాల లేచినిప్పులుగ్రక్కగవచ్చు
పటుతరశూలము దూకి పైఁబడఁబోవగవచ్చు
కటుకంఠకుహరాగ్రరవము కయ్యమునకుపిల్వవచ్చు
నటనసమ్మూర్ఛితవిశ్వనట త్రిగోళ! త్రినేత్ర !

తరముగాదేయెండలోన తపన భరింపగలేను
వరముగానీవైన నొక్క ప్రజ్ఞానభావనచ్ఛత్ర
కరుణావిలాసమ్ము చూపగా రావయేని నాకింక
తరుణమ్మునకు నుపాయమ్ము ధ్యానాగ్ర! యెవ్వరిచ్చెదరు?

తనదు కోపమ్మును తనకు తగని శత్రువు సుమ్మటంచు
వెనుక పెద్దలు చెప్పినట్టి విజ్ఞానపూర్ణవాక్యములు
మనసునాటగలేదు నేడుమాత్రము దానిఫలమ్ము
ననుభవించెడివేళ తెలిసె నధికారిజనశాంతిదాయి!

ఒకరసశ్రీకరభోగ మొంది సుఖింపగ గాని
ఒకనిరంతరమహావ్యధల నొగి దుఃఖమూహింపగాని
ఒకడు చేయునదేమి? ఫలమునొక్క డిచ్చునదియునేమి?
ప్రకటింపఁగల తనకర్మఫలమెగాక త్రిలోకనాథ!

ఇష్టములేనట్టి పనులనెన్నింటినో చేయుచున్న
నష్టము నొసగెడి వానినైనను శిరసాగ్గి సలిపి
కష్టములేదులే యంచు కలితహాసము పైకిచేసి
దుష్టుడీ యధికారియనుచు తొలగిపోదురు త్రిలోకేశ!

శిష్టమా వ్యావహారికము సిద్ధాంతములునిల్పుచున్న
అష్టాంగయోగమ్మునందునార్ద్రిత చెల్లదు దేవ!
పిష్టపేషణమైన భిన్నభిన్నములు పృథక్పృథమ్ము
లష్టకష్టములు నాలించి అరగదు తిన్నది దేవ!

ఒకఆంజనేయుడు పూర్వముదధిదాటెనుగదా యనుచు
ఒకసమానాభిధుడూర నొగిపిల్లకాల్వను దాట
అకట? ఆధిక్యమ్ములొకటియ నెదురోజులు నేడు వచ్చె
భ్రుకుటీవిభంగవిస్ఫురితరూక్షాగ్నిదగ్ధపుప్పేషు!

ననునేనెమరచెద వ్రతమునన్ పట్టుదలనుకూర్చుండ
నిను మహోన్నతునినాలోన నిల్పుకొనఁగపూను వేళ
ఘనధర్మసందేహములు ప్రగాఢప్రకృతిబాధలొకట
చననీవు సన్మార్గమందు స్థాణు! నిశ్చలనిరీహాత్మ!

ఏజాతివాని పోలికనో హేతుబద్ధము శక్తి మరచి
మోజుపడుచు దేనికొరకొ మూర్ఖత తనసనతా మసంచి
తేజునీడెను హైందవుం డెదృష్టిహీనుడు దేవదేవ!
రాజితసద్బుద్ధిఁజూపరావె లోకేశ! త్రినేత్ర!

దబ్బరల్ వచియింతుననుచు తిట్టగోకప్పుడునాకు
నిబ్బరముండవలెనని నేనెంచినను నిల్వబోదు.
కబ్బముల్ వ్రాసెడువేళ గర్జింప వలసినవేళ
అబ్బురమగు నొక్క నాకు అవియేలా వచ్చును స్వామి!

మనసు కంపములేకయున్న మాటకంపమ్మును చెందు
తనువునుదానితో కలసితప్పటడుగులను వేయు
మనమనసిచ్చెడి తలపుమనస్వాత్వమేవినకున్న
మనుజుఁ డెవ్వాడింక మాట మంచియెటులగు? శైలేశ!

ఈనిశీధినిలోన ఈ నీరస నిరీహ
నిశ్శబ్దవేళలో నిర్నిబంధ
నిస్తబ్ధ ప్రకృతిలో నిండుగుండెలు చీల్చు
కొని వచ్చునట్లున్న నినదమేమి?
ఎవ్వరోహో? నీవు ఎవరహో? ఆచోట
దూరాన సన్నని తారవోలె
చూపులకందని దీపికాకళికయై
ఎవ్వరచ్చో చరియించువాడు

రమ్ము జ్యోతిర్మయానంద రమ్యమూర్తి!
రమ్ము స్త్రీపుం విభేద విరాగశూన్య!
మరలిపోక నాధ్యానసమాధిలోన
ఓశివా! వచ్చినిలువుమీ ఒక్కక్షణము

ఆశ్చర్యమా ప్రభూ! అనుమానమా దేవ!
ఎవ్వరున్నారు నాకీజగాన
పుట్టినా నొక రసాంభోధి మధ్యమ్ములో
జీవితమ్మను చిన్నినావపైన
దానిపై నున్నాళ్ళు తలచుచుందును నిన్ను
ఆపైన ఏమౌనొ అరయలేను
అన్నిటికై నీవె ఉన్నావనుచు మహో
ఋషులుపల్కిరి సమున్మిషితమతులు

ఈతనువు నిల్చినంతలోనే సమస్త
మో ప్రభూ! స్వయంభూ! జగదుగ్రమూర్తి!
నన్ను అర్థముచేసికోనట్టి నన్ను
నిన్ను అర్థము చేసికోనిమ్ము దేవ!

ఒకవిచిత్రపువెల్గు ప్రకటితంబైనది
ప్రసరించినది కాంతివల్లి ఒకటి
సీమంతమగుచు రేఖామాత్రమైన అం
దాలజాబిల్లి నీలాలనింగి
బయలుదేరినయది వాడ్యమినుండి పు
న్నమిదాక గడచుచున్నది ఒకేఒ
కానొక తెరమీద కానిపించును వెండి
నగిషీల తళుకు జిలుగుదనమ్ము

ఒక్క నా ధ్యాన ముద్రలో నుదయమంది
చిక్కదనముల చక్కని చిక్క దనము
ఉగ్గబట్టిన యీ నిండు నిగ్గు లందు
తోచెదవు దేవ! రస సమాలోచనముల

అంద రందుచు రసానందన ప్రేమైక
        విగళిత ప్రజ్ఞాన విస్మృత నిర్భ
రత్వ తత్త్వాతీత రౌద్ర యోగిక ముద్ర
        దక్షిణామూర్తిగా దాల్తువనుచు
నే నెఱింగినది ధ్యానించినది తలంచి
        నది నా యెడద కందినది మఱిక
అంది నిల్చినది చిత్రాకారమై యున్న
        శూలాభిషంగ ముద్వేల తనువు

నాకు నిలువదు జ్ఞానముద్రాకురంగ
వల్గనావల్గు రేఖల వైభవమ్ము
కమఠవాల్లభ్య మదికల్గు గాక యనుచు
సాగిలంబడి మ్రొక్కెద శైలశయన!

మనుజులు పాపంబులను చేయుచుందురు
        కర్మవశాననో కాక యేది
యైన వేఱె కారణాననో ఎట్లైన
        నేమి దాని ఫలంబు నిత్తు వీవు
దుర్వార నరకంబు త్రోవఁ జూపింతువు
        వాని అనుభవ మంతైన దాక
పైకి రానీయవు బాధపెట్టెదవు కా
        లుని రూపమున ఘోర మనరె దీని?

ఇంక నీదు కరుణ యేమున్నదీ చెప్పు
లందు నీమహాత్మ్య మనఁగ నేమి
ఉద్ధరింప వలయు నొగిని నావంటి వా
రిని యఘాత్ములైన ప్రణవమూర్తి!

అసలు పాపమనంగ నదియేమి మరి పుణ్య
మన నేమి యని సందియమ్ముకలుగు
శాస్త్రముల్ చెప్పిన సరణిని బట్టి కా
దా? వాని దగు నిర్ణయమ్ముజరుగు
ఆ శాస్త్రములె పల్కు నల స్వప్నమందైన
ఇష్ట ముండిన లేక యెట్టులేని
సౌఖ్యాన నైన కష్టముచేత నైనను
నీ నామ మొకసారి తాను తలచి

నంత మాత్రమునఁనె అఖిలాఘచయములు
స్రుక్కి పోవునంచు నొక్కి ముక్త
కంఠములను – అట్లుగానైన నా కింక
పాప మొకటి లేదు ఫాలనేత్ర!

ఒకనాడు ధర్మమైయున్నది ఒకనాడు
తరచిచూడంగ నధర్మమగును
అంతవరకునేల? అల్ల ఒక్కస్థలాన
ధర్మ మింకొకట నధర్మమగును
సమయమ్ముబట్టి దేశమ్మునుబట్టి ని
ర్ణేతలంబట్టి నిర్ణీతమగును
ధర్మమ్ము మరియెట్లు దానికి శాశ్వత
మ్మైన ప్రస్థాన సత్యార్థగుణము

వీని నన్నిఁ జూచి విప్రతిపత్తిగా
ధర్మమేదియనుచు తగవుగలుగు
అపుడు ధర్మమార్గమనుసరించుట యెట్లు
నిన్ను చేరుకొనగ నీలకంఠ!

స్థూలధర్మమ్మని సూక్ష్మధర్మమ్మని
కొందరందురు ధర్మగురులయందె
సత్యమ్ము మరి అహింసాధమ్ము స్తేయ
మనునవిశాశ్వతమైన ధర్మ
ములటంచు కొందరు పలికిరి దేశకా
లాతీతగతిసమాయతములనుచు
ఈ పురాణమ్ములు నీ గ్రంధములుచూడ
వానికే భిన్నభావమ్ము తోచు

తుదకు విసిగి తనకుతోచినరీతిగా
తాను మంచిదనుచు తలచినట్టి
దారిబట్టిపోవుటే రక్షకమ్మని
నమ్మకమ్ము కలిగె నాకు దేవ!

ప్రళయార్క బింబ తీవ్ర జ్యోతిరావృతి
ప్రకట తీక్ష్ణేక్షణ ప్రభుతలోన
నాసాగ్ర సంచరన్మహితాగ్ని కిరణ దృ
ఙ్మండలీ చుళుకితాంబరతలోన
క్రూరక్రుధాసమిద్ఘూర్ణమానాంతర
వ్యగ్ర కూర్చధ్వని ప్రగతిలోన
ఆవేశ తాండవాహంకార నట దురు
భ్రుకుటీ విభుగ్న విభూతిలోన

దిగ్గగనమధ్య భాగదీధితి నిరుద్ధ
కరిన కర్కశ కంఠమాక్రందనమ్ము
సేయుచున్నది నీకొరకై యహీంద్ర
భయద ఫూత్కృతి విస్ఫురద్వ్యోమహస్త!

ప్రచ్ఛన్నబౌద్ధమై పరగు నద్వైతమం
చందురు కొందరానందమునకు
అసలు బౌద్ధమతమ్ము నందలి సిద్ధాంత
మద్వైతమందలి ఆత్మతత్వ
మరసి చూడగ లేని యట్టి కుబుద్ధులు
తాకవచ్చును కువాదమ్ములకును
శూన్యవాదమ్మున కన్యరూపమ్మె మా
యావాద మనుచు పల్కాడ బోదు

రాకతాయు లగుచు బూకరించిన నేమి?
సకలజగదతీత సత్యతత్వ
సాధనాధికార శాంకరవాదమ్ము
భవదరూపరూప మవును దేవ!

కార్యము తప్పదు కారణమ్మున్నచో
అని మనకర్మ సిద్ధాంత మనును
కర్మఫలమ్మది కలుగు నొకానొక
దైవాధికారపథమ్ము నందు
పాశ్చాత్యపండితుల్ పలుకుదు రిదిఅదృ
ష్టమ్మని మన మొప్పుటకును తగదు
దానికి దీనికెంతైన భేదమ్మున్న
దది యిదియని హృదయమ్ము నందు

శాస్త్రిఫక్కి బట్టి చదివిన చెల్లదు
బహుళ పథ విధాన పస్పశమ్ము
పశ్చిమప్రపంచభవమనంగీకార
పదమటంచు తలతు ఫాలనేత్ర!

అననుభూతమ్మైన ఆత్మానుభూతియి
ట్లుండు నటంచు నుద్దండ రీతి
బల్లగ్రుద్ది వచించి చెల్లించి కొనఁజాలు
టది వట్టి అవివేక మాత్మవంచ
నమ్ము సతమ్ము మానసిక దేశికమైన
వాదమ్ములో పట్టు వదలుకొనును
ఏలన పలుకఁగాఁ జాలనిదాఅనం
తాద్భుతానన్యదృశ్యమ్ము దృశ్య
రహితరాజయోగరమణీయకల్పనా
కల్పనమ్ము శాంతికౌతుకమ్ము
కేవలానుభవము భావించెదను నేను
నీ కృపావిభూతి నిటలనయన!

అనుదినమ్మును ప్రతిక్షణము నొక్కించుక
ఆగక లోగక అధికశక్తి
కొట్టుకొనుచు నుండు గుండెపోలికగడి
యారపు ముల్లట్లు ధీర వృత్తి
కేవలదీక్ష లెక్కింపక యెవ్వరి
కలమిది సాగగా వలె నటంచు
కోరు కొందును నేను ధారాళ సుకవితా
సార ప్రసార విస్తార రథము
ఒక్కవేళ గుండె ఊగకపోవచ్చు
అందును గడియార మాగ వచ్చు
అప్పు డేమియగునో అది యేలనాకు నా
కలమె ఆగరాదు కాలకంఠ!

వాదించి వాదించి నీదైన అస్తిత్వ
మాధిక్యమును నిల్ప నధికశక్తి
వ్యయము చేసితిని దేవా! యింక సర్వమ్ము
నుడిగిపోయెను బలముడుగిడంగ
నమ్మి కొంటిని నిన్నిరమ్మ దాంతర విద్యు
దగ్ని సంఘాత భింద్యత్కపాల
పాలనాద్భుత విశ్వ లీలా విలాస యో
గిక శక్తి నాకు పల్కింతు వనుచు

కల్ప కల్పాంత కాల సంకల్ప సాధ్య
సిద్ధవిస్ఫూర్జథుత్వప్రసిద్ధపాంథ
కలిత విస్ఫూర్జితానంద కల్పనునిగ
నన్ను జేయవె! స్వామీ! ప్రణామ మిడెద

కనులు మూసెదగాని మనసు మూయగలేను
నిష్ఠా విధానంబు నిలువబోదు
దేహ మాసనమున స్థిరముగా కొంత కూ
ర్చుండును మనసు కూర్చుండబోదు
వందలు వేలు దుర్వారముల్ తలపులై
అడ్డంకు లెన్నియో అనవసరము
కచ్చుగట్టిన యట్లు వచ్చి పైబడును చె
ప్ప దగినవియును చెప్పదగనివియు

ఊహ కందరాని ఊహింపరానివి
ఊహ లోన నందుచుండు నీశ!
ఊహ కందకుండ ఒక నీవె ఉంటివి
ఏమి చేయలేక ఏను చూడ

కోరిక ఒక్కటే కోరెదనో స్వామి!
ఒక్క కోరికయు లేకుండునట్లు
పెంపుతోడ ననుగ్రహింపుము సుఖములు
భోగముల్ లౌకిక పుణ్యగతులు
నేను కోరను నాకు వానిపై మమత క
ల్గక యుండుగాక నీకరుణచేత
బ్రతిమలాడెద భంగపడెదను మరి కాళ్ళు
పట్టుకొందును నెత్తిఁ బెట్టుకొందు
ఏమి చేయుమన్న నేఁజేసెదను దీని
కొరకు నీదు కరుణకొరకు ఇంక
భవభరమ్ము లేను భరియింపగాలేను
వలచియుంటి నీదు లలితపదము

విషయవాసనలు కావించిన కర్మముల్
పట్టి దయ్యములట్లు వదలబోవు
పుణ్యముల్ పాపముల్ పూర్వజన్మమ్మున
చేసిన విప్పుడు చేసినవియు
పీడించు గయ్యాళి పెండ్లాము చేతిలో
అసమర్థుడైయున్న యట్టి భర్త
పడు బాధవచ్చెను బ్రహ్మచారికి నాకు
నీవలననె యిది నిజము నిజము
నీపయిని భక్తి కతమున నీప్రపంచ
సుఖములందంత బుద్ధి చొచ్చుకొనిపోదు
కాని పూర్తిగఁ బోయిన కలుగుతత్త్వ
మానులో గొట్టమట్లు చేయకుము దేవ!

అటు నిటు గాక ఊగాడు నీసంసార
బంధ మొక్కట నన్ను పట్టుకొనియె
క్రకచ దంష్ట్రా భయంకర రాహు వక్త్రాన
చిక్కి తపించెడి శీతకరుని
పోలికగానుంటి పోలిక లేనట్టి
ఏకత్వమును గూడ హేతు శూన్య
పరివర్త నాగ్ర ప్రవత్తి విప్రతిపత్తి
కాకరమైన దోషాశ్రయములు
లేని దానిని కోరు నాలేత యెడద
కందవు రసప్రసన్న సౌమ్య ప్రకాశ
సంక్రమణ చారుదీపికా సంప్రయోగ
చారుకళికావికాసదృశ్యములు దేవ!

అర్ధమయ్యెను అర్ధమయ్యెను సగములో
నుంటిని సగముల ఊహలందు
ఉదయ మయ్యెను సగమ్ముగ్రాంశు డర్ధ బిం
బము మాత్రమే కానబడును దివిని
ఒక్క మెట్టును పైకి ఎక్కరా డెవరైన
కాచు కొన్నారో తన్నే చుటుకును
తాను కూడ భయమ్ము నూనక తప్పదె
వ్వడో మహాత్తర తపః ప్రభవు డైన
రావణాసురు నంతవా డావులించి
నంత ప్రేవులు లెక్కించు నట్టివాడు
వచ్చెనో లొంగి పోక తప్పదటువంటి
స్థితి వరకు నేల గర్వము చెందు టభవ!

ముందరే మంచి చూపున యేని విషయమ్ము
తేకువతోడ వర్తించు నేని
ఎప్పుడోగాని యీ యిలలోన సామాన్య
ముగ ప్రమాదమ్మును పొందబోడు
అంతగా ఆపద అది పైన బడె నేని
మనుజు నడత తోడ పనియు లేదు
వీడట్టి వాడైన వీడదా కష్టమ్ము
కసి దీర్చుకొనును భంగమ్మునప్పు

మన తెలివి తేటలప్పుడు పనికిరావు
నేర్పరితనము సరిత్రోవ తీర్పలేదు
ఎంతవాడైనగాని నీ వేతలంచి
దయగనకయున్న మాకు కాధారమూర్తి!

ఏమిటో ఈ లోకమెల్ల విచిత్రము
గా నాదుకంటికి కానుపించు
కొందరు మనుజుల గుణములు తత్వముల్
గాలి సోకిన వాని వోలెనుండు
తలచున యదియేమొ పలుకునయదియేమొ
తామన్న దాని యర్థమ్మదేమొ
తెలియగా బోవదు తెలుపుట కెవరైన
బూనిరేనియు వారిమోముజూడ

రధికగర్వాంధకార దృఙ్మిథునమాత్ర
నిస్త్రపా సిద్ధగుణ భరాన్విత [illegible]ధమ్ము
దాటనల కొండవీటిచేద్రాడువోలె
అంతు దొరకదు బహుబాధయైన దేవ!

అనుకొన్న వన్నియు అనుకొన్నరీతిగా
సంపూర్ణముగ మహైశ్వర్యరీతి
అగుచున్నచో జనమ్ముదిస్వయంశక్తిగా
పలుకాడి పెద్ద డంబములు,గొట్టు
అనుకొన్న దనుకొన్నయట్లు కాకున్నచో
కావలసిన పని కాదయేని
వచ్చునప్పుడు బ్రహ్మవ్రాత–అదృష్టమ్ము
విధివిధానమ్మను వేలపేర్లు

కర్మబద్ధ ప్రపంచసంగ్రామ విద్ధ
మనుజ జాతికి ఒక అసామాన్యమైన
ధర్మమున్నది అంతరాంతరములందు
మర్మము నెఱుంగ దేవ! నమ్మంగ గలదు

గంగిరెద్దులవాడు కడగి ఆవృషభమ్ము
నింటింట ఆడించి యిన్ని యిన్ని
బియ్యమో గుడ్డలో వేని నైనను గాని
గ్రహియించు నట్టుల కర్మబద్ధు
డైన మానవుడేదో అవసరానికి దొర
కిన ఉపకరణమ్ము క్రిందు మీదు
చేసి జీవించు నా వాసి మానవునకు
మానవునకు కొంత మార వచ్చు

అసలు తత్వమ్ము లో తూప మరసి చూడ
ఇంతయును నొకటే యనుటే నిజమ్ము
ప్రబలగాఢాంకురస్నిగ్ధభావపటలి
కలిగినను కల్గవచ్చు నొక్కప్పు డిశ!

బిచ్చకత్తియ కోతి దెచ్చి ఆడించును
మునలిది తిండికై మొగము వాచి
జనమేదో యింతయిచ్చిన పుచ్చుకొని పోవు
తా నొందినది మెల్ల వానరమున
కీయదు గద! తిండి యేదో పెట్టును జీవ
భరణార్థమై తన స్వార్థమునకు
వేనిని జూచి యీ మానవులిత్తురో
వాని కుంకునపల్లమైన బ్రతుకె

నరు డితర మైన ప్రాణులన్ నోరికి సంత
వరకు నింక వీలై నంతవరకు గూడ
స్వార్థబుద్ధితో ఉపయోగపరచుకొనును
పశువుకన్న హీనుడు — పశుపతీ! మహేశ!

పూర్వజన్మలు మానవునకు గుర్తుండిన
చాల మంచిది ప్రపంచమ్ము మిథ్య
యనిప్రాణి గుర్తించి అరుల నారింటిని
సులభమ్ముగా గెల్వగలుగు నంటి
కాదట్టులైనచో కడుప్రమాదము దుష్టు
లోకడుంగు ననుకొనుముగ్రభంగి
పూర్వ జన్మల శత్రువులు వానికుండిన
వారికి వాడపకార మెంచి

నాశనము చేయుటకును పూనంగవచ్చు
పూర్వజన్మ సంస్మృతి మానవులకు దగదు
జ్ఞానియగుదాకఅని ఒకసరసు డనియె
అదియు నిజమేమొ అనిపించు నభవ! యిపుడు

దారిప్రక్కన మహాఘోరంపహా మరణమ్ము
నపుడొందుచుండినఁ వానివైపు
కాంచువారుండరు కనువిషాదము లోక
మెక్కువ భాగమిల్లైనసగు నేడు
అట్టివి రోజున కగుట యెన్నెన్నియో
దానికిదొక్క ఉదాహరణము
ప్రజలు-ప్రభుత్వము-పాలిత పాలక
సంబంధ బంధమహాశ్చర్య మొసగు
ఇట్టిదృశ్యమ్ములఁ జూచినట్టివేళ
ఏమి యీలోక మెక్కడి కేగుచున్న
దీ మహానాగరికత తానెంతదాక
అన్న సంశయమొదవె లోకాధినాథ!

గంటలు కొట్టిన కరణి గుండెల లోన
ఒక అనుభూతి యేదో హసించె
'నవ్వనగారాని నవ్వేదో వినిపించు
కఠిన కర్కశ కంఠ కాహళమ్ము
గందరగోళమ్ము గావించె నలనాటి
అమృతమథన వేళ అమరకోటి
చెందినంతటి భయ మ్మొందె నా హృదయమ్ము
గట్టి సమ్మెటలతో కొట్టినటుల
భీత భీతమైన విదుపులకున్ మధ్య
తోచు నేదో దుష్పిశాచ మొకటి
నగ్నవికృతనర్తనవ్యగ్రవర్తనం
బధికదుర్మదంబౌ అంధకారి!

పగబట్టి చెలరేగి పైకి వచ్చిన యట్టి
వేల పాములు బుసపెట్టి నటులు
కొండపై నుండి ఒక్కుమ్మడి దూకెడి
సెలయేర్ల కోట్లు గర్జించి నట్లు
క్రకచ దంష్ట్రా భయంకర మైన పులిగుంపు
అడుగు జాడలు కాన నైన యటులు
చండశ్మశానవాసప్రేతనసంఘఘో
రాట్టహాసమ్ము లట్టాడి నట్లు
కుటిల కుజ కుటీర కుడ్యాలకమ్మైన
వాయుమండలముల పైని నుండి
సోకి నట్టి ఒక్క దూకుడు తనమిది
అదను కాదు జగతి కాపు మభవ!

చెప్పుడు మాటలచేత పాడై పోయి
పిదప విచారించి ముదము వీడి
చేసిన తప్పులు దోసమ్ము లని ఒప్పు
కొన లేక మరి దిద్దు కొనగలేక
మ్రింగుటకును మరి మ్రింగకుండుటకును
క్రక్కకుండుటకును క్రక్కుటకును
అలనాడు శశిమౌళి హాలాహలము మ్రింగు
నాటి పరిస్థితి నేటి జనులు
తన్ను కొనుచున్న వారు యధార్థమైన
మాట యియ్యది యెవ్వరేమన్నగాని
నాకు నీ మాట నిజమన్న నమ్మకమ్ము
జారుటయు మారుటయులేదు చంద్రమౌళి!

ఈప్రపంచమ్ములో ఈనాడు సృష్టి గా
తినఁ గల్గిజీర్ణించుకొనెడి వారు
లేరందరును మహావీరనాగరకులు
అతి సుకుమారులు అల్పబుద్ధు
లల్పజఠరవహ్నులల్పశక్తివికాసు
లల్పు లన్నింటను అలసు లెపుడు
ఒక పని గట్టిగా నుద్యోగముంజేసి
చేయఁ గల్గెద మంచు చెప్పలేరు

వీరి అనుభవ మెంత అపారమైన
శక్తిసంపన్న శాస్త్రీయసంప్రదాయ
పథవిధాన ప్రయోజనావసథనిభృత
నిష్ఠ ముందర తాండవోన్మిషితవిశ్వ!

అవును లే కాలమ్ము తాను మారినది మా
ర్చుచునున్నయది ప్రజాలోకమెల్ల
మారిపోయినవి సంబంధ బాంధవ్యముల్
చిత్రమైనవి వెలసినవి కొన్ని
కాదగినవియును కాదగనివియును
అనుకోని వెన్నియో అమ్యో సృష్టి
క్రొత్తసాధనములు క్రొత్తబోధనములు
చకచక యెన్నొ పుట్టుకొనివచ్చె

పుట్టగొడుగులవోలె ఈ పుడమిలోన
వచ్చినవి కొన్ని మరల పోవంగజొచ్చె
ఏదియును శాశ్వతముగాదు సృష్టిననుచు
నమ్మిన జనుండు కష్టమొందడు మహేశ!

శక్తినిచ్చెడు నది జనులకందని మూర్తి
శక్తినొందెడు నట్టి జనుడు వాని
ఈ మూర్తికా స్ఫూర్తికింత తేడాలేదు
కొన్నింటిలో పోల్చుకొనెడి వేళ
పైకి కన్పించును భావభేద మొకండు
రూపభేద మొకండు చూపుముందు
సామాన్యునకు సాంఘికామోదమై యున్న
అధికారమున కిది అందబోదు

దీని నర్థము చేసికోఁ బూనుచేని
వలయు నధికారమది వేరు వానినెల్ల
నిర్ణయింపగఁ గలవాడు నేఁడు కలడొ
లేడొ తెలియగరాదు చంద్రీహృదీశ!

ఒక చిన్నమాటకై ఉత్తపుణ్యానికి
కొంపలన్నియు అంటుకొన్నయటుల
పోట్లాడుకొందురు కాట్ల కుక్కలవోలె
బ్రహ్మాండమే బ్రద్దలైన యట్లు
దాని కేనాటికి దరి కానిపింపదు
దారియు కనుపింప దారసినను
ఇంతకు కారణ మేమని యెవడేని
ప్రశ్నింపబూనెనా వానికింక

పుట్టగతు లుండబోవు ధర్మమ్మువున కేని
శాంతి కేని జగమ్మున స్థలము లేదు
కోప తాపాలతోడ సంకుచితమైన
లోక మిదుకయ్యె సుమతికి లోకనాథ!

తారాపథమందు సీతాకోక చిలుకల
పైనున్న అంతటి భ్రమను సగము
సగముగా ద్రొక్క నాలుగవ పాలైనను
నూరవ వంతైన నారయుతము
సత్యసమ్మతమైన శాస్త్రధర్మమ్ముపై
ఆధర్మమును జీవితాంతము వర
కారాధనము సేయునట్టి పుణ్యాత్ముల
పైనున్న నది మహాభాగ్య మిపుడు

ఇప్పటి జనమ్ము ప్రాగ్ధర్మ మొప్పుకోదు
సంప్రదాయమ్ము సుంత మెచ్చంగబోదు
నవ్యముగ లేని దేదియు నచ్చబోదు
వింత యిది దేవ! యీ మహావిశ్వమందు

క్రొత్తయెల్లను వింత రోత ప్రాత సమస్త
మన్న వాదమ్ము నాకట్టెపడదు
నేను స్వతంత్రమ్ముగా నూహ సేయుదు
నందు దేనినిగాని తొందరపడి
నవ్వుటయును హేళనము చేయుటయును దూ
షించుటయును ప్రతారించుటయును
నాకు నిష్టముగాదు నచ్చదా మార్గమ్ము
మరి యది చెడుగాని మంచిగాని

తోచినది తోచినట్టు లుత్సుకతతోడ
వెళ్ళగ్రక్కుట మనసులో పెట్టుకొనక
అంత శ్రేయస్సుగాదు నేడవని లోన
మార్గమది యెట్లు దేవ! యీ మానవులకు

పరమతాదరమ్ము పరమత సహనమ్ము
        ఒక్కటే యని ఒకండూహసేయు
రెంటికి భేదమ్ము కంటికి నిండుగా
        కానుపించు మనువ్న కానఁ బోడు
ఎవ్వఁడు బలవంతు డెవ్వఁడు శక్తి సం
        పన్నుఁడో యెవ్వఁడు బహుజనమ్ము
కూడ గట్టుకొనంగ కూర్చుకొనంగ నే
        ర్పరి యౌనొ అవ్వాని పలుకె మతము
    వాని మాటచెల్లు బహుళప్రచారమై
    వాని తలపె చేయబూను జగము
    వాఁడె రాజు నేఁడు పదిమందిలోపల
    సత్యదూరుఁడైన జగదధీశ!

ఎన్నాళ్ళు తలచిన నింతకంతయుగాని
        కంటిముందర క్రొత్త కానబడదు
ఈ సీమదాటిన యెవ్వఁడుగూడను
        తిరిగి వచ్చినజాడ నరులు గనరు
చూచినంతటిలోన చోద్య మీ ఒక్కటి
        చూచిన అర్థ మించుకయుగాదు
ఎన్నాళ్ళు చూచిన ఉన్నది ఒక్కటే
        సందేహ మదితీర్పు జనులు లేరు
    నీ వొకఁడ వుంటివట హిమానీనదాగ్ర
    సంక్షుభితశైలచలదవశ్యాయఖండ
    ప్రకట వేగప్రచండ దుర్గ్రహము విభ్ర
    మాకులాంతరరక్షకుండవు మహేశ!

దుర్వార బాధల దుఃఖభారమ్ముతో
కనుల నీరింకిపోయినది స్వామి!
ఈ బ్రతుకున కింక ఇది చిగుర్చుట లేదు
అంకురార్పణమైన అగుట లేదు
ఈ జీవితమ్మిట్లె యేగును గడచును
దిగులుతో వ్యధలతో తెల్లవారు
గాఢాంధకారమ్ము క్రమ్ముకొన్న మనస్సు
పడయునే వెల్గు లెప్పటికైన

నెమ్మదిని నేడు నెమ్మది నెమ్మదిగను
సడలుచున్నది కొంత విశ్వాసముభవ!
నీ యెడల నమ్మకమ్మది నిలుచునట్టుల
ఆగ్రహింపక వచ్చి అనుగ్రహింపు

జన జీవితము ధూమశకటమట్టుల నొక్క—
గాడి నేపడి పోవగలదు గాని
ఇంచుక తప్పెనా యేమి వచించుట
ప్రళయమ్ము నెత్తిపై బడును వచ్చి
ఒక జేదియో వింత ప్రకటించెనా వాని
వెంట బడును నేటి పిచ్చిజనము
అంతతో ఊరుకోకది యేమిటోనని
తెలిసికొనగ కుతూహలము చెందు

పట్టి వేలము వెఱ్ఱిగా బాధపెట్టి
పీకుకొనితిను మరి పీల్చిపిప్పిసేయు
వేశ్య విటులనుబోలె దుర్విధి కలంప
ఏమి చేయక చూతువే హృదయనాథ!

ఆ చిత్రములు సేయునట్టి మాత్రను కొంత
కరకువాడయ్యెనా కర్మకాలి
ఒగిని దుర్మార్గు డంచూహూర చాటించి
అప్పగించెద రింత అపశయమ్ము
మెత్తని వాడైన మేధకుండైనను
వాని పాట్లిక అరికైనవలదు
అటునిటుగాక ఒక్కట నేర్పు మీరగా
సద్దుకొనం జాలు జనుడెవండొ

వాడె ఒక మాత్రమున బైట బడగలేను
ఇంక సామాన్యగతి చెప్పనేల గాని
నిలువ అరికాలిమంటది నెత్తికెక్కు
ఇట్టి దృశ్యముల్ చూచినయెడ మహేశ!

పలుకరించిన ముఖభ్రాంతి సంచరదక్షి
యుగము శిరస్సుపై నొకనికెక్కు
సుమతిశతకకర్త సూక్తి పోలికవాడు
బధిరాంధక శవమ్మువలె చరించు
తన కొరకై యున్న జనులు సమస్తమ్ము
క్రిమి కీటకములు తద్దృష్టియందు
అనుకొనునతడు కొంతయిన ఆదరమెంచ
గౌరవలోపమ్ము కలుగుననుచు

పటుతరధనాధికారదుర్వారమదము
కనుల కెగదట్టి లోకము కానుపింప
కలసత గమించు వాని ఉజ్జ్వలత పూర్వ
కృతమనుచు తృప్తిపడుమందువే? మహేశ!

ధనికులు పేదలు తరతమ భేదముల్
పూర్వ కర్మమటంచు పూర్వులెల్ల
పుస్తకమ్ములలోన బోధించి రది నేటి
ఉత్సాహపూరితు లొప్పుకొనరు
బూజుపట్టిన గ్రంథములలోని సిద్ధాంత
ము లవి యనుచు త్రోసిపుచ్చె జగము
కార్య కారణ చర్చ కలిగెను నవ్య సూ
త్రములు విచిత్రచిత్రములు పలికె

నాకు నర్థము కావో అనాదియైన
శాస్త్ర భిన్న విశేషముల్ సంప్రదాయ
సారము లటంచు వీరెల్ల చూరునట్టి
వానిలో కొంత నిజముండవచ్చు దేవ!

ఇది అనులోమమ్ము ఇది విలోమమ్మును
సక్రమమ్మిది ఇది అక్రమమ్ము
ఇది చేయగా వచ్చు నిది చేయగారాదు
ఇది ధర్మబద్ధమ్ము ఇది అధర్మ
మిది శాంతి సత్యమ్ము ఇది అశాంతి అసత్య
మిది తగినట్టిది ఇది తగనిది
ఇది అనుసరణీయ మిది అననుసరణీ
య మిది ఆర్య మిది అనార్య మగును

అనుచు చెప్పెడి వారు లేరవని నేడు
తలచి చెప్పెడి వారల దాక నేల
అస లెరుగు వార మచ్చునకైన లేరు
కాల వైపరీత్యమ్మిది కాలకంఠ!

కొందరజ్ఞులు తామె గురువర్యుల మటంచు
    తమ సహాయములేక తక్క వారు
గాలిలో ధూళిలో కలసి పోవుదు రంచు
    కోత లొక్కుమ్మడి కోయు చుంద్రు
రైన గోదావరీ స్నానమ్మునకు కొందు
    భోట్ల ఆజ్ఞను కూడ పొంద వలెనె
శివుభక్తి తోడ పూజింప సేవింపగ
    ఆర్తి కాపులు మధ్యవర్తు లేల?
  వీరి మార్గమ్మునన్ పోవు వేళ లందు
  బయలు దేరును సంశయభ్రాంతియొకటి
  జనమనస్సులు పరిణతి గనని వగుట
  ఆస సహజమ్ము జగతి కైలాస నాథ!

ఉన్నది ఒక్కటి కన్నది పది యింక
    విన్నది వేయి ఈవింత ప్రకృతి
వికృత విశ్వమ్ములో వేసుకయూ నీశ!
    తీరని కోర్కెల తీరులట్లు
అనుకొన్నదెల్లను ఆచరింపగ గల్గి
    ఆచరించినదెల్ల అగుచునున్న
పట్ట పగ్గాలుండ వుట్టి కెగురలేక
    స్వర్గమ్మున కెగురు వాంఛయున్న
  తీరునా యేమి? అది వట్టికోరిక యగు
  ఎండమావుల జలముతో నెవని కేని
  దప్పి తీరునె? యీ సమస్త ప్రపంచ
  మార్తి తీర్చునె? కలలోని వార్తగాక

చేయగావలెనన్న చేయగావలె నీవు
ఏదైనగాని మరేదిగాని
మంచియేగానిమ్ము మరి చెడుగానిమ్ము
హక్కు సమర్థత అసలు నీవి
ఒక బిచ్చగానిని ఉండమనగ గాని
పొమ్మనగాగాని భూస్థలాన
కోడ లెవ్వతె అత్తకుగదా గృహాధికా
ర మటన్నయట్టి విధమున పైది
కలదనుచు కొంద రాక్షేపణాలు వచింప
వచ్చుగాక నే నందును భయద సింహ
మొరసి గర్జింప ఒక కుక్క మొరుగనేమి?
నీ పయిని నాకు నమ్మకమ్మో పరేశ!

ఒక విచిత్రాలోచనకు తావాసంగును
వట్టి పెడసరిదీ భావనమ్ము
అది యేదియో చెప్పు మని అందరును గూడ
పీడించినను బైట పెట్టబోదు
అంత రహస్యమో అది యట్టులైనచో
శివునకేని యెరుక సేయరాదె
తన ఊహ తనకె అర్థము కాని యేమపే
యిది దీని కింతగా నెల్లవారి
బాధపెట్టుట తగదని పలుకబోవ
సకల లౌకిక మానవ జాతి యందు
లోప మది ఉన్నదంచు దిశాపవాద
మున వచించును దేవ! ఏమని రచింతు?

ఎవ్వరికిని కోపమించుక రాకున్న
ఒక మాటఅందునీయుర్వియందు
ఎవ్వరి భావమ్ము లెవ్వరి స్వాంతమ్ము
లెవ్వరి దొక క్రొత్తసృష్టియనుట
వచ్చిన భావమే వచ్చుచు నుండును
పలికిన దానినే పలుకుచుండు
నొక క్రొత్తయగు మార్గమొక క్రొత్తి పైపూత
ఒక క్రొత్త తళుకిది ఉన్నమాట

ఉన్న మాటయన్న ఉలుకె అందరికిని
లోకమందు పారలౌకికమ్ము
లైన పథము లందు అసుగు వారలకైన
ఐన అందు సత్య మగుట దేవ!

అందునా నిను మహాదమహాద్విభాగ వి
భిన్నగా పుంస్త్రీ విభేద శూన్య
గా నిత్యము ననిత్యమైన తత్త్వముల వ్య
క్తావ్యక్త భావన లంద లేని
చిద్రూపుగా సముజ్జీవితోజ్జీవన
సదసద్విశిష్టతానుదిత మాన
సిక పరిణామ సంచకిత మానస మలీ
మస విషాద విచింత్య మాన చిత్ర

తాత్త్వికజ్ఞేతగా చైత్ర సాత్త్విక ప్ర.
వృత్తి రాజస తామసాకృష్టమైన
సమయ మందు కరావలంబము నొసంగు
క్రాంతి శబలిత సుమనస్కుగా మహేశ!

కాలకంఠ! కఠోర కాళరాత్రులలోన
మృత్యుదేవత విహరించు వేళ
పేరుకు మాత్రము వెలుగుచు నున్న యీ
జీవత్సమాధుల చెంత దీప
కళికలలో కొంత గాకున్న కొంతైన
తైల మున్నది ముహూర్తమ్ము వరకు
ఆ పైన అద్దాని యందు స్నేహమ్ముంచి
వత్తిని ఎగద్రోయు వాడు లేడు
అందుకై కాటి కాపరి నరయు కొరకు
కాలు గాలిన పిల్లిని బోలి తిరిగి
వెదకుచున్నాడ బహుజనురుపయయుగయు
గాంతరిత కల్పముల నుండి అంధకారి!

ఒకరీతి ధ్యానించుటకు నొప్పుకొండొకం
డల ఒక్కటిని ఉండవలయుననును
ఇంకొక డైన తప్పే యంచు నమ్మును
పలుకును నరకమ్ము వచ్చు ననుచు
నమ్మి చెడిన వార లిమ్మేదినీ స్థలి
నుండక పోవచ్చు నొక్క సూత్ర
సిద్ధాంతమును బట్టి చెప్పిన వేళల
ఇల నంటి పెట్టుకో వలయు నొకటి
ఒక. మతమ్మున నాకు నమ్మకము కుదుర
దేకరణి గాని యితర మంగీకరింప
జనడు తన దేమి పుట్టిమున్గినదొ కాని
మానవుడు నేడు శివ! చిత్రమైన వాడు

కాని కదా చిత్తుగా నొక్క ఊహను
        ఊహింతు తప్పొ ఒప్పొ యెఱుంగ
ఇంతకే నెరిగిన దెంత చూచిన దెంత?
        విన్న శాస్త్రిమ్ముల వెలుగదెంత?
అతితర తేజోభివృత భాస్కరునిముందు
        దివ్విటీ బట్టిన తీరు గాదొ
లేక దుర్భర తమో లోకమ్ములకు మధ్య
        మిణుగురు పురుగుతో మిణుకుటగునొ

    అరసియును దాటగాజాల నాధిభౌతి
    కాధిదైవికాధ్యాత్మికమైన దుఃఖ
    ములను తరియింప నిన్నె నమ్ముకొని యుంటి
    ఆర్చెదవు తీర్చెదవటంచు అభవ! యిపుడు

ఈ సృష్టిలోపల నెంతవాడును ప్రలో
        భముచెందు నేదియో వాంఛచేత
ఆయాశ గొప్పదై ఆతని కంటికి
        స్వర్గ సౌందర్యదృశ్యముగ దోచు
పులి స్వర్ణకంకణమ్మును జూపి ఊబిలో
        నికి దురాశుని విప్రు నీడ్చినట్లు
తన వాంఛయే తుద తనను దుర్వార దుః
        ఖము లందు వ్యధలలో కలిపితీసు

    మతినిగ్రహియింపగా లేడు మానవుండు
    బహుళ జన్మార్జితము కర్మఫలము జారి
    ఒక విరాగ దృష్టికి నేగుచున్న గాని
    అది కలుగు గాక నాకు లోకాధినాధ!

నిష్కామ కర్మచే నెగడు ఫలమ్మది
కామ్యకర్మలచేత కలుగు నొక్కొ
అలధర్మరాజేంద్రు నంతటివాఁడు మ
హానుభావుఁడు జగద్వ్యాప్తకీర్తి
హయమేధమొనరింప నాతనియజ్ఞాన
బ్రాహ్మణుల్ భుజియించి పరమతృప్తి
కరపదమ్ములునీట కడుగుచోనటునిటు
బొరలిముంగిసబంగరు తోడననియె

దీనిఫలముస క్తుప్రస్థదానమునకు
పోలదనిధర్మసూక్ష్మము భూరితరమ
నన్యమై చెలువారెఁడు ననుటకింత
కంటె సాక్ష్యమ్మువలయునే కాలకంఠ!

తగదహంకార మెంతటి వారికైనను
పారమ్యమున్న తపస్వికైన
బకదాల్భ్యుఁడును మరి బ్రహ్మలనేకులు
వేయి మోములుగల్గు వేల్పుతాత
చెంతకు వివశులై చేరినవేళను
గ్రహియింపరే జగద్ధన్యా మతులు
తమకన్న నెక్కువై తనరారు వారుండ
గలరే యనుచు బుద్ధి తలచువెల్ల

గర్వమునకు చిహ్నమ్మది కలుగరాదు
తాఁడి దన్నువాడుండిన తలను దన్ను
వాఁడు తప్పకయుండును భక్తి వినయ
మెంత వానికి వన్నెకాదే మహేశ!

ప్రేమ ప్రేమ యటంచు పెద్ద సిద్ధాంతముల్
పలుకుచుందురు నేటి వారలెల్ల
ప్రేమ యనగ నాకు ప్రీఞ్ ధాతువునకు పై
వరలినది ఇమనిచ్ ప్రత్యయమ్ము
ఒకనిపై నింకొకనికి నిష్ట ముండిన
అది ప్రేమయేయంచు నందు నేను
ఒక్క ప్రాణికి మరియొక్క వస్తువుపైన
నిష్టముండిన నదియెల్ల ప్రేమ
ప్రేమ తత్త్వముపయి వీరలు చెప్పెడి
సూత్రములను నాకుఁ జొరదు మనసు
సరసమైన ప్రేమ వరలగావలెను నీ
పైన నంచు దలతు ఫాలనేత్ర!

ప్రేమమియ్యది యంచు కామమియ్యది యంచు
విడదీసి పలుకగా కడఁగు జగము
ప్రేమలో కామమ్ము వెలయదే కామాన
ప్రేమ యొక్కించుక వెలయఁబోదె
ప్రేమకామములంత వికృతివిద్వేషము
వైరమ్ము గలిగిన పదములనుచు
శబ్దార్థముల నింత చక్కగాఁ జూచిన
వాదమ్ములివి బోధపడవు నాకు
ప్రేమకామార్థతత్త్వసంప్రేరణైక
మానసిక భావచాలనా మదన జనిత
చిత్తవృత్తిజ్వాలన్మహో శిఖిశిఖాగ్ర
మొకటి నీవంచు స్ఫురియించు వికృతనేత్ర!

కలుగకుండునుగాక కామమ్మునాకు లో
  కమ్ముపై తుదకు కామమ్ముపైన
వెలయకుండునుగాక ప్రేమమ్మునాకు దే
  హమ్ముపై నన్యమోహమ్ము పైన
ప్రేమ కామమ్ముల వేనిలోపల మధ్య
  నలగిపోకుండ నుండంగగలుగు
శక్తి ప్రసాదింపు శర్వ! మహాదేవ!
  దగ్ధమన్మథ! మహాస్నిగ్ధమూర్తి!
నాకు కామమ్ము గలిగిన నాకు ప్రేమ
కలిగినను అవి నీపయి కలుగునటుల
దయను గనవె కాలత్రయీతరణకరణ
విపులనేత్రత్రయీదృగుద్వేలవిభవ!

శక్తిపై నధికవాంఛాదీప్తియుండిన
  శాంతి యించుక కల్గ జాలదనుచు
శాంతిమీదను కాంక్ష చాలగల్గిన యేని
  శక్తి మార్గమ్మది జరుగదనుచు
పలికిరి కొందరు పరమమౌనీంద్రులు
  తద్వాక్యములు నేను తప్పులనను
శక్తి యుండిన శాంతి శాంతియుండిన శక్తి
  ఉండరాదే వానికుండె నేమి?
వైరమును భేద మసలు తత్త్వమ్ముఁజూడ
శక్తిలో శాంతి, శాంతిలోశక్తి లేదె
నేను వాంఛింతు శక్తి శాంతి ప్రసన్న
తావకకృపాకటాక్షబంధనములీశ!

నాకు ప్రపంచమ్మునకు నించుకంతయు
సంబంధమే ఉండజాలదనుచు
వలదంచు బూకరింపగబోను లేదంచు
మోసగింపగబోను భువిని జనుల
నేను వేదాంతిని నేను జ్ఞానినటంచు
ఒక రవ్వయైన నమ్మకములేదు
నాకున్నదొక్కటే నలగని విశ్వాస
మెంతైన నీవె రక్షింతు వనుచు

ఈ ప్రపంచమ్ముపై దృష్టి మెసగదేని
కావ్యములు వ్రాయుటేల? పల్కుటయు టేల?
పరమ మానమ్ములోన తత్వమ్ముగనుచు
నరుడు బ్రహ్మమ్ముగను ననన్యమ్మునీశ!

ఆనందమౌ బ్రహ్మమనుభవించినవాడు
తనివిదీరగ ఆత్మ గనినవాడు
సత్యమౌ అత్యంతశక్తి నెంచినవాడు
అన్నింటికన్న నత్యధికమైన
పరమాత్మ తత్వమ్ము పడయజాలినవాడు
వాని మార్గము వేరు పలుకె వేరు
ఆచరణమ్మె వేరసలాతడే వేరు
కలియఁబోఁడాతడీ కలనములను

ప్రజ్ఞగల్గినకవి చక్రవర్తులైన
ఆ మహామూర్తి చెంత జోహారులొసగి
భక్తి తరియింతు రాత్మతాపత్రయమ్ము
నీ కిరణలేశమది శివా! నిశ్చయమ్ము!

గంగానదీతరంగముల సంస్పర్శలు
కల్మషపటలిని కడిగివేయు
భుజగరాడ్ఘనభోగభుగ్నఫూత్కారమ్ము
లుగ్రపాపమ్ముల నూదివేయు
బాలేందుకిరణసంప్రసరితచంద్రికల్
జ్వాలావదఘములు చల్లపరచు
ఫాలస్థలీమధ్యభయదలోచనవహ్ని
ఏదురితాళినేఁ బూదిసేయు

ఇంతకును నీదుకరుణ ఒక్కింత మాకు
కలిగినా అంతకంటె కావలసినదియు
మరియొకటి కల్గబోవ దంబావిభక్త
తరళితానందశృంగారతను! మహేశ!

ఒకచిన్న గడ్డిపరక దోవతికంటె
నా వెంటవచ్చిన నాకు పరధ
నాపహారణపాప మరుగుదెంచునుగాన
ఇదియిక్కడనె పెట్టి యేగుచుంటి
అనిన వంచకుడైన యట్టి బైరాగి మా
టలలోనె తత్కపటత్వ మెల్ల
బయట పడినయట్లు వారల వారల
పల్కులో నడతలో వారి వారి

తత్వము తెలుంగవచ్చు ఎంతగ రహస్య
మనుసరించిన ఏదో ఒకప్పుడైన
నటనలో లోపమొకటి కన్పట్టుగాన
ముందు జాగ్రత్త వలయు నానందనాథ!

అసలీ ప్రపంచాన నంతియు నటనమ్మొ
నటియింప నటియింప నటనమౌ తుద
కొంత కాలమునకు గూడను సత్యమై
అది మార్చుకొనుట అత్యంత కష్ట
మల నాటకమ్ములందుల రాజు వేషమ్ము
వేసి జనమ్ము నొప్పించువాడు
ఆరీవి ఆమాట ఆనడకయును నా
గతి అలవాటైన కరణి ఉత్త

సమయములగూడ ఈ ప్రపంచమ్ము [illegible]
ఒక విచిత్రపు నటనగా ఒక వినూత్న
భావనాలీలగా ఒక ప్రౌఢ చరణ
చతురచలనమ్ముగా బాలచంద్రధారి!

ప్రేమతో సాకి ధాత్రీస్థలి తననొక
మనుజునిగాఁ జేసి మనిచినట్టి
పరమపుణ్యాత్ముని కుమతర బ్రాహ్మీస్వ
రూపునకును సద్గురుప్రభునకు
మదమెక్కి పంగనామాలు పెట్టెడివారు
అపకారమునుగూడ నరయువారు
ఆషాఢభూతులీయవనిలో నూటికి
తొంబదిమంది ధూర్తులు దురాత్మ
లుండి రక్కట తద్బుద్ధి ఖండనమ్ము
తెలివిగా జేసి మార్పు జెందింపగలుగు
కాలపురుషుడు వచ్చుట కలదో లేదో?
చక్రనేమిక్రమమ్ములో శైలశయన!

క్షణములోపల వంపలును వేలు రూప్యముల్
జనుల కన్నులముందు కనుపడంగ
కనుకట్టుసేయును గారడీవాడు వా
నికి ఆధనమ్ము క్షణికమెయాట
అసలు నిల్చెడునట్టి అర్థమ్ము ప్రజలను
చేతులుమోడ్చి యాచించి పొందు
కోటి విద్యలుగూడ కూటికొరకను సి
ద్ధాంతమ్మునకు నుదాహరణగాంగ
కాన తాత్కాలికమ్మైన దానితోడ
తృప్తి చెందుటచే ఫలమ్మింత సున్న
సత్యతత్వమ్మెఱుంగగ జాలునట్టి
యత్నమును జేయరేమి జనాళి దేవ!

ఇష్టము లేని నాగేంద్రుని మంత్రబ
ద్ధుని జేసి ఆయహితుండికుండు
ఆడింపఁ బూనును ఆశక్తి లేని వా
డరసినాగస్వరమైనపాడి
కాలసర్పము వశీకరణంబు జేసికో
జాలు నట్టులె ఒకశక్తి యున్న
ఇష్టములేనట్టి యెద్దానినైనను
ఒక రీతిగా శ్రమనొందియింత
కృషి యొనర్చిన యేని అంగీకృతోరు
రాజసప్రాభవాగ్రవిక్రమ విలాస
కలిత కులపథపథికుండు కాగలండు
తీవ్రయత్నమువలనె వీరవ్రతేశ!

రాక్షసులైన హిరణ్యాకశిపునకు
తారకాసురునకు దశగళునకు
వరములిచ్చిరె మహాప్రణయమ్ముతో నిష్ట
పడి – వారి ఘనతపోవహ్నికి
బ్రహ్మాండభాండముల్ భస్మమైపోయెడి
భయదపరిస్థితి వచ్చినపుడు
తప్పక యిచ్చిరుద్దామ శక్తిప్రభల్
కావున నీ త్రిలోకమ్ములందు
ఎవఁడు వీరవ్రతాచారుఁడెవ్వఁడధిక
తపఉదగ్రుడు నిశ్చలాధ్వక్రియుండు
వాని కదలించు వారలెవ్వారు? మున్ను
భస్మదైత్యుని కథ యేమి? ఫాలనయన!

నవనీత మెటనో కొంతను సంగ్రహించిన
మార్జాలములు తమ మధ్యతగవు
వచ్చి అర్ధానిని పంపిణీసేయంగ
తీర్పు చెప్పంగ కోతి బ్రతిమాల
సగము భాగమ్ములు సల్పి నట్లు నటించి
తూచి ముక్కలు చేసి దోచు కొనియె
తాను సర్వమ్మును వానరమ్మట్టులే
ఇద్దరిమధ్యలో నెసగు నట్టి
దేదియైనను గాని దానింకొకండు
బలము గలవాఁడు నగుమధ్యవర్తిఁ జేర
గలుగుచుండు సామాన్యము గాగనష్ట
మిరువురకు నప్పుడగు బుద్ధి యింత ఈశ!

ఇరువురు రాజులహీనసేనాయుతు
  లుగ్రమౌ వైరమ్ము నూనినపుడు
సహజమ్ము యుద్ధమ్ము జరుగుట దానిలో
  చచ్చెడునది మహాసైన్యచయము
పేరు వచ్చెడు నది వారికి అట్టిలే
  చిత్రమ్ము గాగ కష్టింపకుండ
ధనమును యశము నౌద్ధత్యమ్ము నౌన్నత్య
  మొందుచు నుందురు కొందరిలను

వారు బహుశా పురాజనుఃపరమసుకృత
ఫలము నీవేళ ననుభవింపంగ వచ్చి
యుందు రని సరిపెట్టుకో నూగులాడు
తలపు వాంఛించు నొక సమాధాన మభవ!

కొందరు నవలలుగూర్చిన బాగుండు
  కొందరు పద్యముల్ కూర్ప బాగు
కొందరు గేయముల్ కూర్చిన నందమ్ము
  కొందరు కథలైన గొప్పయగును
కొందరుపన్యాస మందుకొన్న శుభమ్ము
  కొందరు గానమ్ముకూర్ప సుఖము
కొందరు శాస్త్ర సద్గురువులై పాఠముల్
  చెప్పి శిష్యులఁజేయ శ్రీయుతమ్ము

కొంద రేమిసేయకుండిన నెత్తిపై
పాలుపోసినట్లు ప్రకటబుద్ధి
అన్నిసేయఁబూన నలవిశ్వనాధత
యైన చాలదేమొ అగ్నినేత్ర!

కొందరిఁ జూచెదకూరిమిగలవారు
పరమకారుణికులు సరసమతులు
శాస్త్రవిజ్ఞానమ్ము సంప్రదాయమ్మును
కలవారు ధర్మము తలచువారు
కవితాప్రపంచభాస్కరత నొందియు మన
స్సన్న్యాసులై ఒక శక్తియుక్తి
సాగువారున్నతి నూగువారు విచిత్ర
మైన మార్గమ్మున నరుగువారు
నిండు మనమేమొ అది నవనీత సమము
వజ్రతుల్యమ్ము పలుకు దేవా! అదేల?
ఇట్లుచేసితివయ్య! ఒక్కింతి మృదుత
ఉండరాదె! ఒక్కడు పూర్ణుఁడుండరాదా!

అఖిలప్రపంచంబు నావరింపఁగఁజాలు
కామాంధకారంబు గాసి పరచి
బ్రహ్మాండముల మ్రింగ బయలుదేరెడు మహా
క్రోధంబు నించుక కుదిలపరచి
పరమధార్మికదానపరతను గ్రసియించు
లోభంబు నొక్కట లుప్తిఁజేసి
అన్యులపైఁగూడ నధికారమునుగోరు
మోహంబు నొకసారి మూలనుంచి
మదమునదలించి మాత్సర్యమెదను ద్రోలి
ఆరు ఋతువులయందు నత్యంతభక్తి
నారువేళల శివుని అనంగ హరుని
నిన్ను భజియింపఁగల శక్తినిమ్ము దేవ!

తిరుగరాని స్థలాల తిరుగు పాదమ్ములు
నీ క్షేత్రములలోన నెగడుచుండ
ఏవేవియో చేయఁబోవు కరంబులు
నీ కొరకంజలిగ నిలుపుచుండ
నిత్యదుష్టమ్ములైన నింసుటూహాలతోడి
హృదయమ్ము నీ దీక్ష నెసగుచుండ
కోరికలొత్తు పొంగారు వక్షస్థ్సల
మెమ్మకట రుద్రాక్షమాలికల నొరయ

ధర్మదూరప్రవాదమాధ్యమికమైన
బుద్ధియొక్కింత నైతికస్ఫూర్తినలర
త్వత్పదాంభోజ యుగమును దలచునట్టి
వరము నాకు ననుగ్రహింపవె మహేశ!

అంగరాగంబుగా నవయవంబుల నెల్ల
భస్మ ముద్ధూళనంబాచరించి
ప్రణవపంచాక్షరీపరమమంత్రజపంబు
జిహ్వాగ్రభాగాన స్థిరముఁజేసి
మసృణసుందరమైన మహనీయశార్దూల
చర్మంబు పీఠంబు సంతరించి
కమనీయకాంతితో కంఠదేశమునందు
రుద్రాక్షమాలిక రూఢపరచి

పశుపతిని కాలకంఠుని ఫాలనయను
రుద్రు మృత్యుంజయుని మహాభద్రమూర్తి
నిన్ను హృదయంబునందున నిలుపుకొనుచు
పాశుపత దీక్ష జరుప కన్పడవె దేవ!

పసిడి నిగ్గులు దేరు మిసిమి వన్నెలు రేగి
దిగ్భాగములలోన తెలివిమీర
ఋషుల వాక్కులలోని ఋగ్వందనములలో
వచ్చి గీర్వాణమ్ము బలిసియాడ
రేయెల్ల తారల క్రీడించి క్రీడించి
వనధి పుత్రునకు యావనముఁ జార
ఒకవింత మధువుతో ఉప్పొంగు పద్మ ప
రాగమ్ము లోకచిత్రరాగ మొసగ
అరుణుడుదయించువేళ ప్రత్యగ్ర పరమ
భక్తి భావంబు నెదలోన పాదుకొలిపి
కూర్చు నెవ్వాడు ప్రథమ సంధ్యార్చనంబు
వాడు శివ! నీకు నచ్చినవాడు కాడె?

రవిబింబమా! యది ప్రాగ్దిశాప్రోల్లసత్
కమనీయపద్మరాగంబుగాని
రాగమా! యది విమలప్రాగిణీస్త్రీడాంకు
రాంబుజసమముఖాంకంబుగాని
అంకమా! అది మకరాంకవాహనరాజు
డంబైన చంచూపుటంబుగాని
పుటమా! అది ప్రకృతి పుస్తకోద్ఘాటపుటా
నవదృశ్యతతమండనంబుగాని
అనగ విలసిల్లు తపనోదయావసరము
నందు బాలేందుధరుని నిన్నధిక భక్తి
నిర్మలస్నానపూతుడై నిష్ఠ నెవడు
గొలుచువాడు ధన్యుండని తలతు దేవ!

ప్రాచీధరాధరరాజేశ్వరుని పత్ని
పట్టిన రత్నదీపంబనంగ
కోకారిపైనెక్కి మూక వారిజములు
పంపిన రాత్రి తపస్సనంగ
సోకు మూకల వెన్ను సూపజేసిన నాక
పతియందు సురలహారతి యనంగ
ఆబాలగోపాల మడరంగ నాలవా
లంబైన అగ్నిగోళంబనంగ

ఉదయగిరి నుండి పైకెక్కి ఉగ్రకిరణు
డించు కించుక అనుగు సాగించువేళ
పవలు రెండవజాము సంగవమునందు
నిన్ను బూజింప శివ! కరుణింపరావె!

ఊరకూరకయున్న ఊసరప్రదేశంబు
ఎండమావులతోడ నిండుకొనగ
భగ్గుమంచును రేగి పాదముల్ శిరమును
క్రింద మీదను మంటలెత్తుచుండ
శీఘ్రోదయంబులై స్వేదప్రవాహముల్
చర్మరంధ్రంబుల సందడింప
ఒక తీక్ష్ణదీధితి ఉష్ణవీధిపై నుండి
మించి కన్నుల మిరుమిట్లుగొలుప

చండభానుని దశదిశాజ్వలితకరము
లావరించిన మిట్టమధ్యాహ్న వేళ
నాలుగవసారి నిను ఫాలనయను భక్తి
సేవజేయంగవలదె కాంక్షిత విధాయి!

విసువక పనిచేసి విశ్రాంతి గోరెడి
జనములకొక వింత చల్లదనము
ఆటపాటలతోడ నలరారు బాలక
ప్రతతుల కొక మధురానుభూతి
గాలి మేయగ వచ్చి కాసేపువిహరించు
యువలోకమునకొక్క నవపదమ్ము
కామినీకచభాగ కలిత మంజులపుష్ప
సరములకొక క్రొత్తసౌరభమ్ము

అందఁజేయు సాయంసమయమ్మునందు
మనసు చలియింపఁబోని దీక్షనువహించి
బద్ధపద్మాసనుండయి ప్రజ్ఞతోడ
నిన్ను ధ్యానింపవలదె మౌనీంద్రవంద్య!

లోకమెల్లను ప్రశాంతాకారమై ఒక్క
నిశ్చల ప్రకృతిలో నిలుచువేళ
అఖిల ప్రజావళి అత్యంతనిద్రలో
పరవశులై సుఖమ్మరయువేళ
అక్కడక్కడ పురప్రాంతమ్ముల౯ భట
సాహో నినాదముల్ సాగువేళ
కీచురాళ్ళేవో సాగించు సవ్వడిమధ్య
ఆకులేని చలింపనట్టివేళ

తత్పరతతోడ అర్ధరాత్రంబునందు
మనసు వేరొకదానిపై మసలనీక
మరలిపోవని వ్రత సముద్ధురత వెలయ
ధ్యాన మొనరింప మెచ్చవే! హర! మహేశ!

వినుత పృథ్వీతత్వ మెసయువాడవటంచు
గంధంబునీయగా కరుణగనవె?
ఆకాశతత్వంబు నవధరింతువటంచు
సుమము లర్పింపగాఁ జూడరావె?
వాయుతత్వమ్ముతో భాసిల్లెదవటంచు
ధూపమీయగ ప్రేమఁ జూపరావె?
పరమ తేజస్తత్వ మొరయు వాడవటంచు
దీపమీయ తమస్సు నాపరావె?

అమృత నైవేద్యమున అమృతాత్మ నిన్ను
సర్వతత్వాత్మ సర్వోపచార పూజ
లాచరించి భజింప నత్యంతతృప్తి
భక్తులను రక్షసేయవే! ఫాలనయన!

మును నారదుడె తైలమును పాత్ర నిండుగాఁ
బోసి హస్తద్వయమ్మున నమర్చి
ఒక బిందువేనియు నొగి జారరాదంచు
పలికిన నేకాగ్రపరత నల్లై
అరిగెడి సమయాన ఆభగవంతుని
స్మరణమ్ము తానొక్క సారినైన
చేయగా జాలకపోయె నటంచొక
కథ చెప్పుదురు దానికల్ల నిజము

లట్టాలుంచి దాని అంతరార్థముజూడ
నిజమటంచు దోఁచు నిభృతఘోర
సంసరణమునందు సాగెడి జీవి–ని
న్నెప్పుడెడద తలచుటెట్టు లీశ!

తెలియక దూకిన యెలుక ఒక్కమ్రాడి
కుడితిలోపల తన్నుకొనెడి నటుల
సంసార పంకాన జనుడొక్క పర్యాయ
మేనియుఁ జిక్కెనా ఇంక వాడు
బయటఁ బడుటయన్న బ్రహ్మప్రయత్నమ్ము
గూర్చిన నేనియు కొన్నినాళ్లు
సాధ్యమ్ముగాదింక శరణమీవే యంచు
నిను మనసా నమ్ముకొనినగాని
అట్లు నమ్ముకొనెడునంత విశ్వాసమ్ము
నిలువఁబోదు నాకు నీపై యింత
కృపను జూపకున్న నెవరింక రక్షింతు
రెన్నినాళ్ళు గడచునేని రుద్ర!

జయ సదాశివ రుద్ర! జయ ఫాలలోచన!
జయ రుండమాలి! భీషణకపాలి!
జయ పితామహసరోజాతాక్షవందిత
పాదాంబుజాత! దేవాదిదేవ!
జయ భవానీనాథ! జయ జగత్కారణ!
కారణ కారణ! కాలకంఠ!
జయ మారసంహారి! జయ మహాభవదుఃఖ
పరిహారి! జయ మహేశ్వర! పురారి!
జయ మహాదేవ! హర! శర్వ! శాంతమూర్తి!
పశుపతి! త్రిశూలధారి! ఖట్వాంగపాణి!
శ్రితుడ నీకింక నాకర్మశేషమెల్ల
చెరిపి కరుణించి ప్రేమ రక్షింపవయ్య!

అఖిల లోకాతీతమైన మాయాస్వరూ
పంబు నెవ్వాఁడు గ్రహింపంగగలఁడు?
విశ్వవిజేతయౌ నీ కాముని విక్ర
మాట్టహాసము నెవ్వాఁడాపఁగలఁడు?
పటుతరాహంకారమై కృతిస్వాత్వంపు
ఘనఘోష నెవఁడరికట్టఁగలఁడు?
అధికారధనయౌవనాంధకారాంధ్యంబు
గుమత నెవ్వాఁడు తట్టుకోనఁగలండు?
యమమహిషఘంటికానినాదములుసోకి
వణకిపోవక యెవఁడు నిల్వంగఁగలఁడు?
ఇంచుకేనియు నీకృపావీక్షణంబు
సోకకుండిన లైంగికజ్యోతియుదయు!

లాలిత్యలావణ్యలాలసాలాలసా
లాలనాలాస్యైకలహరికలకు
మందారమాకందమాకందమారంద
మాధవీమాధవీమహిమములకు
కారుణ్యకళ్యాణకలకలాపకలాప
కామ్యకారణకలాకలనములకు
నవనవస్పందనానందనందానాగ
నాగనానానర్మనాదములకు
చిరవిచిత్రవిశిష్టవిశేషవిసర
విధవిలాసవికాసవివేకవినయ
విషయవిజ్ఞానవిన్యాసవిశయవిమల
వినుతికి నివేశమీశ! నీ వెలుగు నెంతొ

ఉద్యద్భుజారంభసద్యః పరీరంభ
సంపీడితాంగనా స్తన భరంబు
కించిత్ పరీహాస చంచత్ కపోల్లాస
కిలికించిత ప్రియాగళరవంబు
కాంత కేళీక్లాంతకాంతాపరిశ్రాంతి
శయ్యానిపాతనిశ్వాక్రమంబు
విరహాంతేవ్రతిపరిస్ఫురత్సాహసాధర
ప్రత్యగ్రచుంబనప్రథమసుఖంబు

అత్యుదాత్తప్రియంబు ప్రయత్నలబ్ధ
మధురమధుపానుభవము సామాన్యహాస్య
భావనారీతి నీభక్తి పారవశ్య
వైభవముముందు లెక్కయే ఫాలనేత్ర!

ఏకానుభావముల్ లోకానుభావముల్
శ్లోకానుభావముల్ వోలయుగాక
మధురమాకందముల్ ఘుఘురమాకందముల్
మధితమారందముల్ మలయుగాక
లలితసాహిత్యముల్ కలితసాహిత్యముల్
ఫలితసాంగత్యముల్ వరలుగాక
కాంతిరేఖాద్యుతుల్ క్రాంతిరేఖామతుల్
శాంతిశాఖాగతుల్ సాగుగాక

నాప్రణయభావనాచాలనమ్ములందు
నవనవోల్లాస పథజగన్నాథరథము
నడచునీవేళ దేవ! దృఙ్నర్తనములు
శ్రీమహితవర్తనములు వర్ధిల్లుగాక

సురగురుపతపణితో స్మరకేళిమొనరించె
శిష్యుడై చేరిన శశిరకరుడు
బ్రహ్మర్షి గాగ తపముచేయుచును మేన
కాకాంతతోఁగూడె కౌశికుండు
పగటివేళనె తాను తగులుగావించెను
దాశకన్యకతో పరాశరుండు
జడదారిజాబాలిపడతితో జతగూడె
కాముకుండౌచు నగస్త్యమౌని
గడ్డములు పెంచి జీర్ణించికనలికనలి
ఇనుపకచ్చడములు కట్టుకొనితపించి
నట్టివారె దుర్బలులైరటన్న దేవ!
కామమునుగెల్చువారు లోకమునఁగలరె?

శ్రీపుణ్యరాశితో గోపురాల్ కట్టింప
చక్కని దానముల్ సలుప లేను
నాల్గు దిక్కుల కీర్తి నడిపింపఁ జాలెడు
విశ్వవీరత్వాన వెలయలేను
ఏ అజంతాలును ఎల్లోరా గుహలును
శిల్ప సంపద నీకు చెక్కలేను.
కవితా ప్రపంచముల్ కదలించివేసెడి
గ్రంథసందోహముల్ వ్రాయలేను
దేహమున ప్రేమ వీడి నిర్మోహమైన
ఘోరతపమున సంతృప్తి కూర్పలేను
రక్తి వీడదు భక్తి నిల్పాదిక దేవ!
చేయుచున్నాడ అసమర్థజీవయాత్ర

ఏకాగ్రమైనాదుహృదయమ్ము దీపించి
దైవపథమ్ములు దాటునేని
సాధనాబల తీవ్రసంకల్పశక్తికి
భువనమ్ములు చలించిపోవునేని
ఉగ్రతపోజ్వాలకుడికి పోయితపించి
బ్రహ్మాండభాండముల్ పగులునేని.
నిష్ఠ తీరనివాంఛ నిట్టూర్పుగాడ్పులో
ధూమసాగ్నివల్లికల్ దూకునేని
ఎవనికోసరమీవు పర్వెత్తివత్తు
వాదరాబాదరాగ సురాళి పిలువ
అంతశక్తిలేకయెగాదెఅభవ! నిన్ను
ప్రేమ కరుణింపుమనుచు ప్రార్థించుటెల్ల

భూమిలోఁగల మహాపుణ్య తీర్థములెల్ల
తిరిగి సేవింపంగ దీప్తిలేదు
పుణ్యాత్ములౌ మహాపురుషవర్యులనెల్ల
కోరిపూజించెడి గుణములేదు
ఓయంచుపలుకునంచూరార పేర్గన్న
దేవతావళి గొల్చు దిటవులేదు
శుద్ధాంతరంగులౌ సిద్ధులు విచ్చేయ
ప్రార్థింప గలిగెడి భక్తిలేదు
ఎవనినేనియు లెక్కించు టెపుడులేదు
ఒకటి చేయుగ వలెనను ఊహగలుగ
మంచిచెడులంచునెంచి తర్కించి సుంత
వెనుక దీయుటయునులేదు విశ్వనాథ!

చేసిన వారికి చేసికొన్నంత మ
హాదేవ యంచు పల్కాడ వచ్చు
ఇప్పుడేమైనది యింక ముందుండె ము
న్నే పండగయంచు సాగవచ్చు
అనుభవింపక తప్పదల బ్రహ్మకైనను
చేసినదానికంచెన్న వచ్చు
తలవ్రాత తప్పింప తరముగాదెంతటి
మునివర్యునకునైన ననగవచ్చు
కాని నే నొప్పుకోను సుఖమ్మునకును
దుఃఖమునకును నీవె కూర్తువని నమ్మి
యున్నవారల కర్మము నొక్కపెట్ట
త్రోసివేసెదవంచు నందును మహేశ!

గాలిలో చేపలు కదలింపగావచ్చు
నీళ్ళలో వ్రాతలు నెమకవచ్చు
కుందేటికిం గూడ కొమ్ములు మొలిపించి
మించి జయమ్ము సాధించవచ్చు
ముక్కోటి ఆంధ్రులముందు ఒక్కమ్మడి
మొనసి ఔననుపించుకొనగవచ్చు
అఖిలభారతజాతి నైకమత్యముతోడ
నొకత్రాటిపై నిల్పి ఊపవచ్చు
అసలు సాధ్యమ్ముగాని కార్యమ్ములెన్నొ
పట్టుబట్టి సాధింపగ వచ్చుగాని
ఒక్కమనసు నించుకసేపు చిక్కబట్టి
నిలుపుటది కష్టమందును నీలకంఠ!

కొక్కొరోకోయంచు కూసి ఇంద్రుండట్లు
వెలిగించెనని కావ్యములు లిఖించి
గాధిపుత్రుని వంటి ఘనుడు మేనకఁగోరి
వలిగెనంచు పురాణములు వచించి
ఆ పరాశరు నంతి తాపసోత్తము డట్లు
తారాడెనంచు గ్రంథములు పలికి
తుదకు నీవును గూడ కనలిపోయితివంచు
దక్కన కొన్ని గాథలు రచించి
మా కవీశ్వరులే మహామహులనకైన
గుట్టు రట్టుగ కథ బైటఁ బెట్ట గలుగు
వారితో నెంత వాదైన వేయ కీతి
మెలగరాదంచు పలికెద న్మృత్యుజేత!

ఎవ్వాని ఆజ్ఞచే ఈ చరాచరకోటి
పుట్టుచు గిట్టుచు పుట్టుచుండు
ఎవ్వాని తలపుచే నీ యజాండములెల్ల
వ్యతిరేకగతిలేక వరలు చుండు
ఎవ్వాని ఊహచే నెల్ల దిక్పాలకుల్
తమ అధికారముల్ దాట బోరు
ఎవ్వాని మాటకై ఎదురుచూచుచు నుండు
ప్రమథ వ్రజంబు దుర్వారబలము
ఎవ్వడీ సర్వగోళంబు లెల్ల యెడల
నిండియుండు ననేకుడేకుండునగుచు
ఆతడవు నీవటంచు దేవాదిదేవ!
నమ్ముకొనియున్నవాడ మనస్సునందు.

నిజము నాలోచింప నీవు కానిది యేది ?
ఈ నీవు చేసిన సృష్టియందు
అన్నిటికినతీతుడై యుంటసత్యమ్ము
అన్నియునౌనసుటదియు నిజము
నిజమిన్ని రకములా నేను భావింపలే
నిన్ని విధమ్ముల భిన్నభిన్న
సత్యమ్ము లేదియో సత్యమొక్కటి యైన
నిజమనస్సున నచ్చునేది యదియె

అతడు భావించి ఆమార్గమనుసరించి
చేసుకోవచ్చు నిన్ను నపార మైన
నిష్ఠ గలిగిన నేరీతి నెంచె నేని
అట్లె నీవగు దేరవే అగ్నినేత్ర !

ఆవాహనము చేసి అర్ఘ్యంబు పాద్యంబు
నర్పించి అర్పించి అంబరమ్ము
యజ్ఞోపవీతమ్ము నభిషేకమునుభూష
ణంబులు కడుభక్తినమరచ జేసి
సంప్రదాయమ్ముగా శాస్త్రోక్తమార్గాన
కర్పూర కస్తూరికాది సురభి
శిద్రవ్యములను బిల్వాదులన్ గంధాక్ష
తాదికంబుల బహుళానుమోద

మల్లికామాలతీముఖాభ్యుల్ల సనము
పెంపుమీరంగ కర్మపదంపు మేర
నెవడు పూజించు వాడు నీహృదయభక్తు
డనుచు రక్షింపరావె శైలాధివాస!

చండదీధితినిండు ఎండవేళలలోన
        పంచాగ్ని మధ్యాన ప్రాఘినిలిచి
మేనుకొంకరవోవుమేటి శీతమునందు
        గొంతులోతు జలానగుపతెఁజూపి
ఒక్క పాదాంగుష్ఠముర్విపై మోపుంచి
        బాహుయుగమ్మును పైకినెత్తి
ప్రాకృతికములైన బాధలన్ని విధాల
        పైఁబడిన నలక్ష్యపరచివేసి

    ఒక్క వీరవ్రతమ్ముతో ఒక్కతీవ్ర
    తీవ్రతరదీక్షతో తీక్ష్ణదృష్టితోడ
    నిలిచి ఏకాగ్రబుద్ధితో నిన్దలంచి
    తపముసేయుతప్పకనత్తు వపుసు దేవ!

బలముతో నలరారువాని జీవన మొజీ
        వనమన్న బలహీను బ్రతుకుబ్రతుకె
బలములేకుండగ బ్రతుకుటకంటెను
        చచ్చుట మేలదిసత్యముగను
శక్తిసాధించుట జనునికర్తవ్యమ్ము
        అతితీవ్రమౌ దీక్షనందుకొనుట
మానవుడో వానిమనుగడకున్ మూల
        మది లేకయుండిన బ్రదికిగూడ

    చచ్చినట్టులెగాన ప్రజ్ఞానహృదయ
    వైభవోత్పన్నవిక్రమప్రథితభావ
    తాండవోదగ్రచండప్రచండకలన
    మర్త్యులకునీవె దేవ! లోకాధినాథ!

ఆత్మయన్న నదంచుఆత్మయన్ననిదంచు
బహుళవాదమ్ముల పద్ధతులను
తర్కించుచుందురు కర్కశహృదయాల
పండితుల్ వితతపాషండతతులు
సత్యమ్ము తెలియఁగాఁ జాలకనిత్యమ్ము
నెఱుగఁగాఁ జాలకసురియుచుందు
రావిచారణమన్న నంత తేలికయైన
విషయమ్మె? బ్రహ్మప్రవృద్ధమైన
జ్యోతిరుద్బుద్ధికారణ సుప్రసన్న
విప్రకృతవేద్యదూరనిర్విషయశూన్య
వాదభేదసీమోల్లంఘనాదరమ్ము
మసలవలెనిన్ను నెఱుగ నాత్మస్వరూప!

బ్రహ్మకు మరినింక బ్రహ్మమ్మునకు భేద
మెఱుగనివారు తా మెంచిచూడ
శివుని తత్త్వముగూర్చి చెప్పగబోవుట
హాస్యాస్పదమ్ముగ నలరకున్నె
త్రిజగద్విభుండు నతీతుండు నిత్యుండ
నిత్యుండు మానీంద్ర సత్యవాది
జహదజహల్లక్షణాహతేంద్రియాలోక
లౌకికదర్పభిద్రౌద్ర గుణుడు
గుణము లుండినయట్లుగ గోచరించు
నిత్య మాత్మస్వరూపుడౌ నిర్గుణుండు
అజరు డమరుండటంచు పల్కుటకును
కొంత యెఱుగంగవలయు నిన్ గూర్చి, అభవ!

చిత్రమ్ములుగఁదోచు చిత్రమ్ములన్నియు
చిత్రమ్ములంచు వచింపవలెను
లౌకికదృష్టికి నాకమ్ములుగఁదోచు
లోకమ్ము లట్లంచు ప్రాకలేను
దూరగాఁజూలసి దుర్వార దుర్గాల
నున్నది గొప్ప యంచుయిక లేను
ఊహాలకందని మోహాకారణములు
వికృతమ్ములని తీసివేయలేను

దుర్బలమనస్సు ధూర్తతా కప్పురమ్ము
ప్రకృతికిర్మిరితాకృతిప్రాతిహారి
కాధిలుబ్ధమ్ము ప్రాథమికానుభావ
వాసనాగమ్యమిది బోధపరపు మీశ!

మనుజులు చచ్చుట కననివారెవ్వరు
పుట్టినవారెల్ల గిట్టగలరు
ఆవిషయమ్మును అందరు నెరిగియు
తమ సంగతినిగూర్చి తలపరేల
చచ్చినవారిలో వచ్చినవారలు
లేరెవ్వరును భూతలిని మనుష్యు
లెరిగినంతటిలోన నిఁకవంటి యప్పుడు
ప్రతిమానవుడుగూడ భవములోన

నేదియో చేయవలెనంచు నెన్నొ ఎన్నొ
ఏవియోగూడి సాధింప నెంచుచుండు
శివశివ! మహేశ! యీమోహ సింధువునను
మునుగకుండఁగఁ జేయవె మ్రొక్కువాడ

మత విభేదము కులోన్మాదమ్ము వర్గవి
శేషమ్మునని కొన్ని చెప్పరాని
సాంఘభూతమ్ములు పట్టి పల్లాచ్చును
గాఢమ్ముగా నేటి మూఢజనుల
అవ్వి సామాన్యమ్ములైన పిశాచమ్ము
లట్లు మహామాంత్రికాళికేని
లొంగకున్నవి దేవ! లోహితలోచన!
అంగజభంగ! శూలాభిషంగ!

పసవునుండాల్చి నీవయి వత్తువేని
అంతకాకృతి కొంత పంపింతువేని
ఒక కిరణలేశమింత ఉజ్జ్రూగునేని
నిలుచు ధర్మమ్ము ధర్మసంధిప్రకల్ప!

మధురమంజులగంధమాతరిశ్వంబుల
నాసాప్రదేశ ముల్లాస మొంద
లలితసౌందర్యనిర్మలకాంతిరేఖకు
ప్రేక్షకావళులకు ప్రేమ మిగుల
ఆనందజగతీరసాలోక మందింప
గలగులాబికి ముండ్లు గలవటంచు
గ్రహియింపకయె మానఁగలమె సంతృప్తిగ
అనుభవింపక తరమౌనె! అట్లె

కవిత గల్గిన చోటనే కరణి నెన్ని
దుర్గుణములున్న నవియెల్ల ద్రోసిరాజు
చేసి రక్షింపవలయు నాశ్రితునిపైన
కరుణ వెలయించి దివ్యశృంగారమూర్తి!

శిశిరశిరశ్శృంగశృంగాటకమ్ములు
    శృంగారరంగవల్లికలు దీర్ప
శ్రీమద్రసానందశేఖరగ్లారేఖ
    మందాకినీమరున్మధువు లోలుక
కైవల్యఘంటికాఘుణఘుణత్కారంబు
    శివపదశ్రీపదశ్రీ వహింప
భుగభుగాయితభుజాభుజగఫూత్కారంబు
    అగ్రిమభ్రూవహ్ని ననుకరింప

లోకములనెల్ల కరుణావలోకనముల
ఆదరించుచు నుండు వామార్ధజాని
కర్ధశశిమౌళి కమృతవాగర్ఘదాయి
కంజలించెద దేవ! నీ కధికభక్తి–

సంప్రదాయము ఋషిచ్ఛందోవిధానమ్ము
    శక్తి, కీలకము, బీజమ్మెరింగి
పటుతరనిష్ఠావిభాసుర మార్గాన
    మహిత షడక్షరీమంత్ర మెరిగి
గురుపరంపరలోని పరమదీక్ష గ్రహించి
    శాస్త్రోక్త భావన సంతరించి
ఏకాంతమందు లోకైకనాథుని నిన్ను
    ఫణిరాజభూషణు ఫాలనయను

భక్తిజపియించి ధ్యానసంయుక్తితోడ
ఎవడు వహియించు ఘనతపోహేతు పథము
వానికి మనస్సులోపలి వాంఛలెల్ల
తీర్పగారావె? దేవ! సర్వార్పకునకు*

* శివోపాసనా ప్రారంభకుల సౌకర్యార్థము పై పద్యములో

భావింపఁబడిన దాని వివరణము ప్రమాణపూర్వకముగా నొసంగఁబడు చున్నది –

## షడక్షరవిచారః

షడక్షరం ప్రవక్ష్యామి సమాసేనసుశోభనం
యేనసంసారవిచ్ఛిత్తిర్బ్రహ్మేంద్రాదివిభూతయః

ఋషిర్బ్రహ్మాస్యమంత్రస్య గాయత్రంఛందఉచ్యతే
దేవతాస్యశివస్సాక్షాత్ సత్యజ్ఞానసుఖాద్వయః

శక్తిర్మాహేశ్వరీసాచ భువనేశాక్షరం భవేత్
బీజంమాయావిశిష్టస్తు శివః పూర్వోక్తలక్షణః

సోపితచ్ఛబ్దవస్యాన్న్యాసః పంచాక్షరైః క్రమాత్
అంగుష్ఠాదికనిష్ఠాంతంవిన్యసే దక్షరంక్రమాత్

మస్తకేచలలాటేచ హృదినాభౌపదద్వయే
పునః పంచాక్షరైశ్చైవ పంచాంగం విన్యసేత్క్రమాత్

ప్రణవం ప్రథమం విద్యాత్ ద్వితీయంతు నకారకం
మకారం తత్పరం విద్యాత్ శికారంతు తతఃపరం

వకారం పంచమం విద్యాద్యకారం షష్ఠమేవచ
ఇత్థం షడక్షరం విద్యాజ్జాబా లోపనిషద్గతం
మంత్రస్సాంగస్సమాఖ్యాతో మంత్రార్థః కథ్యతేఽధునా
సత్యజ్ఞాన పరానంద స్వరూపస్య శివస్యతు

అసంపృక్త్యా శివస్యాయం శివశబ్దస్తువాచకః
నమశ్శబ్దో నమస్కారవాచకః పరికీర్తితః

ప్రహ్వాతాలక్షణః ప్రోక్తో నమస్కారః పురాతనైః
ప్రహ్వాతానామ జీవస్య శివాత్మత్వాది లక్షణాత్

భేదేన భాసమానస్య మాయయా న స్వరూపతః
సంబంధ ఏవ తేనైవ సోఽపి తాదాత్మ్యలక్షణః

నిత్యసిద్ధ శ్శివస్యాపా త్స్వరూప స్సర్వ దేహినాం
తస్మా ద్బుభుత్సో ర్జీవస్య నోపాదేయం హితం సదా

నహేయ మహితం తద్వద్వస్తుతో న ప్రతీతితః
ఏవం విద్యాన్నకారార్థం మకారార్థ ఉదీర్యతే

మకారో మమశబ్దార్థో లుప్తస్త్వేకో మకారకః
వ్యావహారికదృష్ట్యాయం నమస్కారః ప్రకీర్త్యతే

తస్మా చ్చతుర్థీశబ్దస్తు ప్రోచ్యతే సహవస్తుతః
ఓంకారశబ్ద స్సర్వార్థవాచకః పరికీర్తితః

ప్రయోగాదేవ సర్వత్ర సర్వార్థశ్శివ ఏవహి
తస్మాచ్ఛివస్య పూర్ణస్య ప్రణవో వాచకస్స్మృతః

వాచ్యవాచకభావశ్చ లక్ష్యలక్షణతాపిచ
అన్యోన్యతాపి నాస్త్యేవ పరమార్థనిరూపణే

అభావాదేవసర్వస్య శివాదన్యస్య సర్వదా
అస్తి నాస్తి మృషాభాతి నభాతీత్యాది మాయయా

కల్పితం చిత్సుఖానంత పరమాత్మ శివాత్మని
మాయాతత్కార్య మప్యస్మాచ్ఛివా త్సత్యాదిలక్షణాత్

ప్రత్యక్ష సిద్ధాన్నాస్త్యేవ పరమార్థనిరూపణే
అథకింబహు నోక్తేన శివాదన్యన్న విద్యతే

శివస్వరూపమేవాహురిదం సర్వం విచక్షణాః
సర్వస్వరూప మజ్ఞానాద్దృశ్యతే నతు వస్తుతః
ఏష ఏవహిమంత్రార్థః సత్యం సత్యం నచాన్యథా
వేదాస్సర్వే పురాణాని స్మృతయో భారతంతథా

అన్యాన్యపి చశాస్త్రాణి తథాతర్కాశ్చ సర్వశః
శైవాగమాశ్చవివిధా ఆగమా వైష్ణవా అపి

అన్యాగమాశ్చ విదుషా మనుభూతి స్తథైవచ
అస్మిన్నర్థే స్వసంవేద్యే పర్యవస్యన్తి నాన్యథా

బాధ్యబాధకతాం యాంతి వ్యవహారే పరస్పరం
సముద్ర ఇవకల్లోలా ఇతివేదార్థ సంగ్రహః

మంత్రార్థః కథితః కృత్స్నః పురశ్చర్యాధునోచ్యతే
ఆచార్యముఖతో మంత్రం జ్ఞాత్వాసార్థం సమాహితః

యథాశక్తిధనం తస్మై ప్రదత్వాతదనుజ్ఞయా
స్నానంత్రిషవణంకృత్వా భస్మనా శాకభోజనః

ఫలమూలాశనోవాపి హవిష్యాశీ యథాబలం
పర్వతాగ్రే నదీతీరే నాగరాంతే శివాలయే

వనేవానిర్భయేశుద్ధే ప్రాఙ్ముఖోదఙ్ముఖోఽపివా
సమాహితమనాభూత్వా సుఖమాసనమాస్థితః

ప్రాణాయామత్రయంకృత్వా మునింఛంద స్తథైవచ
దేవతాంచతథాశక్తిం బీజంస్మృత్వామనోరపి

కరన్యాసంపునః కృత్వాతథాంగన్యాసమేవచ
పంచాంగమపివిన్యస్య గురుంస్మృత్వాభివంద్యచ

హృత్పుండరీకమధ్యేతు సోమసూర్యాగ్ని మండలే
విద్యుల్లేఖేవకళ్యాణం జ్వలంతం వహ్నిరూపిణం
శివంధ్యాత్వాజపేన్మంత్రం లక్షాణాంషట్ సమాహితః
తర్పయేల్లక్షమేకంతు జుహుయాత్తు సహస్రకం

ఆజ్యేనపయసావాపి పలాశకుసుమేనవా
తతస్సిధ్యతిమంత్రోఽ స్యభుక్తిముక్తి ఫలప్రదః

అధవాసాంబమీశానం శ్రీసదాశివమేవచ
నృత్యమానంతధా దేవం ధ్యాత్వామంత్రంతు సాధయేత్

అధవాప్రాకృతంభావం స్వీయముత్సృజ్యసర్వదా
శివో ఽ హమితిసంచింత్య సాధయేదిదముత్తమం

మంత్రస్యసాధనం ప్రోక్తంవినియోగః ప్రకీర్త్యతే
నిత్యంద్వాదశసాహస్రం జపేద్భక్త్యాసమాహితః

సమ్యగ్ జ్ఞానప్లవం లబ్ధ్వాసంసారాబ్ధిం తరిష్యతి
లక్షపంచాశతం జప్త్వా కారణేశ్వర మాప్నుయాత్

లక్షాణాంతుశతం జప్త్వా సాక్షాద్రుద్రత్వ మాప్నుయాత్
అశీతిలక్షం జప్త్వాతు నరో విష్ణుత్వ మాప్నుయాత్

షష్టిలక్ష జపేనైవ లభతే బ్రహ్మణః పదం
చత్వారింశతిభిర్లక్షై ర్వారాజాత్మ్యన మాప్నుయాత్

వింశల్లక్ష జపేనైవ దీర్ఘమాయురవాప్నుయాత్
షట్కర్మాణి ప్రసిధ్యన్తి దశలక్షజపేనతు

వినియోగస్సమాఖ్యాతః పూజా దేవస్య కీర్త్యతే
హృత్పద్మకర్ణికామధ్యే మంత్రేణానేనపూజయేత్

అధవా మండలేసారే చంద్రమండలకేఽధవా
అగ్నౌవాప్రతిమాయాంవా శివం నిత్యం ప్రపూజయేత్

ఆసనంప్రధమందద్యా దావాహన మనంతరం
అర్ఘ్యంతతః పరందద్యాత్పాద్యం చైవతతః పరం

పునరాచమనం దద్యాత్ స్నాపయేత్తుతతః పరం
వాసోదద్యాత్పునర్యజ్ఞోపవీతం భూషణానిచ

గంధంపుష్పం తధా ధూపం దీపమోదనమేవచ
మాల్యమాలేపనం దద్యా న్నమస్కృత్య విసర్జయేత్

ఓమ్‌నమయని యేపరమున
కామ్నాయము లెల్లమ్రొక్కు అతెడవు మద్వా
గమ్నిచితద్వ్యమ్నయశో
నిమ్నగ కమృతత్వసిద్ధి నీయవె దేవా!

కలలోపలి కలలో వె
న్నెలలో ఒక చిత్రమైన నింగుదనములో
వెలసిన వెలుగువు నీవని
తలపోసెద గుండెలోన, తాల్చెదనుశివా!

---

షడక్షరేణ మంత్రేణ సర్వం కుర్యాద్విచక్షణః
హృత్పద్మ కర్ణికామధ్యాత్కుర్యాదావాహనం బుధః

ఉద్వాసనంచ తత్రైవనరః కుర్యాత్సమాహితః
సర్వముక్తం సమాసేన నరాణాం భుక్తిముక్తయే

తస్మాత్సర్వం పరిత్యజ్య షడక్షరపరోభవేత్
షడక్షరేణ సర్వాణి సిధ్యంత్యేవ నసంశయః

ఇతి శ్రీ స్కాందపురాణే సూతసంహితాయాం చతుర్థే
యజ్ఞవైభవ ఖండే షడక్షరవివరణం నామాష్టమోఽధ్యాయః

పైన చెప్పినరీతినేకాక ఋషిచ్ఛందోమార్గములలోసంప్రదాయభేదములు కలవు. కొన్ని గురుపరంపరలలో అనుష్టుప్, పంక్తి ఛందస్సులుగను, వామదేవుడు ఋషిగను చెప్పుటకలదు. ఇవేవియులేక

'ఋష్యాది సంకీర్తన మేషుమాస్తు
కరాంగ విన్యాస విధిశ్చమాస్తు
మూర్తిం యథోక్తాముత దివ్యతత్వాం
ధ్యాత్వాజపేత్ సిద్ధిరసంశయస్స్యాత్'

అన్నమార్గమును అనుసరించుటయు కలదు. ఏది ఎట్లైనను గురూపదిష్ట ప్రకారము చేయుట ఉత్తమము.

ధార్మికదృష్టి స్ఫురణము
మార్మికతాజ్ఞానగతికి మార్గమ్మనియో
అర్మిలి నొకప్పుడుందువు
నర్మస్ఫూర్తి యిది వింతనటనము దేవా!

కార్పణ్యము గలిగినచో
దర్పము నశియించుటెట్లు? తగ్గక సర్వం
బర్పించుటెట్లు కావున
కర్పూరమువోలె బ్రతుకుకాల్పవలెశివా!

నిష్ఠాభావమ్మురలిన
సుష్ఠుత్వము కలుగవచ్చు శోభితధర్మా
ధిష్ఠానశాంతిపురుష
శ్రేష్ఠత్వము మాకు దూరచిహ్నము దేవా!

కష్టపడి సమార్జించిన
కృష్టముగాకుండు నొక్క కేవలతాసం
తుష్టికి మానవజాతి
యేష్టమ్ములు పనికిరావయేమి? మహేశా!

బ్రాహ్మీభూతి వచో ఽ గ్రా
జిహ్మాగసంతాడ్యమానచిత్తవికార
బ్రహ్మాణ్య పాలనమ్మిది
బ్రహ్మను రక్షించునంతపని విశ్వేశా!

విశ్వేశుడవీవను నొక
విశ్వాసమ్ముండబట్టి విన్యాసవిశే
షాశ్వము తనవల్గనముల
శాశ్వతపదవికిని జేరసాగు మహేశా!

ఈ వింత వింతమైనటి
జీవికి తన జన్మలందు స్మృతి విస్మృతివగా
కావంత చింత లేనటు
లీవుందువుపిలిచి పిలిచి యిక్లైతి శివా!

శివ శివ రుద్రాయనుచున్
భువనమ్ములు మారుమ్రోగ పూర్ణ గళముతో
స్తవ మొనరించినగానీ
కవులకునుఁగానుపడదుగమనము స్వామీ!

అకటావికటపుమార్గ
మ్మకటా పిలువంగజాలనన్యోన్యతకున్
వికృతార్థములు చెప్పుచు
వికలమ్మొనరించె హృదయమవి స్మృతి దేవా!

ఏకత్వము కన్నులలో
లోకాతీతప్రభావలోచనసుమహః
ప్రాకారమ్మాకార
స్వీకృతిలో నిలుచునెపుడు చెప్పవె దేవా!

దేవా! నీ పదపీఠిక
ఆవాసముఁ జేయువాడ నని నిత్యమ్ముఁ
భావించుట యెందుల కది
నీవెరుగని యదియు గాదు నిజము మహేశా!

అజ్ఞాన తిమిరవాద మ
భిజ్ఞుల హృదయాంతరముల ప్రేరేపింపన్
విజ్ఞాన కాంతి యని కిం
చిజ్ఞుని మోసమ్ముఁజేయ చెలగిరి దేవా!

హృదయములో నొక వేదన
హృదయము వెలుపల మరొక్క హేతువు దెలుపన్
పొదలని వేదన యెవరికి
ఇది యింత నివేదనమ్ము నెంచెదను శివా!

భావన లోపలి భావన
భావించు విశిష్టమైన భావన ద్వైధీ
భావము చెందకమునుపే
భావింపవె దేవ! ఒక్క వరభావంబున్

ఖేదము మోదమ్ములలో
నేదైన సహింవరానిదే ఆధిక్యా
పాదితమై అత్యంత
ప్రాదుర్భావమున వెల్లివారిన స్వామీ!

తెరమీద బొమ్మపోలిక
నరనిముసముసేపు వెలిగి ఆరెడి దీపం
బసుదైన వింత వేసపు
బురఖా ధరియింప మెచ్చుఁబోలునె దేవా!

గోచీపెట్టిన దాడిగ
కాచాకట్టినది ఆదిగా నొకవరవి
ద్యాచార్యుడైన వానిన్
వేచీలో దింపు జనుడు నేడు మహేశా!

అనుభవమును అభ్యాసము
అనన్యకృషి తీవ్రమైన ఆకర్షణ ఇ
న్నిని గల్గికూడ మనుజుడు
కనడు యశమ్మండ లేక గజచర్మధరా!

వాదప్రతివాదములకు
నా దృష్టి చనంగఁబోదు నైర్మల్యము నే
మోదించు నా యెడందకు
కాదగదే? యింత శాంతి కల్పన దేవా!

శాంతికి కాంతికి మరి వి
శ్రాంతికి విక్రాంతికిన్ పరంతపమై అ
శ్రాంతమ్మదో యొక వ్యథ
అంతు తెలియరాక వచ్చె ఆగదె స్వామీ!

ఏనాటికి వచ్చునో నా
కానతరాసిక్యలోకహార్యక్షుత్వ
ప్రాణానిలచాలనగతి
ఆనాటికి నాదు బ్రతుకు సార్థకము శివా!

జీవితమొక వెన్నెలమై
జీవించిన చోటు లెల్ల చిత్రవిచిత్ర
ప్రావరణాదిమమానవ
దైవత్వప్రాభవమున తరలునె దేవా!

ధౌరంధర్యము ధార్మిక
పారంపర్యమ్ము కాంతిపౌనఃపున్య
శ్రీరంజనపారమ్య
ప్రారంభోత్సవము నాకు వరలునె దేవా!

వచ్చిన దాక చిరు కెరటము
తెచ్చిన దాక విలువమైన దివ్యత్వము – నీ
విచ్చినదా తనకు తానే
విచ్చినదో అచ్చుబాటు వెలసెను స్వామీ!

నావలె నెవ్వారుందురు
నీ వెలుగును నమ్ముకొన్న నిర్మాతలిలన్
నీవందుకైన నన్నున్
కావంగా నడుము కట్టగావలె దేవా!

భావించెద! భావించెద!
భావించెద నెన్నినాళ్ళు? బ్రతికి చెడినదై
భావనలోపలి భావన
భావింపదు నేను దివ్యభావన దేవా!

ఊహాపోహాలలోపల
మోహావిమోహములలోన ముగ్ధవికాస
శ్రీహాస రేఖికాభ్యూప
గూహనమును కోరు దేనికొరకు మహేశా!

సుఖమున్నది సుఖమున్నది
సుఖముండిన చోటనెల్ల సుఖమున్నది – ఆ
సుఖమన్న దించుకైనన్
నఖాగ్రమునెప్పుడైన నందునె స్వామీ!

సుఖమున కానందమునకు
అఖాతమంతటి విభేదములరు నటంచున్
శిఖరిసములు కొందరనిరి
అఖండ మేదైన బాగునాశింతు శివా!

ఖండీభవ దానంద
మ్ముండిననే ముండకున్న నూడిననేమీ?
కండగల తెనుగు పోలిక
చెండాడన్ వలదె అమృత సింధువులుశివా!

ఎన్నాళ్ళని రాకుండావు
ఎన్నాళ్ళని దాగుకొందువే చూచెద నీ
విన్నాణము నీ భావ
మ్మెన్నాళ్ళకు మారకుండునేమి? మహేశా!

కల్లోలము చేసెడి నా
భల్లూకపు పట్టు నిన్ను వదలదు ఎన్నా
ళ్ళల్లి బిల్లి ఆడెద
వల్లెద వలనొకటి నిన్ను అందుకొన శివా!

తల్లి తండ్రి యనుచున్
చెల్లా చెదరైన తలపు చేరిచి పిలువన్
మళ్ళి పలుక వొక్కించుక
హల్లీసక మేమి? కవ్వులయందు మహేశా!

కల్లకపటమ్ము లెరుగని
యిల్లాండ్రను మానిసతుల నెదొ చేయుటయా?
ఒల్లని మనువో యియ్యది
ఎల్లి పరీక్షింతు నెట్టు లేలవొ? స్వామీ!

బలవంతము చేసినదని
అలుసైనదొ నాదుబ్రాహ్మణార్థము విద్యా
విలసితవిద్యుద్వల్లీ
కళాకలనమిది ఎపుడు కాంతువొ స్వామీ!

దిక్కుల లోపలమ్రోగిన
ధిక్కారము మార్చ లేదు దృఢనిశ్చయమున్
చిక్కవలె చిలుకపోలిక
ద్రాక్కృతి నాహృదయపంజరమున మహేశా!

అర్థులయిన విద్యార్థులు
దుర్ధీదోషములతోడ తూగిరి యిచటన్
వ్యర్థులయిన వీరలకున్
స్వార్థత్యాగమ్మొకింత సాగదొ స్వామీ!

ప్రద్వేషపరీతులై
విద్వాంసులు తామునిత్యవిద్యార్థులమన్
సద్భావపూర్ణ సత్య
మ్మద్వేష్టితధర్మమొప్పరొకొ? మహేశా!

మారును కాలపరిస్థితి
మారినకాలంబుబట్టి మారునుజగతిన్
సారాసార వివేక
శ్రీరమ్యత — కాలమెంత చిత్రముస్వామీ!

దేశము — కాలము — కలఆ
వేశము — నైజము — స్వభావవిస్మృతవిధాన
క్లేశమ్మిటులెన్నింటికొ
దేశికుడో దేవ! లొంగితీరగవలెనే?

తప్పొప్పులు పరికింపక
తప్పించుకొనంగవలెనె? ద్రవ్యాధికృతిన్
మెప్పింపనాపవలెనే
చప్పునఘనతారతమ్యచర్చ — మహేశా!

గొప్పలు మాటలలోనే
గొప్పదనమ్మింతచేతకున్ రాదుగదా
చెప్పెడుదానికి చేసెడు
నప్పనికిన్ భేదమింతయగునె మహేశా!

నల్లనివన్నియునీళ్ళో
తెల్లనివన్నియునుపాలా? దేనికిమనుజుం
డిల్లిల్లుతిరుగు శక్తికి-
ఒల్లనియిల్లాలువచ్చి ఒగ్గునో దేవా!

ఎక్కడనున్నది ధర్మ
మ్మెక్కడనున్నయది నీతి? ఎక్కడన్యాయ
మ్మెక్కడకయ్యా లోకము
చక్కగ గమియించు? పలుకఁజాలవో దేవా!

శాంతిస్థాపనకోస
మ్మంతస్థులనుండి దిగిన ఆచార్యునకున్
అంతయు గందరగోళమె
చింతాకంతయును వెలుగు చిక్కదుస్వామీ!

చక్కనిదని ఏదోఒక
చిక్కనిదానికయి చిమ్మచీకటులందున్
లెక్కింపబోడు కష్ట
న్యక్కారము - ప్రకృతివింతమైనది స్వామీ!

ఆదరమును జూపించెడి
శ్రీ దరహాస ప్రసన్న సీమంతమ్ముల్
ప్రాదుర్భావమ్మైనన్
చేదుకొనన్ రావె చైత్త సిద్ధులు స్వామీ!

వీరత్వము కలిగిన-చో
కారుణ్యమ్ముండఁబోదో కంజాత పరా
గారంభ రాగమార్దవ
సీరాకర్షణము చింత చేకొను దేవా!

ఒక్కఁడు పైపై చూచును
ఒక్కఁడు లోతులకుఁ జూచు ఊహాలు లేకే
ఒక్కఁడల శాంభవీ స
మ్యక్కాంతి విశిష్టముద్ర నలరఁడో దేవా!

సముదంచిత ఖేచరిలో
నమృతస్రావమ్ము నాకు నందక పోనీ
ప్రమదంబున జిహ్వాగ్రము
విమలశివానందలహరి వినుచుతి దేవా!

అగ్రాహ్యామృత కోటికి
ప్రగ్రాహము నాదుగుండె పగులునొ గానీ!
జాగ్రదిరమ్మద రేఖా
ప్రగ్రీవమ్మైన లేదు బాధ మహేశా!

బాధాసాధమ్ములలో
ఆధారములేని నిశ్చయాకాశములో
బోధ యెఱుంగక ఒక రస
మాధురికై ముందుచూపు మానును స్వామీ!

ముందు వెనుకలను చూడదు
అందరికిది అందఁగలదొ అందదొ యంచున్
సందేహమ్మించుకయును
చెందదు గమియించు నిది విశిష్టత స్వామీ!

నిర్మల భావాంబరములు
దుర్మతుల కొంకించుకైన తోచవటంచున్
ధార్మికు లెఱుగుదు రున్నత
మర్మజ్ఞులు మాకు తెలియు మార్గమొ దేవా!

ఈ యంతులేని సృష్టికి
వేయింతలు నీదు ప్రతిభ – విజ్ఞాన మహః
ప్రాయత్త వీచికాంగణ
ధీయుక్తి మహోక్తి వెలుగు దీర్చదె దేవా!

దైవాధీనము సర్వము
దేవునిదే భారమంచు దీపము గాలిన్
దీవింప నుంచఁ బోవను
చావంగా కాళ్ళు బారఁజాపను స్వామీ!

సడలని ఒక నిశ్చయమున
నడువంగా నెంతు నట్ట నడిసంభ్రమములో
కుడియెడమలు వీక్షింపను
గోడవేమియు లేదు నిన్ను కోరితి నీశా!

బెల్లము కొట్టిన రాయిగ
ఉల్లము చలియింప కుండ నుందువె కానీ
ఇల్లలికిన పండుగయే
అల్లాటప్పాగ విడుతునా? నిను స్వామీ!

నీ యంతును కనుగొనగా
నా యఖిలము ధారవోతు నవనాడులలో
ప్రాయమ్ముండినదాకను
చేయుదు నే తపము కోర్కె సిద్ధింప శివా!

ఆర్చెదవో తీర్చెదవో
అర్చిష్మదుదార నేత్రమండలి భావ
మ్మర్చించెడి నాకొరకై
తీర్చెదవో లేనా క్రొత్త తేకువ దేవా!

ఇదియె — నిదిధ్యాసమ్మని
విదలింపఁగ బోను విబుధవిష్ణువులను నీ
వెది నాయెడంద లోపల
ఉదయింపగ జేతు వదియె ఊహింతు శివా!

ప్రాతదియో క్రొత్తదియో
చేతమ్ముల అడుగులందు చివికినదో నా
చేతికి దొరకిన చాలును
జ్యోతి ఒకటి దాని అంతు చూడనె దేవా!

కృత్స్నాకాశ మనోజ్ఞ
జ్యోత్స్నా సౌందర్య తనువు చూపింపక నీ
హృత్స్నేహ మెంతకాలము
మృత్స్నాగతి చెందమందు వీశ! మహేశా!

ఇచ్ఛాశక్తికి మించిన
తుచ్ఛస్వైరప్రవృత్తి త్రోయక యున్నన్
స్వచ్ఛందచ్ఛందశ్శ్రీ
గచ్ఛత్ కావ్యమ్ము నిన్నె కల్పించు శివా!

ఈస్నేహము బంధించిన
సుస్నిగ్ధ ప్రకృతి — వికృత చోద్యములోనన్
ప్రస్నాపిత మైనప్పుడు
త్రస్నుత్వము కళలకెల్ల రాదో మహేశా!

రాకడలో నామంజ
స్సాకారము పోకడకును అబ్బినచో నీ
లోకములోపలి జనమిక
ఆకాంక్షింపంగ నేమి యలరును దేవా!

మానవులు వాన రాకడ
ప్రాణము పోకడయు తెలియవచ్చునె యనుచున్
మానితముగ వచియించిరి
ఆనైజము నిజమె? ఋషుల యందు మహేశా!

ఒకవేళ కొన్ని నిజములు
ఒకవేళ నబద్ధములుగ నూహింపఁ దగున్
ఎకిమీఁడైన మనీషికి
ప్రకటింపగ బడదె వీని పద్ధతి దేవా!

నాకుంగల సందేహము
లీ కల్పమునందు గాని యింకన్ మరి వే
రే కల్పమందుగానీ
ప్రాకటముగ తీర్చువాఁడు వచ్చునె దేవా!

ఏలా ఎంతగ చెప్పిన
చాలకమిగిలినవి ధర్మసందేహంబుల్
చాలింపు మందువోలే
కాలంబమునింత యిత్తునందువొ స్వామీ!

పలికించెడు వాఁడొక్కఁడు
పలికెడివాఁడొక్కఁడనుచు పలికినవాక్య
మ్ములలోపలి సత్యమ్మది
అలవడునే నాకు మంగళాకృతి దేవా!

తావున్నది భేదమతి
ప్రావరణము దానిఁబట్టి పలుకురచింపన్
గావలెనిప్పుడు చక్కని
త్రోవలనన్యమ్ముగాగ తోఁచదో దేవా!

సేవాంఛింతు నభిన్నత
నీవిత్త్వవరములన్న నిర్మాణకళా
ప్రావీణ్యా విపులమాయా
సేవధిమగ్నతను ఇట్లుచేతువె దేవా!

పల్లమ్మున కేగెడియీ
చెల్లాటము నిన్నినాళ్ళు చేతనయినట్టుల్
త్రుళ్ళింతలాడ నిచ్చితి
చెల్లదునీమోసమింక శివ! దేవవిభూ!

కొండలపైనుండి మహో
ద్దండముగా వచ్చుచున్న దైవతివేణీ
చండప్రచండకవితా
శుండాలము నెవ్వరడ్డఁజూతురుస్వామీ!

దండుగయో పండుగయో
ఉండినమిషచేత నొకటి ఊహించితివా
దండితనమునకు నేనియు
కొండొకచో కొంతమెచ్చుగాంచెదె స్వామీ!

నీప్రభుతయు నీవుంటివి
నాప్రథమప్రయత్నమునకు నాందిపలికితిన్
నీప్రమథులు నీశివయును
సుప్రభవీక్షింప కదపఁజూతువె స్వామీ!

ఈస్వాతంత్ర్యమహోదయ
మీస్వాగతకరణకిరణహేలాలాస్య
ప్రస్వేదమాలికాదర
నిస్వనకంకణరవమ్ము నినుగోరుశివా!

గోరంతలు కొండంతలు
గా రాక్షసకృత్యములను కల్పించుమహా
దారుణ మాయావర్ణన
కారంభమువలదు సైపనయ్యామహేశా!

కొండంతటి దేవుడవని
కొండంతటి ప్రతితోడఁగొలువఁగ నాకుఁ
కొండంతకోర్కె ఉన్నది
కొండాడెదవో మరెట్లు కులుకుదువో శివా!

కొంచెతనమ్మున్నది నీ
దంటతనమ్మునకు సంతతమ్మిచ్చోటన్
జంటను వీడని నీ వెలు
గంటించుకొనంగ వ్యర్థయత్నమిది శివా!

దాగుడుమూతలనాడుచు
భోగముకొంపలను ప్రొద్దుపుచ్చెడి మనసే
ఆగమములు వల్లించును
యాగమ్ములుసేయు నెంత అచ్చెరువు శివా!

నిష్ఠాగతిలేకుండిన
శ్రేష్ఠాచరణమ్ము ఫలముచెందునె యనుచున్
సుష్ఠు విచారము రావణ
కాష్ఠముగా నాయెడంద కాలును దేవా!

గోష్ఠీసుందర ధర్మా
నుష్ఠాన పరిష్క్రియాద్యనుస్యూతతపోఽ
ధిష్ఠాసవర్గసువచో
నిష్ఠీవనములకు మనసు నిభృతము స్వామీ!

రయధావదశ్వవల్గన
భయకృత్ఖురధూళినిబిడపటుతుత్కార
స్మయవిస్మయసంకలన
మ్మయియున్నది నేటిజగతియంతయు దేవా!

ఈరాజకీయవాద
మ్మారంభించినది సృష్టియాదినొ యేమో
దూరముగా దెన్నటికి దు
మారమువలెలేచి కలచు మనుగడను శివా!

ధుర్యుల ధౌరంధర్యము
కార్యాకార్యములలోని కలుషాకలుష
స్థైర్యమ్మునువీక్షింపక
ఆర్యతఒక్కటి నటించుటయ్యెను స్వామీ!

నటనము లోకమ్మంతయు
నటనములో నొక్కచో ననవ్యతయున్నన్
కుటిలులు పిసాళమాడెద
రటునిటు నూపెడు ఘోరమయ్యె! మహేశా!

మంచిని గ్రహింపలేనిది
కాంచనకాంతాప్రలుబ్ధకౌటిల్యవిభా
వాంచితము వంచితమ్మై
పొంచిమెలగు నేటి లోకమునతీరు శివా!

శంకా సంకుచితులకు న
డంకువయే కంటకాగడాల వెదకినన్
కింకరతనొంపదందురు
పంకములో గాదెపుట్టె పద్మము దేవా!

చర్చలకందని చివరల
కూర్చుందువు వింత కోతికొమ్మచ్చులతో
అర్చకుల చేతికందవు
మార్చెదు వేసములు నెట్లు మసలుటిక శివా!

కొండకోనల నీవలెనే
గుండె బెదరకుఁడుగాని కొట్టకొసకు నే
యెండకు నాగొడుగూనెడి
దండితనములేక జంకు దాల్చెదను శివా!

మృదువైన నీహృదబ్జ
మ్మొదవునుపదునైన అసిగ ఒకసమయమునన్
అదియే నీకును నాకును
మెదలెడిభేదమ్ము శక్తి మేదురత శివా!

తుది మొదలు లేని వెదకుట
ఇది యుగముల పాటు సాగ ఇంక సహింపన్
మది సృష్టికి ప్రతిసృష్టిని
కదలింపగ నెంచు నాదుకవిత మహేశా!

ఇది ఒక్క ఘోరతపమై
చదలంటినదాక నీదు చల్లని చూపుల్
కదల విటువైపు నేచూ
చెదగాకిది యెన్నినాళ్ళు చెల్లునో దేవా!

ఈ జన్మలోపలనె నీ
తేజము పొందవలె నట్లు తేలేకున్నన్
గాజులు తొడిగించుకొను ప
రాజిత ముఖములకు మరల రారాదు శివా!

ఇప్పుడు గాకుండినచో
చెప్పుము మరి యెపుడు నాకు సిద్ధింతువో నే
నెప్పటికిని నిను వదలను
అప్పటికే వేచియుందు నార్తిని దేవా!

ధూర్తత్వముతో నుండిన
కీర్తిని హరియింతు సుమ్ము కేవలవాక్య
మ్మార్తత్రాణకరణవి
స్ఫూర్తి యనుచు దిశల నన్ను చూపింతు శివా!

బెదరించుచున్న వాడని
మదిలో దలపకుము మంచి మాటలతోఁ బెన్
గుదుపక యుండుటచే నే
నిది పలికితి – ఆధి పోదె యింక మహేశా!

జలదాంచలపరిచుంబిత
విలసితవిద్యున్మయూఖ విశ్రుత రేఖా
లలితలలితభావంబులు
వెలయుత నీ కరుణనా కవిత్వమున శివా!

జీవికి జీవము శివుడే
జీవమ్మున వెలుగు వెలుగు చిన్మయు శివుడే
దేవత్వము శివుడిచ్చెడి
ఆవిష్కృతి యనుచు నమ్మనంతరము శివా!

నే నమరత వాంఛింపను
నేనై దేహమ్ము కొరకు నిష్ఠుడనగుచున్
నే నమరత కోరెదనా
ప్రాణతపస్సునకు నాదు వాక్కునకు శివా!

దృక్కులలో నొక వెలుగై
దిక్కులలోనెల్ల తెలిసి తెలియని వెలుగై
ఒక్క విచిత్రపు వెలుగిది
వాక్కునకందదును మదికి పట్టదు స్వామీ!

చిట్టెము కట్టిన స్వార్థము
కట్టెలు తెంచుకొని సగువు గావించిన-నో
అట్టే బాధను జెందను
గుట్టుబయటఁ బెట్టుకొరకు కూర్చుంటి శివా!

ఉండియు లేవస్త్రమ్ములు
ఉండియు లేనట్టి ఉజ్జ్వలోక్తులు ఇంకన్
ఉండిన దొక్కటె నాకున్
చండముసంకల్ప మహిమె సాధించు శివా!

ఔనా? నిజమేనా ? నా
మానసమంతఁము తమోఽంధమధ్యంబేనా?
ఏనాటి ప్రేమకథయో
ఈ నాఁడును మాసిపోవ దేమందు శివా!

కథలుగ మిగిలెను ప్రేమలు
వ్యథలుగ మిగిలినవి జీవితాధ్యాయమ్ముల్
మధురాతిమధురఘట్టము
లఘూకృతము లయ్యె నేమి ఆశింతు? శివా!

ఆశల నన్నింటి వదలి
ఆశయసిద్ధికయి నిన్నె అర్చించెద వి
శ్వేశ! పురారి! త్రిలోచన
పాశధరా! ప్రళయవహ్నిపాణీ! పశుపతీ!

నాసామూలనివాసా!
నాసాగ్రనివాసవినయనయనోల్లాసా!
నాసానాద్యైకాగ్ర
న్యాసమహోహానిహితమహితహాససమాసా!

మౌనధ్యానసమాధి
జ్ఞానానందప్రపంచసతతవిహారా!
ప్రాణాయామసముజ్జ్వల
మానససంచార! విశ్వమాయామారా!

ఓంకారశాబ్దికాలంకారనాద!
కింకరీకృతమహాగీర్వాణలోక!
పంకజాసనముఖ్యవంద్యపాదాబ్జ!
వంకబెట్టక కావవా? నన్ను స్వామి!

అందాల ఒకవేయిమందాకినులకు
సౌందర్యమిచ్చు నీచారుహాసమ్ము
మందాకినీరమ్యమస్తకోల్లాస!
అందింపవే నాకు హర! త్రిశూలాంక!

స్వాగతమ్మఖిలలోకాధీశ్వరునకు
స్వాగతమ్మమరపూజ్యాంఘ్రియుగ్మునకు
స్వాగతమ్మత్యద్భుతాకారునకును
స్వాగతమ్మీశునకు హర! నీకునెప్పుడు

మూడులోకమ్ములున్ మ్రొక్కుచునుండ
మూడుకన్నులతోడ మొనగాడవైన
శేమువీవంచు నుద్రిక్తమౌభక్తి
తోడఁ గొల్చెదనిన్ను తుహినాంశుమౌళి!

సమధిగమ్యజ్ఞాన సమధిగమ్యాత్మ
సమధిగమ్యవిశిష్ట సమవాయపుష్ట
సముదీర్ణసంభావ్యసాధనానన్య
విమలార్చనామోదవినుతి! విశ్వేశ!

మిథ్యామిథఃకృతిశ్లిష్టభావమ్ము
తథ్యమ్మెరుంగునే తారతమ్యమున
సాధ్యమ్మసాధ్యమ్ము చర్చించుచున్న
విధ్యుక్తధర్మమ్ము విగతమా దేవ!

ప్రళయ కాలకఠోరపర్జన్యభంగి
పలికించుచున్న నీభావసౌందర్య
మలసతను నాగుండెనాదరింపించి
వెలయింపవే దేవ! విశ్వకౌతుకము

కలిగినదిఒకచిన్న ఖండకావ్యమ్ము
విలువకట్టెదనేను వీరకావ్యముగ
తలపోసెదనునేను తారుణ్యగణ్య
కలితసుందరమహాకవితాపథముగ

ఇదియహంకార మిథ్యాదిదర్పమనుచు
ఇదిసహింపగరాని దిదిపహ్యామనుచు
ఎదలలో కొందరెంచెద రేమొగాని
మృదుత నాకీయవే మేచకకంఠ!

అవతారమూర్తి సత్కవిచక్రవర్తి
వివిధభావరహస్య విజ్ఞానవేత్త
నవకళాసౌజన్యసాదలీనుండు
శివ! నిన్నుభావించు చిత్తమందెపుడు

ఏచిన్నతనములో ఏమెఱుగనపుడు
ఏచెట్టపనులతో నేమిచేసితినో
ఆచిలిపికార్యమ్ములందు నొక్కింత
సూచింపఁబడదుగా సుజనత్వమభవ!

కారుణ్యమొలికించు కమనీయమైన
నీరమ్యమూర్తిలో నిండుదనమెంచి
పూరించెదను నేను భువనముల్ పొంగి
సైరింపలేని ఆశ్చర్యముల్ దేవ!

వెలుగుబాటలలోన విహరింపఁగోరి
మలగిపోయితి మహామథనమధ్యమున
నలగిపోయిన నేటి నాతనూయష్టి
పలుకరింపదు దేవ! ప్రజ్ఞాపథమ్ము

ఈయకర్మణ్యమా హేతువాదముల
నాయెడలు భరియింపనంతగాఢముగ
నోయీశ! ఏతెంచె నుద్రిక్తవిక్కృతి
జ్యాయః పరావరస్ఫాయత్ పదమ్ము

అద్వైతసిద్ధాంత విద్వద్విశేష
ముద్వేల్లితంబైన హుంకారములకు
విద్వేషవేషముల్ వేగించుచున్న
త్వద్వైభవమ్మింత తగ్గునే దేవ!

భూషాకృత భుజంగఫూత్కారములకు
రోషమ్ముచెందునా రూక్షవీక్షణము
ద్వేషమ్ముచేఁగాదు దేవాధినాథ!
భాషింపఁగారాని పరమమోహమున

ఊరీకృతమ్మైన ఉత్సాహ సీమ
దూరీకృతమ్ముగాదుగదా? మహేశ!
నారాయణాకారవీరానుభావ;
పారమ్ము హరిహరాద్వైతమ్ము దేవ!

స్తవ్యండ వింద్రరూపమున నీవనుచు
కావ్యకంఠులు మహాకవిపూజ్యు లనిరి
సేవ్యులౌ గణపతుల్ సిద్ధపూరుషులు
నీవ్యష్టిభావమందించిరో స్వామి!

ప్రజ్ఞా సమన్విత ప్రాభవమ్మందు
రాజ్ఞిపదమ్ము పారంపర్యమగునె
ఆజ్ఞాపనము సేయ నతిశక్తు డెవఁడో
విజ్ఞుఁడాతఁడు నన్ను వినఁడె లోకేశ!

పరమసౌందర్యలుబ్ధప్రపంచమున
కటునాళి వాక్కుండు కాఁడుగా నేఁడు
తరుణీహృదంతరాధారసారమ్ము
మెరయింపదే కొంత మృదుత విశ్వేశ!

పత్రికావాదముల్ పరిఢవిల్లగనె
సూత్రమ్ములకు క్రొత్తసూక్తులువచ్చె
వేత్రమ్ము ధరియించు విద్వత్తులేక
ఆత్రమ్ము పడవలసె అష్టగుణ దేవ!

క్రొత్తరాగములతో క్రొత్తరోగములు
మొత్తి మొత్తగవచ్చి మీఁదఁబడుచుండె
ఉత్తపుణ్యానికే ఒక మహాభార
మెత్తంగవలసెనే హృత్తమశ్చంద్రి!

స్యాద్వాదములలోని చక్కందనమ్ము
మృద్వీకకును లేదు హేలగా ననుచు
చిద్వాదముల్ సేయు శేఖరుల్ నేడు
మద్వాక్యముల చెంత మలగిరో దేవ!

నిద్రానిమగ్నమంతేవాసి గణము
సద్రూప వీక్షింపఁ జాలునే యెపుడు
భద్రాకృతిశిలకు సాభాస యొక్కండు
ముద్రించునే దేవ! ముఖమందు నిజము

బహుళాత్మవాదమ్ము బయలుదేరంగ
విహరింపఁ జేసెనే వెనుక కపిలుండు
ప్రహితతాత్త్వికచింత పరమార్థదృష్టి
విహృతమ్ముగానో శివ! వితతసాంఖ్యమ్ము

చదివినదె మరి పురశ్చరణమ్ముఁ జేసి
చదివినంతన వచ్చు జ్ఞానమ్ము గలదె?
మదిలోన శాస్త్రముల్ మాని నీనామ
పదవి నిల్చిన ముక్తి వరలదే? స్వామి!

తర్కవాదమ్ములన్ తరలు భావమ్ము
కర్కశమ్ముగ నుండు గాదె సత్యముగ
అర్కాంశుకిరణమధ్యాహ్నచండతను
కర్కమ్మటంచు పల్కడె వాడు దేవ!

ఒకవిచిత్రమ్మైన ఊహా మార్గమున
చికిలీ యొనర్పఁబడు సిద్ధాంతగతులు
నికటమ్ము నందొక్క నిప్పు కణ ముంచ
ప్రకట మయ్యెను మహాజ్వాల విశ్వేశ!

నిప్పువంటి మనస్సు నీమాయ లోన
తప్పు మార్గమ్ములన్ తడవంగఁబోవ
చెప్పంగరాని ఆచెఱు నాదటంచు
దెప్పంగ వచ్చునే దేవాదిదేవ!

కుటిలవిద్యలలోనకూర్చుండు వారు
నిటలలోచనశక్తి నేర్వంగఁగలరె
పటుతరాభీలదుర్వారప్రభావ
మటు లూరకయె వచ్చునా యేమి? స్వామి!

నేనెఱుంగనినీవు జ్ఞానేశ్వరుడవు
నేనెఱింగిన నీవు మానీశ్వరుడవు
నేను నీవుల భేదనియతి యెన్నాళ్ళు
తానుగా ఉండగాఁ దలచునో అభవ!

యత్నమ్ము లేక బాధ్యత నెంచఁబోక
రత్నమ్ము వచ్చునే రాజునకునైన
ప్రత్నవైభవతపఃపరిణతికి రాని
నూత్నత్వ మది నచ్చునో నీకు శూలి!

తీవ్రత్వ మొక్కింత తిరుగఁబడెనేని
సువ్రతుండని నన్ను చూడవో నీవు
నావ్రాత యెట్లున్న నగ్నాంగ! దేవ!
ఈవ్రాత్యు డెవడంచు నీక్షింపబోకు

పరిణతము గాని దౌర్బల్యమ్ము చేత
విరచింతు నేనొక్క వెగటైన పదము
సరసపల్లవి లేని జానుతనమందు
పరికించుచుంటి నప్రాజ్ఞత మహేశ!

నాకున్నవాక వేయి నర్మాయుధములు
రేకెత్తజేయు నుద్రేకబోధములు
పైకి వచ్చిన యీప్రభాపటలిమధ్య
దూకునో విజ్ఞానతోదన మ్మీశ!

క్రమ్ముకొన్నవి మహోఘము లొక్కసారి
చిమ్ముచున్నవి విషాశీస్సు లొకవేళ
దుమ్మెత్తి పోయు నీదూషణాలమధ్య
నమ్ముకొంటిని నిన్ను నాయక! మహేశ!

ఇదిబ్రాహ్మ్యమిది క్షాత్రమిది శక్తి యనుచు
మొదటఁ జూపించె నీముఖ్య శిష్యుండు
తదుదగ్రదీప్తి నా తలపులో నిలిపి
కదలింపవే నన్ను కాళగళ! శర్వ!

ఒకసమాధాన మభ్యూహితంబైన
వికటార్థములు తోచు వేలు లక్షలును
చకితధౌరంధర్యజనుపదాసేన
సుకృతి గల్గునె నాకు సులభప్రసాద!

అర్థాంతరమ్ముగా నందరిమ్మొకటి
వర్ధిల్ల నద్దాని పైన ననుమాన
మర్ధేందు కోటీర! ఆనందనాథ!
మూర్ధధృతసురనదీముగ్ధోర్మిమాల!

పటు కుంకుమామోద ఫాల భాగమ్ము
చటుల కస్తూరికా సారసౌరభము
తటుకునందోచి అంతరమందు నిలిచి
కుటిలేక్షణములతో కూర్చుండు దేవ!

ఆవిచిత్రమ్ము ఛాయాచిత్రమందు
ఆవిష్కృతమ్మైన ఆకర్షణమ్ము
వేవేగముగ తుడిచివేయంగఁ బోదు
పోవదా నీలిరంగో విశ్వనాథ!

కనకమ్ముపైన మరి కామినులపైన
మనసు నిల్పని వాడె మహితాత్మకుండు
మనసులో నొకటియున్ మాటలో నొకటి
తనరారు నీనాటి తనువులకు దేవ!

అకటావికటమైన అల్పబుద్ధులను
ప్రకటించు నీలోకఫక్కి వీక్షింప
ఒకరోత జనియించు నుచితమోకాదో
ముకుళీకృతాంభోజ ముద్రానురూప!

ధర్మపథులకు మనస్త్యాగమ్ము నందు
కర్మపథులకు తనూకలనమ్ము నందు
శర్మమ్ము నిచ్చి ఉత్సాహమ్మునొసగి
చర్మ చక్షువుల కుత్సవ మిత్తు వభవ!

ఫుల్లవల్లీరమ్యపుష్పముల తోడ
హల్లకమ్ములతోడ నబ్జములతోడ
ఉల్లమ్మునన్ భక్తి ఉల్లాసమొంద
చెల్లింతునో పూజ శివ! విశ్వనాథ!

గోడెల్లులకు గల్గు నీడలన్ చూచి
దేవ! నేనొక్క భ్రాంతిని మున్గుచుందు
భావనాతీతమౌ భవదీయమూర్తి
కైవసవృత్తిక గలదె? ఛాయాగ్రహములు

ప్రాపంచికావృతిప్రావేశికములు
దీపింపకాగుమా ధిక్కృతుల్ దేవ!
ప్రాపించు నంచెంతు భారతీలలిత
నూపురఝణంఝణానుస్యూతపుతులు

ఆగబో దొక్కింతయైన యీదివ్య
వేగస్రవంతికా విపులగర్జనము
ఆగినది యొక్కటే అభవ! అనురోధ
రాగప్రహేళికారభసతర్జనము

ముఖ్య కార్యక్రమమ్ములలోన మునిగి
సఖ్యమ్ము మరచితినో సాంబ! మహేశ!
సౌఖ్యమ్ము వీడి ఆశాజీవినగుచు
ఆఖ్యకై భ్రమియించినట్లు కన్పడునో!

దేవాదిదేవులున్ తెలియంగలేని
నీ విక్రమస్ఫూర్తి నెగడింపఁగలనె
నీవె నీకై వచ్చి నింపుదనమిచ్చి
నావల్లభత్వ మెన్నకయున్న స్వామి!

ఆనందవల్లికలు అగ్నివల్లికలు
మానావమానముల్ మరినీకు ఒకటె
సూనాస్త్రవైరి! ఆ సూత్రముల్ నాకు
ఆ నీతముగఁ జేయు మంచు ప్రార్థింతు

ప్రార్థించి ప్రార్థించి పట్టుదల జారె
అర్థమ్ములేని యీ యాత్రలకుమధ్య
దుర్థివిచారముల్ తోచగలయప్పుడు
స్ఫూర్థింతునా యేమి? శర్వ! నీతోడ—

అర్జునుండనుగాను అని సేయుటకును
గర్జింపగా సంధకత్వమ్ము లేదు
నిర్జరారాతి సేవియు గాను దేవ!
దుర్జయుండవు నీవు దొరకుటది యెట్లు?

చలముతోడన్ నిన్ను సాధింపనెంచి
బలముతోడన్ నిన్ను బంధింపనెంచి
కలుగువారల మాహాత్మ్యంర గనినీవె
ఫలదాతవై పట్టుబడుదు వోదేవ!

కామాన క్రోధాన కడగి మోహాన
ఏమాడ్కి నేని నిన్నెద నుంతురేని
సోమ సుందర శిరశ్శోభా విలాస!
ఆమహావ్రతుల కాపాడెదవునీవు

నీభక్తితో గుండె నీపగాఁజేసి
ప్రాభవమ్మెల్ల కప్పమ్ముగాఁ జేసి
సాభవమ్మంత నీ నామమ్ముతోడ
శోభిల్లఁజేయుదునో సురశిరశ్చరణా!

కారుణ్యకళ్యాణకలకలాపములు
తారుణ్యతారళ్యతత్పరత్వములు
శ్రీరమ్యతావకాశీర్వృష్టిలోన
ఓరజతగిరివాస! ఉప్పొంగనీవె!

అజ్ఞాన తాళవృంతానిలోర్మికలు
ఆజ్ఞాధికృతులుగా అలరాడునేడు
ప్రాజ్ఞప్రభావముల్ పరిఢవిల్లకయె
ప్రజ్ఞాన విజ్ఞాన భవమొట్టులభవ!

సుజ్ఞేయములు సౌఖ్య సోపానగతులు
ప్రజ్ఞాపనములు దుర్భవసాధమునకు
ఏజ్ఞానమున జనుర్హేతువుల్ తెగునో
విజ్ఞప్తి గావింతు వెలయింపు మీశ!

రక్షఃపిశాచసంరంభమ్ములకును
దక్షుడెవ్వాఁడు భీతితత్పనుండగును
అక్షయ్యమైన దుష్టాహంకృతులకు
దీక్షితుండల వెన్కదీయునే శర్వ!

నిర్వాణమార్గ మన్వేషించుజనుఁడు
గీర్వాణతతిని లెక్కింపఁడ నేసుంతె!
గర్వమ్మనుచు వాఁడు కలచెదరుగాక
శర్వ! ఆతనిశక్తి సైరింపఁదరమె?

కోరికల్ త్యజియించి కూర్చుంటినిన్ను
ధారణాగతినిల్పి ఆత్మైక్యబుద్ధి
గారాజదుద్బోధ రంజిల్లువాఁడు
మారవైరి! మహాత్మ్యమహితుండుగాఁడె?

కనుపులోననిముడని జ్ఞానమ్ముపట్టి
కనురాగిరేకొంను కవచమ్ముఁజేసి
తడబడకపోవఁగల ధైర్యమ్మునాకు
మృడ! వద్దు లేవయ్య! మేచకకంఠ!

శిరసుపై శిఖదాల్చి సిద్ధాంతమనుచు
తెరువరులకిది జ్ఞానదీపంబటంచు
పురవీథులందు నుద్ధురరీతితిరుగు
వరవిభావము నేను వాంఛింపనభవ!

మనసులను మార్చి నీమధ్యకాలమున
ఘనవిపర్యాసములు గడబిడలు సేయ
ధనికవాదములు పేదలభేదములును
వినలేను దేవ! యీవికృతవాదములు

జ్ఞానమ్ము చెంత నజ్ఞానమ్ము వెలసె
మానమ్ము కడనె యవమానమ్ము వెలసె
మానప్రమాణముల్ మర్యాద లేక
ధ్యానగమ్యత నీకె నవనిలో నీశ!

సారతరధర్మంపు చర్చలు లేవు
చాటుతర వీక్షావిచక్షణల్ లేవు
మాయ జేసె సర్వసమ్మాన కోవిదుడు
ధారుణీస్థలి నేడు త్రయ్యంతగమ్య!

ప్రకటబాధాఘోర పరితప్తాకార
నికటప్రసారముల్ నిష్ఠురమ్మయ్యె
చకితలోకాధీశ సౌజన్యమాన్య
సకలభారతదీప్తి సాగదో? దేవ!

విశ్వసాంస్కృతికప్రవీణవిద్యార్థి
శశ్వత్ప్రసన్నతాసమధికాదరము
నశ్వరమ్మాయెమి? నవ్యభారతిని
ఐశ్వర్యదాయి! సంధ్యావంధ్యనృత్య!

సంఘసంక్షేమ విజ్ఞానకేంద్రముల
సాంఘాతికములైన శక్తులలరారె
సంఘట్టనావసర చక్షుష్యనీతి
జాంఘాలికుల పట్టశక్యమా? ఈశ!

పట్టు పట్టగ రాదు పట్టివిడరాదు
పట్టుదల లేని యీ బ్రతుకులవి యేల?
ఉట్టి కెగురగలేని ఉత్సాహరహితు
డట్టె స్వర్గము పోదు వనతగునె? అభవ!

విస్తరప్రజ్ఞ లంబికపట్టలేదు
ప్రస్తరమ్ములనెక్కి ప్రాకంగలేదు
దుస్తరమ్మలైన రీతులు చూడలేదు
నిస్తరంగాంభోధి! నిను జేరుటెట్లు?

ఊహింపలేని దుర్వ్యూహమ్ములిందు
మోహాంబునంభోవు ముగ్ధబాలకుని
స్నేహ మియ్యది కృపాసింధూ! యెఱింగి
దోహద మ్మొసగు కాంక్షలు నింపుమభవ!

సౌహార్దమయమ్మైన సాధనమ్ములకు
వ్యాహార సౌమనస్యము నిత్తువనుచు
దేహమానసకళాతీతత్వదమృత
దాహార్దమ్మెంతు నాంతర దీక్ష నీశ!

బిసరుహమ్ములకంటె విమలసౌందర్య
మసృణమ్మలైన నీ మహితపాదములు
వెస భక్తి భావనావిస్తారరీతి
కొసరి కొల్చెద నిన్ను కుహనావిలాస!

నిశ్శబ్దవీచికానిభృతాంతరంగ
దుశ్శల్యశిక్షావిధూననాభంగ
నిశ్శేషసౌందర్య నిర్మలాంభోధి
స్వశ్శాంతి నెంతు నే సతతమ్ము శర్వ!

లలితసౌజన్యాభిలాషు లుప్పొంగ
కలిత సౌభాగ్యసంకల్పముల్ వెలయ
పలుకరించిన వాణి పల్లకీలెత్త
తలపింపవే దేవ! తపఉజ్జ్వలతలు

నవవివేకానంద నాదప్రపంచ
మవతరింపగఁజేయు హాసలాస్యములు
భువనానుమోదముల్ పుష్పింపఁజేయు
కవితావిశేషముల్ కల్పింపు దేవ!

స్వానుభవవేదాంత సాధనమ్మందు
మానవుఁడు ధర్మసామ్యమ్ము గ్రహియించు
ఆనీతశాస్త్రసూత్రావళీమగ్న
మానస మ్మెరుగదామతము విశ్వేశ!

అస్థిగతమ్మైన వీరారాధనంబు
ప్రస్థానభాష్యనిర్వాహణంబు కన్న
ఆస్థతో గ్రహియించు నట్టి వారలకు
ఆస్థానమునన్నైన నర్థమిడు మీశ!

అస్వస్థులైన యీ అఖిలమానవుల
కస్వతంత్రత యున్న నది తృప్తి నొసగు
ఈస్వచ్ఛలహరికాహిమసమూహములు
నాస్వేచ్ఛ పోగొట్టినా యేమి? స్వామి!

అందరున్ పల్యంకికాధిరోహణము
పొందఁగోరుదు రేని మోయు వారెవరు?
ముందుండు నిజమైన మానవుఁడుకాడు
అందుకోడో సత్యమని తలఁచు నీశ!

పరవశత్వముతోడ పారమ్య మొంది
శిరసునేలానగా చెలగి మ్రొక్కెదను
నిరహంకృతి స్ఫూర్తి నిణ్య[1]నిర్ణయము
పరమాణువ్రుల శక్తి పలికించు నీశ!

దేవచైతన్య ముద్దేశించు వేళ
భావచైతన్యమ్ము పరగుదానికదె
శైవచైతన్య ముచ్ఛ్రితమౌ వేళ
నీవెల్గు నిలువదే నికటమందీశ!

కాంతిరేఖా ప్రేరకమ్మైన చోట
క్రాంతిలేఖాసమాకారమైన చోట
శాంతిశాఖావికాసమ్మైన చోట
అంతులేనియనంతమభవ! నీవందు

పరమమౌ ప్రజ్ఞాప్రభావంబు దోప
విరచించుచుంటి నే విమలభావంబు
పరితస్స్రిధమ్ము[2]లుత్పాతముల్ సేయ
కరుణింపవే నన్ను ఘంటెందుమా[illegible]!

అధికార మొకవేళ అత్యంతమైన
వ్యధను కల్గింపంగా పరితపించుచును
విధురానుభావసంపీడితుండనయి
మధురనామోదముల్ మలతునో దేవ!

భావజీరా[3] మహా పరిధుల యందు
శైవరథములు చాల సాగిపోయెడిని
నీవెల్గు నిండె నీనికటమం దనుచు
కావింపవే దేవ! కల్పవృక్షములు

---

1. నిణ్యము=నిర్నామధేయము, రహస్యము.
2. స్రిధము : ఆటంకము; 3. జీరా : ప్రేరయిత్రి;

భ్రుంసమా[1] అస్మలుగ్రమ్ముగా రేగ
దంసః[2] ప్రభావముల్ దాగున్న నెట్లు
వ్యంసుండనే గాని వ్యంఘ్రినే గాని
హంసవాహనపూజ్య! అర్చింతు నిన్ను

ఉష్ణీషములుగ నేజ్యోత్స్నలైనవి యొ
కృష్ణి[3]షలకు నీలరేఖికల్ జారె
ఉష్ణాంశు నుజ్జ్వల జ్యోతియే గాదె
విష్ణుత్వ మిడు నిశా విభునకో దేవ!

ఒకరిపై నొక్కరింకొకరిపై నొకరు
ప్రకటముగ నాధారపడుదురో ఈశ!
తకిటధిమ్మని సర్వతంత్రస్వతంత్ర
వికృతి తాండవమాను వేల్పు వొక్కడవె

తేజఃప్రవీణసంధిగ్రంథులందు
రాజితమ్ములు సురారంగస్థలములు
మాజీర్ణ వసనవామాచారములకు
మోజుపడదే నీదు ముఖభంగి దేవ!

రాశీకృతమ్ము పారాశయ్యాతపము
దేశమున ధర్మసందేశమ్ముసంగ
ఆశయమ్మది యెట్టులయ్యెనోగాని
ఓ శివా! నీవుంటి వున్నతాగ్రముల

ప్రేరయిత్రీరసప్రేంఖణమ్ములకు
కారయిత్రీకళాకళ్యాణములకు
సారభూతముఁగాహ శర్ధముల్[4] సాగె
నో రాజశేఖరా! ఒకజయ మ్మగునో?

---

1. భ్రుంసము . దీప్యమానము; 2. దంసస్సు . అద్భుతశక్తి;
3. కృష్ణి : నిశ; 4. శర్ధము . బలభూతము.

మంజుకంజాతదృఙ్మాధుర్యనృత్య
శింజినీరవములుజ్జృంభింపఁ జేయు
సంజీవినీ దివ్యసాధనల్ లేవా
కంజాతలోచనా! ఖట్వాంగధారి!

పండితుల్ తాత్త్వికుల్ పటువిమర్శకులు
చండప్రచండవిజ్ఞానసంయుతులు
నిండైన నీ భక్తినిశ్చలత ముందు
ఖండపరశూ! మస్తకమ్మొగ్గనలయు

మతతత్త్వములపేర మానవులపేర
అతిలోకబహుకళాధ్యాయములపేర
వితతమాంత్రికయుగక్రీడనముపేర
జతనమ్ము సలుపు నీజనము విశ్వేశ!

ఎన్ని రీతులుగాఁగ నెవ్వారేమన్న
ఎన్నిమార్గమ్ములైన నెవరు చూపినను
నిన్నె నమ్మిన వాఁడ నీవాఁడ నను మ
నన్నేలగా రావె – నాథ! విశ్వేశ!

హర! త్రిలోచన! రుద్ర! అంబికానాథ!
పరమసౌందర్య శోభాభాసురాంగ!
దురితభీకరరూప! దుర్వారకోప!
కరుణింపవే దేవ! కళ్యాణభావ!

నిరుపమానవిచిత్రనిర్నామధేయ
పరిణతాలంకార పరితఃప్రసన్న
చరణానతాజాండచాక్రికాకార
నిరవశేషవికార! నిస్సారసార!

నేను సుమారుగా పలుకనేర్చిన కాలమునాటినుండి యె
వ్వానికినైన నుంత తలవంచియెఱుంగను మాటకోసమై
ప్రాణములీయ సిద్ధపడువాడను బొందిని జీవముండగా
నేనికినైన లొంగుగుణ మీశ్వర! లేదని నీ వెఱుంగవే!

మానముప్రాణమున్ బిలువమార్చుచునుండిన పాడుస్నేహబం
ధాన తపింపగావలసె నాకిలమిత్రులుగారు శత్రులీ
హీనులు కొందరంచెరిగియేనియు మార-సహింపనింకనో
యానతవైరి! కోరనిక అన్యము నీహితమొండు ఒక్కగన్

నల్లని కోడెత్రాచులన నాట్యములాడు మనస్సులొప్పు నీ
కల్లహితావళిన్ నిజముగా హితపాళియటంచు నమ్మి నే
కొల్లగఁగోలుపోతి నతిగూఢముగా విలువైన వస్తుసం
పల్లలితానుభావములు వద్దిక దేవ! నమస్కరించెదన్

హితులుగదా! యటంచు మదినెంచితి నేసతతమ్ము ప్రేమపూ
రితమతి సంచరించితి దరిన్ గననోచని వారికష్ట సం
ప్రతతిని దీర్చితిన్ మరపువచ్చునె వీరికృతఘ్నతల్-తుదిన్
హతమతినై శివా! జగమిదంచు గ్రహించితి నిన్నినాళ్ళకున్

లేడొకమిత్రుడైన లవలేశము నిర్మలమైన ప్రేమ నా
కీడును మేలు నెంచి పరికించి తపించి చరించు వాడు నా
తోడ మెలంగి నాపలుకుతోడయి నీడ విధాన నెవ్వడున్
లేడు శివా! మషీరసమలీమసమానసమానవావళిన్

వారొకవేళ నాకు పరిభావముచేసిరిగాక కుత్సిత
క్రూరమహోద్ధురారభటి క్రుద్ధభుజంగమఘూర్ణమాన దు
ర్వారదురంతవృత్తి-పగబట్టగలేదు శివా! వివాదపున్
గారుమొయిళ్ళనుండి వెలిగ్రక్కితి నిర్భరవేదనాంబువుల్—

పాడు ప్రపంచమందు కనుపట్టది యంతయుఁగోరి గాలిలో
మేడలు గట్టుకొంటి నవిమిథ్యయటంచు గ్రహింపలేక నా
లీడును గూడుకట్టుకొనలేదె? మనుష్యుడు నంతకన్న నే
పోడిమిచేత నెక్కువగు భోగివిభూషణ! సత్యమాడవే!

ప్రకృతివినీవు నాహృదయభావనమీవు తదాశ్రితార్థమా
సుకృతివినీవు నానుభవసోదర నాదరమూర్తి నీవు నా
శోకహితుడన్న నీవెయయి యుండువు తప్పక నాయెడందలో
నికిఁజని లోతులన్ దెలియ నేసవు నీవెగదో మహోదయా!

కర్ణకఠోరమై ప్రణయగాథలగాఢములైన గాథలన్
ఘూర్ణిలగా మహాప్రళయఘోషలు నింపెను గుండెలోన సం
పూర్ణముగాగ నుప్పరిసి పోయెను జీవనమెల్ల – నెన్నఁడో
అర్ణవమయ్యె నాదుబ్రతుకందముచందమునీకి ఓశివా!

స్నిగ్ధ రసస్రవంతికలునిండిన నీహృదయాంగణమ్ములో
దుగ్ధపయోధులున్నవనితోచుట చిత్రముగాదు గాని సం
దిగ్ధముగా ఒకేఒకటి నిల్చెనదే ప్రళయప్రకాండపుఁ
దుగ్ధతొలంగగా నెఁటులు సారము చేసెదవో మహేశ్వరా!

ఈ కవిలోకమే ఒక దురీహాపరస్పరవైరభావనా
లోకముగా వెలుంగునని లోకము వాకొనుగాక నాకమై
నాకును నీకు భేదము కనంబడవచ్చువిధాన పూవులో
రేకువలెన్ చరించెద వసించెద నాత్మికతత్త్వమోశివా!

పుట్లకుపుట్లు దుఃఖములు పొందగ పొందఁజేసెదవాని యి
క్కట్లని త్రోసిపుచ్చెదవా కాక శ్రితుండని చిన్ననాటి ము
చ్చట్లను దీర్తువో సుగుణసంపదలిచ్చి సుఖంబు గూర్తువో
ఎట్లయినన్ సరే! నతులివే! యిక నీదయ చంద్రశేఖరా!

ఈ కఠినప్రపంచకుటిలైకవిలోకకృతావమానముల్
నాకు సహింపరానివయినన్ తలయొగ్గితి నేమిచేయగా
లేక శివా! పదేపదిచలించు పరస్పరభావఘట్టనల్
కూకటివ్రేళ్ళతో పెకలి కూలిన వృక్షములై కదల్పగన్

మూల్యములేనిదిబ్రతుకు మూర్ఖతమై చరియించు క్రౌర్యకౌ
టిల్యపటుత్వతత్వనిబిడీకృతకాళకరాళబుద్ధివాం
చల్యతమస్తమస్వినులసంగతి నిశ్చలమారభావచా
ర్బల్యముచాటు ఈమిడిసిపాట్లు నశించుట యెట్టులో శివా!

ఆత్మికశక్తిగల్గు పురుషాళిగ్రహింపగలేక విశ్వవి
శ్వాత్మిక తత్వమైన పరమాత్మనెఱంగక ఆధిభౌతికా
ధ్యాత్మికభేదభావముల దారి కలంగక పోవు నేనెటుల్
ఆత్మకు నావృతంబయిన ఆదిమమాయ తరించుటో శివా!

అంబరచుంబిభావనివహంబు శ్మశాననిశీథినీమహా
డంబరచండతాండవనటద్భవదీయజటావిటంకలో
లాంబరవాహినీ జయజయ ధ్వనిరోచిరుదగ్రవీచికా
ర్ద్రింబయి వెల్గు వ్యంగ్యమధురమ్ముగ నొక్కొకవేళనో

పూతమెసంగు వాక్యముల పోడిమివీడుచు నీతినిల్పులే
జాతికిజీవగఱ్ఱ పరిశస్తసమస్తవిశిష్టవిశ్వవి
ఖ్యాతికిపౌనరర్థము సమంచితశాంతికి మూలముజ్జ్వల
స్ఫీతవినూత్నశక్తి పరసీమయనందలపీయవే శివా!

అక్రమమహా చిదంబరరహస్యములన్ గ్రహియించి యీ
చక్రములోన ధర్మబలసారములేర్పడ నిత్యసత్యకా
ర్యక్రమరీతినేగి విజయంబును దెచ్చు గభీరధీరని
ష్క్రమపరాక్రమక్రమ మరాతిజయంబు నొసంగవే శివా!

నిలుపగ సత్యధర్మములు నిశ్చలధైర్యముతోడ నెండమా
వులు జలపూరితంబులని ముందుకుఁబోవుటనాపి గాలిమే
డల నివసింపఁగాఁ దలఁచుటల్ సరిగాదని నేర్పఁజేసి లో
కులు పలుగాకిమూకలనఁ గుర్తిడునేర్పు నొసంగుమో శివా!

భిక్షాం దేహియటంచు నీకొఱకునై వీక్షింపఁగా నేల? క
ర్మక్షేత్రమ్మిది యంచుఁ గుర్తెఱిఁగి ధర్మక్షాత్రవిస్ఫూర్తితో
దీక్షాకంకణధారినై కదలి సంధీభూతగంధరతా
రక్షాకంకణబంధితుండనయినన్ రావే? శివా! నీవునై

ఎక్కడినుండివచ్చితి నుఱెక్కడికేఁగెద? మానవుండనై
ఇక్కడ నేల నేలజనియించితి? నెవ్వఁడ నేను? శాంతినా
కెక్కడఁ గల్గు? నీ వెలుఁగులెక్కడ నెవ్వాని వెల్గు? నీగృహ
మ్మెక్కడనుండు? ముక్తియన నెయ్యది? నాకెఱిఁగింపవో? శివా!

నాహృదయమ్ము దేవ! కఠినప్రకటోద్భటఫేనబుద్బుద
వ్యూహపరీవృతోద్ధతసమున్నతతుంగతరంగభీషణ
గ్రాహపిగాహవార్ధివలె కన్పడుచున్నది దానిలోన నే
డూహకునందరాని బడబోదయమయ్యెను వహ్నికీలలన్ —

ఆనతినైర! యీజగమునందు సుఖంబొకయింతలేదు నా
మానసమందు శాంతిఅణుమాత్రముకానగరాదు నాదుజ
న్మాన నరిష్టసూచకఘనాఘనపంక్తులనీడగ్రమ్మె నే
మో నిఖిలస్వరూపక! విమోచనమింత అనుగ్రహింపవే!

దీనులయిండ్ల ఆముదపుదీపముచూపు ప్రశాంతకాంతిలో
మానసరాజహంస సుషమాసుకుమారసుషుప్తి జెందునో
మానవదానవత్వపరిమాణగతీ! అధికారదీప్తిలో
నేనటనమ్మెగాని ధ్వనియించు పిశాచమహాట్టహాసముల్ —

ఓపరమేశ! ఏకుటిలయోగుల గుండెలనుద్భవించెనో
మోపులుగాగ సౌఖ్యములు మోసెడిమంగళతూర్యనాదముల్
పాపమదేమిటో అదికళామయదృష్టికి సత్యశాంతినే
చీపురుకట్టతోడ నెగజిమ్మెడి మృత్యుపథక్రుధాధ్వనుల్

ఇదియొకశాంతికాముకసుహృత్పరిణామము నిత్యనూతనా
భ్యుదయపథంబు ధార్మికులు త్రొక్కినదారి వెలుంగువెల్లికల్
పొదలినత్రోవ రత్నములువోసినచక్కనిరాచబాట సం
పదలకుపుట్టినిల్లిది శివా! హితమన్న భవత్స్వరూపమై

మృతియనిలేదు లోకముగురించి విచారములేదు భిన్నసం
స్కృతులకుతావులేదు ఒకటేఒకటేరససిద్ధమార్గసం
గతి సరసార్ధసంగతి జగత్పతి! పావనపారమార్థిక
స్మృతి అదియే మదీయహృదయేప్సితమందులకే గమించెదన్

నయమునపాలుద్రావదు జనమ్ము భయమ్మునదుర్విషమ్మునుం
గయికొనునంచు పెద్దలు ప్రగాఢముగావచియించునట్టి వా
క్చయమది తప్పటంచుననగామనసొప్పదు గాని—ఏలఆ
అయనయశూన్యమార్గములటంచువ్యధన్ గయికొందునోశివా!

వయసదివచ్చెనో అనుభవమ్మదివచ్చెనొ లేదొ గాని ఆ
హాయమునకన్న వేగముగ నస్మదుదగ్రమనస్సు క్రిందుమీ
దయినను చూడకే ఒకమహత్తర వీరపథాన పర్విన్
దయగొని అందుధర్మమునధర్మమునో శివ! నిశ్చయింపవే!

ఘుసృణజటావిటంకనవకోమలచంద్రకరోల్లసత్ కళా
మసృణమనోజ్ఞగాంగఝరమంగళశీకరశీతలానిల
ప్రసరములంది కావ్యవిసరంబులనల్లెద నీదయాసుధా
రసకవితామహోజ్జ్వలతరంగనిమజ్జనమూర్తినై ప్రభూ!

యోగములేదు భోగముల నూహయొనర్పఁగ లేదు సత్కృత
త్యాగము శాస్త్రతాంత్రికరహస్యములన్ గ్రహియింపలేదు ఏ
రాగము పాడినన్ జనపరంపరకింపయి తోఁచు సాహితీ
స్వాగతమామకీనకవితామృతముల్ శివ! నీ కృపావృతిన్—

ఎన్నఁడు శాస్త్రముల్ చదివె నీతఁడికెన్నఁడు సంప్రదాయ సం
పన్నత నభ్యసించె కవివల్లభుఁడై పలుకాఁడు వట్టిగ
రోన్నతుఁడంచు కొందరెవరో తలపోయఁగవచ్చుఁగాక నా
మన్ననకీవె సాక్షి పరిమాణవిహార! గుణత్రాయకా!

టక్కరివాఁడుగాను మరిడంబములన్ వచియింపఁ బోఁడికన్
టెక్కరవంత లేని ఒకగీవియెగాని ఒకించుకేనియున్
ప్రక్కపథమ్ములన్ జొరను పావన తావకపాదచింతనా
న్యక్కృతవిశ్వుఁడంచు కరుణాలయ! కొంచెము వెల్లడింపవే!

నిస్పృహతో నిరంతరము నిండిన నాహృదయమ్మునన్ కవి
త్వాస్పదమైన నీస్మరణ అద్భుతమైన వివృత్తి దెచ్చె నీ
రస్పృశమైన సాత్త్వికము రాజసమైకనుపింప వైఖరీ
పస్పృశమైన యీభువనభాండము లెట్టు సహించునో శివా!

నేనుమనస్సులోన ఒకనిన్ను మహేశు-సహస్రవైఖరీ
మానితుఁ జేయఁగాఁదలప మామకజీవితమందు ఎన్నఁడున్
లేని మహోగ్రవేగమిది లేఖినికిన్ జనుదెంచె-నీకృపా
ధీనము సర్వమంచు గుఱుతించితి దేవ! అనుగ్రహింపవే!

కష్టములున్ సుఖంబులును కావడికుండలవోలె వచ్చు నీ
సృష్టివిచిత్రమైనది మహేశ్వర! తావకపాదచింతనో
త్కృష్టపథమ్మునందు హిమశృంగపతద్ఘనగాంగవేగమా
కృష్టముచేసి దేవ! పలికించితివింతగ నాకలమ్మునన్—

వేగోద్వేగముతోడ షట్పది మహావేశ పల్లవమ్ముతో
ఆగంభోవకదూరకై దివ్యకవితావ్యాహారముల్ దేవ! ఈ
నాగర్వమ్మదినిల్చె నేటికి అనన్యంబైన నీప్రేమచే
ప్రోగుంగావృతి రోదసిన్ తరతరమ్ముల్ నాదుకంఠధ్వనుల్

ఓవిశ్వేశ్వర! ఫాలలోచనశివా! జ్యోతిర్మయశ్రీతనూ!
దేవా! నేకడుపారకన్నయది యీ దేవీశిరోరత్నమున్
నీపై నేమనసారకోరినది తండ్రీ! తీర్పగా రావె యీ
నావిద్యాధరి నొక్కమారయిన కన్నారంగ వీక్షింపవే!

గాఢాబంధనమొప్ప పెంచిన కళాకళ్యాణి విద్యాధరీ
ప్రీరమ్యంబులు దేవ! నీకొరకె యీప్రీంకారమధ్యానటద్
గ్లారేఖాసుమనోజ్ఞలాస్యవిసలీల గ్రైవేయఘంటాధ్వని
ప్రారంభామరగోపయః ప్రణయరాగాజన్మమనోజ్ఞాకృతుల్

రావో! వచ్చినమారు వో అమృతసామ్రాజ్యమ్ములందింపవో
నీవే రావలె పొందగావలె భవానీనాథ! విద్యాధరీ
ప్రావీణ్యంబు లనూహ్యనర్తన సినీవాలీరహస్సుందరీ
లావణ్యంబు లచుంబితాధరసుధాలాలిత్యసమ్మోదముల్

ఈవిద్యాధరి విశ్వమోహిని వచోహేవాకసత్సాహితీ
శ్రీపై యూసిక – పేరలాసిక – కళాశృంగారతారుణ్యగ
జ్యావశ్యాదర వశ్యవిద్య – భవదీయాంఘ్రిద్వయమ్మందునన్
మావజ్జీవము దాస్యమున్ సలుపు దేవా! చేయిసందింపవే!

చేతుల్ దగ్గరదీయ రావా కో? కృపాసింధూ! మహాదేవ! నీ
చేతస్స్వాంతతటిస్థానుతిన్ వెలసెనో శ్రీమద్రసానందవ
ల్లీ తత్వమ్ములు నీదుస్వప్నముల సల్లీబిల్లి నాడింపవో
చేతుల్ మోడ్చి నమస్కరింతు సుమనస్సీమంతముం జూపవే!

అన్నముపున్నమున్ వెలిపసట్టిరి యీపలనాఘుచేతలో
కొన్నిసుధర్మముల్ తెలిసికొన్నది – గొప్పమనస్సుగల్గు ఈ
కన్నియ కొన్నిలక్షలయుగమ్ములనుండి అనన్యదీక్షతో
నున్నది నిన్నుగోరి భువనోదయ! నీదయ కొంత చూపవే!

చేతులమీద పెంచితిని చిన్నతనమ్మునుండి విద్యుదు
ద్యోతితమైన యీనవనవోదయకాంతిమతీమతల్లికన్
జ్యోతిరదీర్ణముల్ హృదయనూతనశోభలు చూచునప్పుడీ
కాతరలోచనన్ తెలియగావలె దేవ! అనుగ్రహంబునన్

నిన్నెకోరితపించె నీకొరకునై నిర్మించె భావావళీ
సన్నాహంబులు ప్రేమదీపికలు భాషాసౌధసోపానముల్
మిన్నుల్ చూడక నీవురావలెనికన్ లేఖేశ! యీకన్నెకున్
కన్నీరున్ దుడువన్ వలెన్ ప్రణయకాంక్షల్ తీర్పబూనన్ వలెన్—

తెరతొలగించితిన్ ముసుగుదీసితి కన్నియమోము నెత్తితిన్
కరమనురాగభావమున కాంచవె దేవ! అనంతకాంతిసుం
దరభువనైకమోహనసుధాకరదివ్యముఖాంబుజమ్మునం
దిరుగడలన్ వెలుంగు వికచేక్షణముల్ ప్రణయేంద్రజాలముల్

కొన్నిసరోజసంపదలు కొన్నిమధూళులు కొన్నియౌవనా
భ్యున్నతరమ్యదృశ్యము లహో! యికకొన్నిసుగంధరేఖ లె
న్నెన్నని కావ్యమల్లి నటియించెదనో ప్రభు! యీసమస్త మా
పన్నజనైకరక్షణ భవత్పదపీఠికచెంత కానుకల్

మనమున నిట్టిభావములు మంచివికొన్నిటి నేర్చికూర్చి నే
ర్పెనయగ వల్లెవేసి హృదయేశుని దర్శనమైనయప్పుడ
ర్చనమొనరింపగా హృదయసంచికలో కడుభక్తితోడ నే
నునిచితిగాని నేడు శివ! ఒక్కటియేనియురాదు జ్ఞప్తికిన్—

కలగుచునుండె గుండె ఒకకల్పనయేనియు తోచదింతటన్
గళమది గద్గదమ్మగుచు కన్పడుచున్నది ఒక్కమాటయున్
వెలుపలరాదు నీయెదుర భీతిజనించుచు నుండె నిచ్చటన్
నిలువగలేను నీలగళ! నీవుకృపాగతి చూడకుండినన్

కావ్యముగాని కన్యకయుగాని మఱొక్కటిగాని యేకళా
భివ్యసనంబు గాని కనుపింపని తావకదివ్యదర్శనం
బవ్యయమైన శాంతిపదమాత్మలనెంచియె తీవ్రమైన తా
పవ్యథఁజెందుటో హృదయబాంధవ! కాంచవె యీసమర్పణన్

వచ్చినవాఁడొ కానొకఁడు భక్తుఁడు నీపయిగల్గు ప్రేమచే
ఇచ్చినవాఁడొ కానొకటి ఇచ్చకునచ్చిన చిన్నికానుకన్
పుచ్చుకొనంగరాదొ? తమపుత్రునిగా గ్రహియింపరాదొ? సం
పచ్చయమీయరాదొ? తమమాటకు వేఱొకటున్నదే? శివా!

నీవు తలంపగావలదె? నీదు శ్రితావళిశ్రేయమెల్లనో
భావజవైరి! నీపరమపావననామమునాశ్రయించి కా
వ్యావృత చిత్తవృత్తుల నహర్నిశముండిన మమ్ముబోటి వి
ద్యావినయప్రకాశుల హృదంబుజముల్ వికసింపఁజేయవో!

లోపములుండవచ్చును త్రిలోచన! మాయెడ నెన్నిమార్పుల
జూపినగాని యింతకు మనుష్యులమేగద! మేము మాకడన్
సైపగరాని నేరములు చల్లనివాఁడవుగా క్షమించి మేల్
చూపగరానె సత్యశివసుందరమూర్తి! సదాశివప్రభూ!

రేపటిదాక ఆగెడి నిరీక్షలక్రోధపరీక్షలందు న
న్నాపకుమయ్య! నీదుహృదయోదయ నిర్మలకాంతిరేఖలన్
దాపకుమయ్య! నీదుకరుణారసవాహిని - మార్గమధ్యమం
దాపకుమయ్య! నీపయిన నమ్మకముంచినవాఁడ నెప్పుడున్

నీపయినున్న నమ్మకమె నీవరుదెంచి అనుగ్రహంబునున్
జూపెదవన్న నమ్మకమె సుమ్ము మహేశ్వర! యిన్నినాళ్ళు న
న్నోపికతోడ నిల్పినది ఉల్లసనంబున నీవు రానిచో
నోపరమేశ! నే బ్రతికియుండుట లాభము లేదు సుంతయున్

మంచిది ఎంతకాలమిటు మాటున నుందువు వచ్చియేని సా
ధించెద వచ్చుజన్మమున దేవర! అప్పటిదాక నేల బా
ధించుట నన్ను నీ తెలివి తేటలు మెచ్చితి మింక చాలు లే
వంచకుడా! పరాక్రమము భక్తుల చెంతనటయ్య! నాపుటల్

ఆడితి కొన్ని యాటలు మహాద్భుతతాండవసూక్తమైన నీ
క్రీడలముందు గొంతు సవరించి ఒకించుక గద్గదస్వనిన్
పాడితి కొన్ని పాటలు శివా! పదమ్ములో మంజులమ్ములో
చూడకుమయ్య! భక్తిపరిశుద్ధపథంబున నాకు నొప్పుతున్

నీ వెలుగుల్ కనుంగొనగ నేనొనరించిన అల్పయత్నముల్
దేవర కించుకయేనియును తృప్తి కొసంగక పోవచ్చు నా
భావనలో తపమ్మునకు ప్రాప్తి యొకించుక తగ్గవచ్చు కా
నీ విభు? నీకృపాగతి జనించిన వెల్గది తగ్గనీకుమా!

విశ్వము నీటబోయినను వెల్గులలోపలి వెల్గువైన నీ
శాశ్వతతత్త్వమందుగల సత్యము వీడగబోను దివ్యధా
వాశ్వము నెక్కి వచ్చితి త్రియంబక! అంబరకేశ! దేవ! వి
శ్వేశ్వర! ప్రేమమూర్తి! భవదిచ్ఛ ప్రసన్నతనొందగాబ్రతిన్

గర్వము వీడితిన్ విహితకర్మములన్ త్యజియించివేసితిన్
సర్వము నీకు నర్పణము సల్పితి ఏదటులైన విశ్వమున్
నిర్వహణంబు జేయగల నీ వెలుగున్ భజియించుచుంటినో
శర్వ! మరేమియున్ వలదు జన్మపరంపర సంహరింపవే

శివసాహస్రి

పరమశివా! జగద్గురూ! దివాకరచంద్ర కృశానులోచనా!
వరకవితాప్రియా! హృదయబాంధవ! అమరమౌనిశేఖరా!
పురహర! శంకరా! భుజగభూషణ! ప్రేమ ననుగ్రహింపవే
హరహర! విశ్వనాధ! కరుణాకర! నన్ను పరిగ్రహింపవే!

